# ప్రబోధ



రచయిత :

త్రిమత ఏకైక గురువు, ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త
ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

www.thraithashakam.org







# ప్రబోధ

రచయిత : త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు





ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)



త్రైత శకము–39 ఆరవ ముద్రణ : అక్టోబర్–2017

ప్రతులు : 1000 **వెల : 180 /-**



01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్దమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్దమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన
77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు.
90) ఏది సత్యము-ఏది అసత్యము.
91) ఒక వ్యక్తి రెండు కోణములు.
92) సుప్రసిద్ధి బోధ.
93) మానవత్వము.
94) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
95) రావణబ్రహ్మ.
96) రాజకీయము×రాజకీయము.
97) ఉగ్రవాదము స్వర్గము కొరకే.
98) రూపము మారిన గీత.
99) మధ్యమ దైవగ్రంథములో రత్న వాక్యములు.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు–అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్–అలక్‌నిరంజన్.
05. మాయకుడు–అమాయకుడు.
06. తల్లి తండ్రి–గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ–పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం–దేహం మోహం.
11. ఎదమీదముద్ర–తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు–రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు–ఆరు–తొమ్మిది.
15. మాయ మర్మము– ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం–లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము–మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు–ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం– తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం– రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు–కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు–అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్టి-సృష్టికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?

79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము
125. అక్షర జ్ఞానము
126. లలా జలము
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా



**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి (ప్రెసిడెంట్)**
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)** MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్రెసిడెంట్)**
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా





**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# మానవ జీవిత ప్రాధాన్యత 

జగతిలో జీవరాసుల యొక్క జాతుల సంఖ్య మొత్తము 84 లక్షలని చెప్పుట గలదు. 84 లక్షల రకములని ఒక మొత్తమును చెప్పుటకు ఈ కాలములో ఎవరి దగ్గర సరియైన వివరణ లేదు.

మిగతా జీవరాసులను తన అదుపులో పెట్టుకొను స్థోమత ఒక్క మానవ జాతికే కలదు. తలలోని బుద్ధి విధానము ఎంతో గొప్పగనున్న మానవ జాతి అత్యున్నత జాతిగా లెక్కించబడుచున్నది. మిగతా పశు, పక్షి, క్రిమి, కీటక, వృక్ష, లతాదులన్ని మానవుని తెలివికంటే తక్కువ తెలివి కల్గియున్నవనుటలో సందేహము లేదు. జంతువులు, పక్షులు మొదలగు జీవరాసులన్నీ ఆహారము సంపాదించుకోవడము, తినడము, నిద్రించడము, సంభోగ సుఖమనుభవించడము తప్ప మిగతా ప్రపంచపు జ్ఞానము వాటికి లేదు. మానవునికి తినడము, నిద్రించడము, సంతానము పొందడమే కాక అనేకమైన విపరీతమైన ప్రపంచ జ్ఞానము తెలియును. ఎక్కువ తెలివి ఉన్న మానవుని చేతిలో, ఎంతో బలముకల్గి తెలివిలేని సింహములు కూడా ఓడిపోయి వశమైపోవుచున్నవి. దీనికంతటికీ కారణము మానవుని ప్రపంచ పరమైన బుద్ధి విశేషతని చెప్పవచ్చును. ప్రపంచరీత్యా బుద్ధిలో ఎంతో అత్యున్నత జాతియైన మానవజాతి, ప్రపంచ జ్ఞానములో అగ్రస్థానములో నిలిచిన మానవజాతి, ఎంతో గొప్ప పరిశోధనలు చేసి యాంత్రికముగా కంప్యూటర్లను, రోబోట్‌లను, భౌతికముగా జీన్సును, ఆయుధ పరముగా క్షిపణులను, అణుబాంబులను కనిపెట్టిన మానవజాతి, ఒకే ఒక పరమాత్మ జ్ఞానములో పూర్తిగా వెనుకబడి ఉన్నది.

జ్ఞానములు రెండు రకములు గలవు. ఒకటి ప్రపంచ జ్ఞానము, రెండవది పరమాత్మ జ్ఞానము. ప్రపంచ జ్ఞానములో ఎంతో ముందంజలో ఉన్న మానవుడు, పరమాత్మ జ్ఞానమునందు చిట్టచివరిలో గలడు. ఎంతో

గొప్ప తెలివి గల మానవుడు సూక్ష్మరూపములోనున్న పాపమేది పుణ్యమేది అని విచారించక, స్థూలమైన ప్రపంచ విషయములనే గొప్పగా తలచు కొంటూ, ఆధ్యాత్మికములో అవగాహన లేక, తన నిజస్థితి తెలియక, తనెవరో దేవుడెవరో తెలియక, తెలుసుకొనుటకు ప్రయత్నమూ చేయక, కాలమును వృథాగా గడుపుచూ కర్మను సంపాదించుకొనుచున్నాడు. మొదటి జ్ఞానమైన ప్రపంచ జ్ఞానములో చాలా గొప్పవాడైన మానవుడు, రెండవ జ్ఞానమైన పరమాత్మ విషయములో పూర్తి వెనుకబడి యుండగా, మిగతా జీవరాసులు ప్రపంచ జ్ఞానములో వెనుకబడి యుండి పరమాత్మ దారిలో మనిషికంటే ముందంజలో ఉన్నాయని చెప్పవచ్చును. మనిషికంటే తక్కువ కర్మ సంపాదించుకొనుచున్న జీవరాసులు మనిషివలె గుణములలో ఘాఢముగా చిక్కుకోలేదు. మనిషికంటే భిన్నముగా అన్ని గుణములలోను పూర్తి తక్కువగా ఉన్నవి. మనిషికి ఆశ అను గుణము గొప్పగా ఉంటే వాటికి అది అంత శాతము లేదు. అన్ని గుణములలోను ఎక్కువగా చిక్కుకొన్న మనిషి దేవునికి దూరమవుచుండగా, గుణములలో తక్కువగా చిక్కుకొన్న జీవరాసులు దేవునికి దగ్గరగానే ఉన్నవి. కర్మను అనుభవించడము తప్ప సంపాదించుకో లేని జంతువులు, తెలివిలేకున్ననూ దైవజ్ఞానములో ముందున్నట్లే. గుణములలో చిక్కి అనుభవించు కర్మకంటే ఎక్కువ కర్మ సంపాదించుకొను మానవుడు దైవజ్ఞానములో వెనుకబడినట్లే.

ప్రపంచజ్ఞానములో ఎంతో గొప్పవాడైన మానవుడు, డాక్టర్లుగా ఇంజనీర్లుగా విజ్ఞానమును సంపాదించుకొన్న మానవుడు, ఇప్పటికైన మేల్కొని తన బుద్ధిని ప్రపంచము మీద కాక, పరమాత్మ మీద ఉపయోగించి దైవజ్ఞానమును తెలియవచ్చును. చావు పుట్టుకలు లేని మోక్షమును పొందవచ్చును.

మానవ జీవితములో మేల్కొంటే మిగతా జీవరాసులకంటే వేగముగ దైవసన్నిధిని చేరవచ్చును. లేకపోతే మిగతా జీవరాసులకంటే పూర్తి వెనుకబడవచ్చును. మానవుని జీవితము ఎంత అజ్ఞానముతో కూడు కొన్నప్పటికీ, శ్రద్ధకల్గితే దైవమార్గములో తొందరగా ప్రవేశించవచ్చును. దైవమార్గ ప్రవేశము కొరకు మానవ జన్మయే మంచి అవకాశమని చెప్పవచ్చును. ఎందుకనగా! అన్ని జీవరాసులకంటే వెనుకబడిన వాడు మానవుడని తెలిసిన పరమాత్మ, మానవునికి జ్ఞానము కల్గించుటకు మనిషి అవతారములోనే వచ్చాడు. దైవజ్ఞానము మనిషికే అవసరము, కావున మనిషిగానే పుట్టి మనిషికి కావలసిన జ్ఞానమును చెప్పిపోవడము జరిగినది. దేవుడే వచ్చి పుట్టిన జన్మ మనిషిది. కావున దైవ విషయములను అర్థము చేసుకొంటే మనిషియే పూర్తి అర్థము చేసుకోవచ్చును. అటువంటి అవకాశము దేవుడు తాను జన్మించి కల్పించాడు. జంతువులలో దేవుడు జన్మించలేదు. మనుషలలోనే జన్మించడమంటే మనుషలకు జ్ఞానము ఎంత అవసరమో చెప్పకనే తెలియుచున్నది.

మనిషి దైవజ్ఞానమును తెలియాలంటే గురువును ఆశ్రయించ వలసిందే. గురువు లభించిన తర్వాత నమ్మకమనునది ముఖ్యముగా ఉండ వలయును. ఆ నమ్మిక లేనిచో గురువువద్ద నుంచి గ్రహించునది ఏమియు ఉండదు. నమ్మిక యున్నవాడే గురువువద్ద నుండి సర్వము గ్రహించవచ్చును. నమ్మకము అనునదియే భక్తి. భక్తి లేనివాడు ఏ మనిషి అయిన నిష్ప్రయోజకుడే. మానవజన్మ ఎత్తి మనకున్న తెలివంతయూ కొంత కాలముండు ప్రపంచములో వినియోగించి చనిపోవుచున్నాము కదా! ఏమి ప్రయోజనము? మన తెలివి ఏ దాని మీద ఉపయోగించవలయునో తెలుసుకొని, దానిమీద ఉపయోగించిన మానవజన్మకు సార్థకత ఏర్పడును.

అట్లుకాని ఎడల పశువులకు మనకు ఏమి తేడా ఉన్నది? అవి పని చేయుచున్నవి, తింటున్నవి. అట్లే మనమూ పని చేయుచున్నాము, తింటున్నాము, అటువంటపుడు పశువులతో సమానమైపోతాము. కావున అట్లు కాకుండా మానవజన్మను ప్రత్యేక పరచవలయునంటే, ఏ జీవరాసి చేయని దానిని మనము చేయవలయును. అదియే పరమాత్మను సాధించు సాధన. ప్రతి ఒక్కరు సాధనపరులై మానవజన్మ అన్ని జన్మలకంటే ఉత్తమమైనదని నిరూపించండి. మీ జీవితమును నానా మార్గముల నుండి పరమాత్మ మార్గమునకు మరలించుకోండి.

*****

# చర, అచర ప్రకృతి

ప్రకృతి అనగా కంటికి కనుపించునదని అర్థము. స్థావర జంగమ రూపమైయున్నదంతయూ ప్రకృతియే. ప్రకృతిని రెండుగా చెప్పవచ్చును. ఒకటి చర ప్రకృతి, రెండు అచర ప్రకృతి. వీటినే చేతన అచేతన ప్రకృతులు అనికూడా అందురు. చేతన అచేతన ప్రకృతులు ఎట్లు తయారైనవి? అనగా!

చెప్పుటకు వ్రాయుటకు అందని పరమాత్మ నుంచి మొదట ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు శక్తి నిర్ముక్తములైన భాగములు బయల్పడినవి. బయల్పడిన తరువాత ఆకాశము రెండు భాగములాయెను. గాలి రెండు భాగములాయెను. అగ్ని రెండు భాగములాయెను. నీరు రెండు భాగములాయెను. భూమి రెండు భాగములాయెను. ఆకాశము రెండు భాగములైనది కదా! అందు మొదటి భాగము సగము మనకు అర్ధగోళాకృతిలో పైన కన్పించుచునే ఉన్నది.

గాలియు రెండు భాగములైనది కదా! అందు మొదటి భాగము సగము భూమి మొదలుకొని పైకి కొంతవరకు వ్యాపించి ఉన్నది. అగ్నియు రెండు భాగములైనది కదా! అందు మొదటి సగభాగము సూర్యున్ని మొదలుకొని భూమి వరకూ వ్యాపించి ఉన్నది. నీరు రెండు భాగములైనది కదా! అందు మొదటి సగభాగము భూ భాగము మీద సముద్రరూపముతో ఉండనే ఉన్నది. భూమి రెండు భాగములయందు కూడా మొదటి సగభాగము మీదనే మనము నివసించుచున్నాము. ఈ విధముగా ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి వలన ప్రపంచము ఏర్పడినది. దీనినే అచర ప్రకృతి అందురు. ఇక చర ప్రకృతి ఎట్లేర్పడినదనిన? ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి యొక్క రెండవ భాగములైన సగ సగ భాగములు ఉన్నవి కదా! అవి ఒక్కొక్కటి ఐదు భాగములుగా చీలిపోయినవి. ఇట్లు చీలిపోయి మొత్తము ఇరువదిఐదు అయినవి.

| | | | | |
|---|---|---|---|---|
| రెండవ సగభాగమైన | .... | ఆకాశము | ... | 5 భాగములు |
| రెండవ సగభాగమైన | .... | గాలి | ... | 5 భాగములు |
| రెండవ సగభాగమైన | .... | అగ్ని | ... | 5 భాగములు |
| రెండవ సగభాగమైన | .... | నీరు | ... | 5 భాగములు |
| రెండవ సగభాగమైన | .... | భూమి | ... | 5 భాగములు |

మొత్తము భాగములు 25. ఈ 25 భాగములు ఒక దానితో ఒకటి కలసి జీవశరీరములు ఏర్పడినవి. సగము ఆకాశము 5 భాగములైనది కదా! అందులోని మొదటి భాగము పరమాత్మ అంశతో కూడి జీవుడాయెను.

గాలిలోని ఒక భాగముతో కలసి మనస్సు ఏర్పడినది. అగ్నిలోని ఒక భాగముతో కలసి బుద్ధి ఏర్పడినది. నీరులోని ఒక భాగముతో కలసి చిత్తము ఏర్పడినది. భూమిలోని భాగముతో కలసి అహము ఏర్పడెను. ఇట్లు మొదటి ఆకాశ భాగము ఐదు ఇతర భాగములతో కూడి జీవుడు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహము తయారాయెను. వీటినే ఆకాశతత్త్వములు అందురు. మరియు అంతఃకరణములు అని కూడా అందురు.

ఆకాశము మొదటి భాగము 1+ పరమాత్మ అంశము = జీవుడు

ఆకాశము మొదటి భాగము 1+ గాలిలోని 1వ భాగము = మనస్సు

ఆకాశము మొదటి భాగము 1+ అగ్నిలోని 1వ భాగము = బుద్ధి

ఆకాశము మొదటి భాగము 1+ నీరులోని 1వ భాగము = చిత్తము

ఆకాశము మొదటి భాగము 1+ భూమిలోని 1వ భాగము = అహము

**జీవుడు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అను ఐదు ఆకాశము యొక్క మొదటి భాగము ద్వారా పుట్టినవని గుర్తుంచుకోవలెను.**

వాయువు కూడా ఐదు భాగములైనదికదా! అందు మొదటిది ఆకాశతత్త్వముతో కూడుకొని మనసైనది కదా! ఇక నాలుగు భాగములు మిగిలి ఉన్నవికదా! అందులోని రెండవ భాగము పరమాత్మ అంశతో కూడుకొని మన శరీరములో ఉన్న వ్యాన వాయువాయెను. వాయువు రెండవ భాగము ఆకాశములోని రెండవ భాగముతో కలియుట చేత సమాన వాయువు ఏర్పడెను. వాయువులోని రెండవ భాగము అగ్నిలోని రెండవ భాగముతో కలియుట చేత ఉదానవాయువు ఏర్పడెను. గాలిలోని రెండవ భాగము నీటిలోని రెండవ భాగముతో కలియుటచేత ప్రాణవాయువు

ఏర్పడెను. గాలిలోని రెండవ భాగము భూమిలోని రెండవ భాగముతో కలియుటచేత అపానవాయువు ఏర్పడెను. వీటినే వాయుతత్త్వములు అందురు. మరియు పంచప్రాణములు అనికూడా అందురు.

గాలి రెండవ భాగము + పరమాత్మ అంశము = వ్యానవాయువు

గాలి రెండవ భాగము + ఆకాశ రెండవ భాగము = సమానవాయువు

గాలి రెండవ భాగము + అగ్ని రెండవ భాగము = ఉదానవాయువు

గాలి రెండవ భాగము + నీరు రెండవ భాగము = ప్రాణవాయువు

గాలి రెండవ భాగము + భూమి రెండవ భాగము = అపానవాయువు

**వ్యాన, సమాన, ఉదాన, ప్రాణ, అపాన వాయువులు ఐదు గాలియొక్క రెండవ భాగమునుండి పుట్టినవని తెలియవలెను.**

అగ్నియు కూడా ఐదు భాగములైనది కదా! అందు మొదటిది ఆకాశతత్త్వముతో కూడి బుద్ధిగా మారిపోయెను. రెండవది గాలితో కూడుకొని ఉదానవాయువాయెను. ఇక అగ్నిలో మూడు భాగములు మిగిలినవి. అందు మూడవ భాగము పరమాత్మ అంశతో కూడుకొని కన్నుగా తయారాయెను. ఆకాశములోని మూడవ భాగముతో కలసి చెవిగా తయారాయెను. వాయువులోని మూడవ భాగముతో కలసి చర్మముగా ఏర్పడెను. మరియు నీటిలోని మూడవ భాగముతో కలిసి నాలుకగా ఏర్పడెను. అట్లే భూభాగములోని మూడవ భాగముతో కలసి ముక్కుగా ఏర్పడెను. ఈ విధముగానే అగ్నితో తయారైన వాటినే జ్ఞానేంద్రియములు అని అందురు. మరియు అగ్నితత్త్వములు అనికూడా అందురు.

అగ్నిలోని మూడవ భాగము + పరమాత్మ అంశ = కన్నులు

అగ్నిలోని మూడవ భాగము + ఆకాశ మూడవ భాగము = చెవులు

అగ్నిలోని మూడవ భాగము + గాలి మూడవ భాగము = చర్మము

అగ్నిలోని మూడవ భాగము + నీరు మూడవ భాగము = నాలుక

అగ్నిలోని మూడవ భాగము + భూమి మూడవ భాగము = ముక్కు

**కన్ను, చెవి, చర్మము, నాలుక, ముక్కు అనబడు విషయసేకరణ భాగాలు ఐదు అగ్ని మూడవ భాగమునుండి పుట్టినవని జ్ఞప్తికి పెట్టుకోవలెను.**

నీరు కూడా ఐదు భాగములైనది కదా! అందు ఒక భాగము ఆకాశముతో కలసి చిత్తముగా, రెండవ భాగము గాలితో కలసి ప్రాణ వాయువుగా, మూడవ భాగము అగ్నితో కలసి నాలుకగా ఏర్పడినది కదా! ఇక మిగిలిన నాల్గవ భాగము పరమాత్మ అంశముతో కూడుకొని రసముగా(రుచి) తయారాయెను. ఆకాశములోని నాల్గవ భాగముతో కూడుకొని శబ్దముగా, గాలిలోని నాల్గవ భాగముతో కూడుకొని స్పర్శగా, అగ్నిలోని నాల్గవ భాగముతో కూడుకొని రూపముగా, భూమిలోని నాల్గవ భాగముతో కూడుకొని గంథము (వాసన) గా తయారాయెను. వీటిని నీటితత్త్వములు అని అందురు.

నీటిలోని నాల్గవ భాగము + పరమాత్మ అంశ = రసము (రుచి)

నీటిలోని నాల్గవ భాగము + ఆకాశము నాల్గవ భాగము = శబ్దము

నీటిలోని నాల్గవ భాగము + గాలి నాల్గవ భాగము = స్పర్శ

నీటిలోని నాల్గవ భాగము + అగ్ని నాల్గవ భాగము = రూపము

నీటిలోని నాల్గవ భాగము + భూమి నాల్గవ భాగము = గంధము (వాసన)

**రుచి, శబ్ద, స్పర్శ, రూప, వాసన అను విషయకూడలులు ఐదు నీటి నాల్గవ భాగము నుండి పుట్టినవని మరువకూడదు.**

భూమి కూడా ఐదు భాగములైనది కదా! అందు ఒక భాగము ఆకాశముతో కలిసి అహంకారము, రెండవ భాగము గాలితో కలిసి అపానవాయువు, మూడవ భాగము అగ్నితో కలసి ముక్కు, నాల్గవ భాగము నీటితో కలిసి గంధము తయారైనవి కదా! మిగిలిన ఐదవ భాగము పరమాత్మ అంశతో కలిసి గుదము, ఆకాశ ఐదవ భాగముతో కలిసి నోరు, వాయువు ఐదవ భాగముతో కలసి చేతులు, అగ్ని ఐదవ భాగముతో కలిసి పాదములు, నీటి ఐదవ భాగముతో కలిసి లింగము తయారాయెను. వీటినే కర్మేంద్రియములు అని అందురు.

భూమి ఐదవ భాగము + పరమాత్మ అంశ = గుదము

భూమి ఐదవ భాగము + ఆకాశ ఐదవ భాగము = నోరు

భూమి ఐదవ భాగము + గాలి ఐదవ భాగము = చేతులు

భూమి ఐదవ భాగము + అగ్ని ఐదవ భాగము = పాదములు

భూమి ఐదవ భాగము + నీటి ఐదవ భాగము = లింగము

**గుదము, నోరు, చేతులు, పాదములు, స్త్రీలకైతే యోని పురుషులకైతే లింగము భూమి ఐదవభాగము చేత తయారైనవని గుర్తుంచుకోవలెను.**

ఈ విధముగా సగభాగములుగా మిగిలిపోయిన ఐదు శక్తులు మొత్తము 25 భాగములై, ఒక దానితో ఒకటి కలసి ప్రపంచములో జీవరూప

శరీరములై సంచరింపజొచ్చెను. దీనినే చరప్రకృతి అనియు చేతనప్రకృతి అనియు అందురు. ఇట్లు అచేతనమైన ప్రపంచము, చేతనమైన జీవ శరీరములు కలసి **"ప్రకృతి"** అని అనబడెను. అందువలన ప్రకృతిని విభజించి ఒకటి చేతన, రెండవది అచేతన ప్రకృతి అని చెప్పవచ్చును. 1) చేతనము అనగా సర్వజీవరాసుల మొత్తము శరీరములని అర్థము. దీనినే చర అని, జగతి అని అందురు. 2) అచేతనము అనగా ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అనునవి. వీటినే అచర అనియు అందురు. అచేతనము యొక్క గాలి, ఆకాశము, అగ్ని, నీరు, భూమితో ప్రపంచము ఏర్పడినది. చేతనము యొక్క శరీరములు గల జీవరాసులు అచేతనమను ప్రపంచములో నిండుకొని పోయినవి అనగా ఇపుడు మానవశరీరము ధరించియున్న మనము కూడా ప్రకృతిలోని ఒక భాగమే.

భగవద్గీతయందు విజ్ఞానయోగములో పరమాత్మ ఏమి చెప్పుచున్నా డనగా **"జీవరాసుల యొక్క చావు పుట్టుకలను ఈ చేతన అచేతన ప్రకృతులు చేయించుచుండును, నేను కారణభూతునిగా మాత్రము నిలిచిఉందును"** అని అన్నాడు మరియు ప్రతి గుణము ఈ ప్రకృతుల వలననే పుట్టుచున్నవని జ్ఞాని తెలుసుకొనును, ప్రకృతి నా ఆధీనమందు ఉన్నది. జీవరాసుల పాపపుణ్యములను అనుసరించి నా ప్రకృతే వారికి కష్టసుఖములను, లాభ నష్టములను కలుగచేయుచుండును. నేను మాత్రము అన్నిటికీ సాక్షి మాత్రునిగా నిలిచి చూచుచుందును. ఇటువంటి నన్ను తెలుసుకొనుట యోగులకు మాత్రమే సాధ్యము. నేను పైన ఆకాశము మొదలుకొని భూమివరకూ సర్వదిక్కుల వ్యాపించి, అచేతన ప్రకృతియందు సూదిమోపను కూడా సంధులేక నిండుకొని ఉన్నాను. అదే విధముగా చేతన ప్రకృతి అయిన అన్ని శరీరములందు పాదములు మొదలుకొని శిరస్సు వరకూ

వ్యాపించి ఉన్నాను. అందువలననే నాకు తెలియకుండా ఈ చర అచర ప్రపంచములో ఏమియూ జరుగదు. ఈ చరాచర ప్రపంచమందు రాత్రిగానీ, పగలుగానీ ఏ సమయమునందుగానీ, ఏ స్థలమునందు గానీ, జరిగినది, జరుగుచున్నది, జరుగబోవునది నాకు తెలియును. అందువలననే విజ్ఞాన యోగములో **"నాకు తెలియు భూత జాలములకు జగతిలో జరిగినట్టి, జరుగబోవునట్టి వృత్తాంతములు, ఇట్టి నన్నెరుంగడెవడు"** అన్నాను, మరియు విజ్ఞానయోగములోనే **"సర్వ భూతములకు జన్మ ఈ చేతనాచేతన ప్రకృతులు చేయించుచుండు, నేను హేతువగుదు అఖిల జగముల పుట్టుకకు మరియు చావులకు"** అన్నాను. ఇపుడు నీకు కానీ ఎవరికైనాకానీ చర అచర ప్రకృతి ఏ విధముగా ప్రళయసంభవములు చేయించుచున్నదని? ప్రశ్న రావచ్చును. దానిని గురించి విశదీకరించుకొందాము.

ఈ విషయమై దేవుడేమనుచున్నాడంటే **"నా అచేతన (అచర) ప్రకృతి ఐదు భాగములుగా ఉన్నది కదా! అందు గాలిచెలరేగినంత మాత్రమున ఏ వస్తువు దానికి తట్టుకొనదు. పెద్ద కొండనైనా పైకి ఎత్తి గిరగిర త్రిప్పి కొన్ని మైళ్ల దూరములో పారవేయ గలదు. పెద్ద చెట్లను సహితము క్రూకటి వ్రేళ్లతో సహా పెరికి వేయగలదు. ఇంతటి బలమైన నా ఆధీనములో ఉన్న గాలి ఇళ్లను, వృక్షములను, భూమి మీద వస్తువులను తారుమారు చేయగలదు. ప్రకృతి శక్తులలో ఒకటైన గాలి విజృంభించినదా! ప్రపంచములో ఏ జీవరాసి మిగలదు. ఇక అగ్ని అందామా దానికి లొంగని వస్తువంటూ ఏదియూ లేదు. ప్రపంచములో రాళ్ళను, ఇనుమును, చెట్లను, మనుషులను, సర్వ జీవరాసులను కాల్చి బూడిద చేస్తుంది. తర్వాత నీళ్ళు అందామా ఇది విజృంభించిన సర్వప్రపంచములను ముంచివేయ గలదు అన్నియు దానియందు లయించిపోవలసిందే. అదే విధముగా భూమికి**

**కోపము వచ్చినదా పైది క్రిందికి, క్రిందిది పైకి చేసి అన్నిటినీ భూసమాధి చేస్తుంది. ఈ విధముగా నా ప్రకృతి అయిన ఐదుశక్తులు ఒకే మారు చెలరేగినచో వేరే చెప్పనవసరము లేదు. ఈ ప్రకృతిలోనే చేతనమై నిలిచియున్న ఈ జీవరూప ప్రపంచమంతా నాప్రకృతికి ఆధీనమైయున్నది" అన్నాడు. ఆ విధముగా చెప్పిన దేవుని మాటవిని కొంతమంది ఏమను చున్నారనగా! రోగము వచ్చి చనిపోవుచున్న జీవులను ప్రకృతి బాధించలేదు కదా? అని అంటున్నారు. వారికి పరమాత్మ ఏమి చెప్పుచున్నాడనగా "మాయతో కప్పియున్న మీరు నన్ను, నామహత్యమును తెలియక అలా అనుచున్నారే గానీ వేరుకాదు దాని రహస్యము తెలియ చెప్పుచున్నాను సావధానముగా వినండి"** అన్నాడు.

"సర్వజీవరాసుల శరీరములు పంచభూతములతోనే కదా నిర్మాణమైనవి. ఈ శరీరరూపమైయున్న దానినే కదా, చేతనా ప్రకృతి అనుచున్నాము. ఈ ప్రకృతియందు ఒక గాలి చెలరేగినదా దగ్గులు, తుమ్ములు బయలుదేరును. దీనినే పడిశము పట్టినది అంటాము. దీని ద్వారా జీవులు బాధపడడము లేదా? ఇంకా ఉబ్బసరోగము బయలుదేరు చున్నది. దీనిద్వారా జీవులు బాధపడడములేదా? అపానవాయువు ఎక్కువ అయినదా కడుపు ఉబ్బరింపు నొప్పి బేదులు వస్తున్నవి. దీని ద్వారా బాధ పడడములేదా? ఉపవాయువైన ధనుంజయవాయువు వ్యతిరేఖించినదా గర్భములోని బిడ్డ బయటికే రాకపోవును. దాని ద్వారా జీవులు బాధపడడము లేదా? వ్యాన సమాన వాయువులు వ్యతిరేఖించినట్లయితే శరీర అవయవములు సరిసమాన బలమునే కోల్పోవును. ఒక గాలికి జీవుడు బాధ అనుభవించి మరణించుస్థితి ఏర్పడుచున్నది. అట్లే శరీరములోయున్న నీరు వ్యతిరేఖించిన శరీరమంతయూ నీరు నిండుకొని కాళ్లు చేతులు

ఊదుకొని పోవును. దాని ద్వారా జీవుడు ఎంతో బాధ అనుభవించవలసి వస్తుంది మరియు మూత్రవ్యాధి సంభవించును. నోట చెమ్మ తగ్గిపోవును మెదడునందు తేమ తగ్గుట వలన నిద్ర తక్కువగును, కాళ్లు చేతులు బరువెక్కి తిమ్మిర్లు (జోములు) వచ్చి స్పర్శ కోల్పోవును, చూపు తగ్గును, శబ్దము వినరాక పోవును. ముక్కులు వాసనను గ్రహించలేక పోవును. నాలుక రుచి తెలుసుకోలేకపోవును. ఇట్లు ఏది లోపమైనా జీవుడు బాధపడవలసి వచ్చును మరియు మరణించవలసి వచ్చుచున్నది. చేతన ప్రకృతిలో ఒక భాగమైన భూమి చెలరేగి కంపించినదా, కాళ్లు చేతులు చచ్చుపడుటో, నొప్పులు వచ్చుటయో సంభవించును. మూలవ్యాధి బయలుదేరును, సుఖవ్యాధులు కలుగును. దంతబాధయు వచ్చును, మరియు మూర్ఛరోగము రావచ్చును. ఇట్లు భూమి బాధించి కడకు చంపుతున్నది. చేతన ప్రకృతిలో యున్న ఆకాశము వ్యతిరేఖించిన ముక్కుపుట రంధ్రములు మూసుకపోయి శ్వాస ఆడుటకు కష్టమగును. ముక్కులు పూర్తి మూసుకున్నా, శ్వాస నిరోధించబడును. గొంతులోని కండరములు వాపు ఎక్కి కంఠ రంధ్రము మూయబడి అన్నము తినుటకు, నీళ్లు త్రాగుటకు కూడా కష్టమగును. మూత్రనాళము కూడా మూసుకపోయి మూత్రము పోయుటకే కష్టమగును. మనస్సు స్థిమితము లేక మనోరోగము ఏర్పడును. మరియు పిచ్చి కూడా సంభవింప వచ్చును. ఇట్లు అనేకమైన శరీర సంబంధమైన రోగములు బయలుదేరి జీవున్ని బాధించి చివరికి దానివలననే చచ్చునట్లు కూడా చేయుచున్నవి. ఇంకనూ చేతన ప్రకృతి అయిన అగ్ని చెలరేగిన ఎన్నియో రోగములు బయలుదేరి జీవులని చంపుచున్నవి. ఈ విధముగా చేతన, అచేతన ప్రకృతులు జీవుని మృత్యుకూపమున వేయుచున్నవి. మరియు ప్రకృతియే ఒక భాగముతో ఒక భాగము కూడుకొని జీవులకు జన్మ

ఇచ్చుచున్నది. కావున జీవుల ప్రళయ సంభవములకు నా ప్రకృతియే కారణమన్నాను".

"చేతన, అచేతన ప్రకృతులే సర్వజీవరాసులకు చావు పుట్టుకలను పాపపుణ్యములను అనుసరించి ఇచ్చుచున్నవి. నేను ప్రకృతికి అధ్యక్షత వహించి ఉన్నాను. అందువలననే జగము చక్రమువలె తిరుగుచుండును నేను ఎవరి పాపమును కానీ, పుణ్యమును కానీ తొలగించను. నాకు ప్రపంచములో అందరూ సమానులే, కానీ నా భక్తులు మాత్రము నాకు పరమ ప్రియులు. వారి పాపపుణ్యములు మాత్రము నాచే ఇవ్వబడునట్టి జ్ఞానమను అగ్ని చేత కాలి బూడిదై, వారు అనుభవించుటకు ఏమాత్రము పనికి రాకుండా పోవుచున్నవి. ప్రపంచములో నా భక్తులైనవారు నాకు మిగుల ప్రియులు. నాకు నిత్య సంబంధులు వారే. కాబట్టి నేనే వారు, వారే నేను అని తలంచుచున్నాను. వారికి నా నిమిత్తమైయున్న జ్ఞానము సంప్రాప్తమగునట్లు చేయుచున్నాను. దానితో వారి కర్మ అయిన పాప పుణ్యములు రెండునూ నిశ్శేషముగా నశించి నా లోనికి ఐక్యమగుచున్నారు. అందువలననే నేను నా గీతా శాస్త్రమందు **"నన్ను మాత్రము నమ్ము కొనుమర్జునా, నిన్ను సర్వపాప నియచంబులోనుండి ముక్తుని చేతునని"** అన్నాను. అర్జునుడే కాదు ఎవరైనా నేను చెప్పినట్లు నన్ను నమ్ముకొనిన వారిని నిస్సంశయముగా 'మాయ' అను సముద్రము నుండి బయటికి వేతును. నేనే ప్రపంచము అంతటా నిండుకొనియున్నాను. నాకు తెలియకుండా ఏదీ జరుగదు. అన్నిటినీ నడిపించునది నేనే. అన్ని జీవరాసుల ఆత్మను నేనేనని ఎవరు తెలిసి నన్నే మనస్సున అనుక్షణము మరువకయున్నారో అటువంటి భక్తునికి చాలా దగ్గర వాడనైయున్నాను. నా భక్తులు నా ప్రకృతికి అతీతులు కాగలరు. నా భక్తులను నా ప్రకృతి

ఏమియు చేయజాలదు. నా ప్రకృతిలోని అగ్ని కాల్చలేదు, నా భక్తుడు కాలడు. నా ప్రకృతిలోని నీళ్లు తడుపలేవు, నా భక్తుడు తడువడు. అట్లే గాలికి కొట్టుకుపోడు, భూమి నలుపలేదు, ఎండిపోడు, తడుపబడడు, కాలడు, తెగడు, అన్నిటికీ అతీతుడై నా మాదిరే నా భక్తుడు మారిపోగలడు. వాడే నేనై, నేనే వాడౌతాను ఇదే మోక్షము. ఇదే జీవబ్రహ్మ ఐక్యసంధానము". అని చెప్పిన దేవుడు ఇంకా ఏమనుచున్నాడనగా!

"ఓ జీవుడా! నీవు నన్ను మాత్రము నమ్ముకొని, సర్వవేళలా సర్వావస్థలయందు నా నిరాకార స్వరూపమునే తలంచుచుండుము. అనగా యోగములో సక్రమముగా ఉండుము. కొంత కాలమునకు నీవు నామాదిరే మారిపోగలవు. నీవు నేనైన తర్వాత ప్రకృతికే నిర్మక్తధాతనైన నన్ను ప్రకృతి ఏమీ చేయలేదు. అపుడు నీవు నాయందు ఐక్యమై ఉన్నావు కాబట్టి ప్రకృతి నిన్ను ఏమీ చేయలేదు" అని భగవంతుడు అన్నాడు. కావున సర్వజనులు ప్రకృతిలో చిక్కుకొని బాధపడకుండా తప్పించుకొనుటకు నేటినుండి జ్ఞానమను అగ్నిని సంపాదించుటకు ప్రయత్నము చేయండి.

*****

# మోక్షము

ప్రతి మానవుడు మోక్షము అనగా ఏమి? అని తెలుసుకోవలయును. మోక్షమును గురించి తెలుసుకోలేక పోయిన మానవుడు ఆత్మను తెలుసుకొనుటకు ఏమాత్రము ప్రయత్నించడు. ఎవరైనా చెప్పినప్పటికీ దానితో మనకేమి ప్రయోజనమున్నది? అని అంటాడు. మోక్షము యొక్క విలువ తెలుసుకోలేని మానవుని జీవితము వాసనలేని పువ్వుతో సమానము.

మోక్షము యొక్క అర్థము తెలుసుకోలేని మానవుడు "పుట్టలోని చెదలు పుట్టదా గిట్టదా" అన్నట్లు ఉన్నను ఊడినను ఒక్కటే, మోక్షమును గురించి తెలుసుకోలేని వారి భక్తి, గమ్యము తెలియని ప్రయాణములాగ ఉండును. కొందరికి మోక్షము గురించి తెల్పి, మోక్షము చేరిన జన్మించనవసరము లేదనినా, దానివిలువ తెలియని అజ్ఞానులు "అక్కడపోయి ఊరకనేయుంటే ప్రొద్దు ఎలాగ గడచును? చచ్చి పుట్టుతూ ఉంటేకదా ప్రొద్దుపోయేది" అని అంటున్నారు. మరియు "ఊరకనే ఉంటే ఏమి బాగుంటుంది, భూలోకములో పుట్టి అన్ని సుఖములు పొందితేకదా బాగుండేది" అని కూడా అంటున్నారు. ఇంకనూ "మీకు తిక్కపట్టి మోక్షము మోక్షము అంటున్నారు, అది మాకు బట్టదు" అని జ్ఞానులనే మందలిస్తు అంటున్నారు. మోక్షము అంటే ఏమిటి? అన్న విషయము తెలియని వారికి పరమాత్మను గురించి చెప్పితే గాలిలేని గదిలో వేసి తలుపు మూసినట్లగును. కావున వారు వినకపోవడమే కాక, అక్కడనుంచి ఎప్పుడు బయటపడుదుమా అని ఆలోచించి తప్పుకుందురు. మోక్షమును గురించి తెలుసుకోలేని వారు ఎవరూ పరమాత్మను గురించి తెలుసుకొనుటకు ఇష్టపడరు. మరియు పరమాత్మ విషయములయందుండు వారిని చూచి అసహ్యించుకొందురు. కావున ప్రతి మానవుడు మొదట మోక్షమును గురించి తెలుసుకోవలయును.

మోక్షమును గురించి కొంత వివరించుకొని చూచినట్లయితే అది అజ్ఞానులు అనుకొన్నట్లు ఒక లోకముకాదు. మోక్షము ఎక్కడోయున్నదని కొందరనుకొనుచుందురు. అది ఎక్కడోలేదు అంతటా ఉన్నది. మోక్షము పొందిన జీవుడు కాలముగానే మారిపోవుచున్నాడు. కాలమే తానైన తర్వాత ప్రొద్దుపోదు అను సమస్య ఎలాగ ఉండును? మోక్షమును పొందిన జీవుడు అణువణువునా నిండుకొనిపోయి, ప్రపంచములోయున్న కష్టములను

పొందక, అన్నిటికీ సాక్షిగా ఉంటున్నాడు కావున అక్కడకు పోయి ఏమి చేయవలెనను సమస్య ఏమాత్రమూ ఉండదు. మోక్షమును పొందిన జీవుడు ప్రకృతి లోపలా బయటా ప్రపంచమంతటా ఉన్నాడు, కావున ప్రకృతి ఏమియు చేయలేదు. మామూలు మానవులు ప్రకృతికి లోపలనే ఉండుట వలన వారిని ప్రకృతి నాశనము చేయగలదు. మోక్షము పొందిన జీవుడు అగ్ని కూడా తానే అయివున్న దానివలన అగ్నికి కాలును అను సమస్య ఏమాత్రము ఉండదు. మోక్షము పొందని జీవుడు అగ్ని తాను కాని దానివలన అగ్నికి కాలును. మోక్షము పొందిన జీవుడు గుణములకు అతీతుడు, అవి వానిని ఏమీ చేయజాలవు. మామూలు మానవుడు గుణములతో కూడుకొని ఉండును. గుణములు మానవున్ని ముప్పుతిప్పలు పెట్టుచున్నవి. మోక్షము పొందిన జీవుడు కంటికి కనపడక ఫలానా చోట ఉన్నాడని గుర్తించుటకు వీలులేక ఉన్నాడు. మామూలు మానవున్ని గుర్తించ వచ్చును. మోక్షము పొందిన జీవుడు ప్రళయమున ప్రపంచమంతయూ నాశనమైపోయిననూ తాను నాశనముకాక ఉండును. మోక్షము పొందిన జీవుడు ప్రపంచములో అన్ని శరీరములకు లోపలా బయటా ఉండును. మోక్షము పొందని మానవులు శరీరము లోపలనే ఉందురు. మోక్షము పొందిన జీవుడు అన్ని స్థలములను చూచుచుండును. దానిని పొందనివాడు అట్లు చూడలేడు. మోక్షము పొందిన జీవుడు ఒక స్థలమునుండి వేరొక స్థలముకు పోనవసరములేక అంతటా ఉండును. దానిని పొందనివాడు వ్యయ ప్రయాసలతో ఒక చోటినుండి మరొక చోటికి పోవలసి ఉండును. మోక్షము పొందిన జీవుడు అగ్నికి కాలడు, నీటికి తడువడు, గాలికి కొట్టుకు పోడు కావున వాడు భయపడడు. దానిని పొందని జీవుడు అగ్నికి, గాలికి, నీటికి నిత్యము భయపడవలసి ఉండును. మోక్షము పొందిన జీవికి

ఆహారము అవసరము లేదు. దానిని పొందని వానికి ఆహారము నిత్యము అవసరము. మోక్షము పొందినవాడు శాశ్వతముగా చెప్పరాని సుఖమును పొందుచూ తృప్తిగా ఉండును. దానిని పొందనివాడు క్షణకాల సుఖములను అనుభవించుచూ ఎల్లపుడూ అసంతృప్తిగానే ఉండును. మోక్షము పొందిన వాడు ఏమాత్రము బాధపడవలసి ఉండదు. దానిని పొందనివాడు అనేక బాధలు అనుభవించవలసి ఉండును. మోక్షము పొందినవానికంటే ఎవ్వరూ పెద్దగా ఉండరు. దానిని పొందని మానవునికి దేవుడనువాడు ఒకడు పెద్ద ఉన్నాడు. మోక్షము పొందినవాడు ఎల్లప్పుడూ ఒకే రకముగా ఉంటున్నాడు, పొందనివాడు అనేక జన్మలయందు బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము అను స్థితులను పొందుచున్నాడు. ఈ విధముగా చెప్పుచూ పోయిన అనేకముగా మోక్షము యొక్క విలువ ఉన్నది. దానిని గురించి పూర్తి చెప్పుటకు ఎవ్వరికీ చేతకాదు. ఇది అంతయూ తెలుసుకున్న మనము ఇపుడుండు స్థితి మంచిదా? లేక మోక్షస్థితి మంచిదా? అని మీరే ఆలోచించుకోవలసియున్నది.

మోక్షము యొక్క విలువ తెలియనివారు దానితో ఏమిపని అంటున్నారు. మోక్షము ముందర ఇపుడు మనము అనుభవించు స్థితి పర్వతము ముందర చిన్నరాయితో సమానమని వారికి తెలియదు. మోక్షము యొక్క విలువ తెలియనివారు పరమాత్మను గురించి తెలుసుకొనుటకు ప్రయత్నించరు. కావున మొదట ప్రతి ఒక్కరూ మోక్షమును గురించి తెలుసుకోవలయును. మోక్షమును గురించి తెలుసుకున్న తర్వాత దానిని పొందుటకు మార్గము అన్వేషించవలయును. మోక్షము పొందుటకు జ్ఞానమవసరము. జ్ఞానము పొందుటకు గురువు అవసరము. గురువు లభించిన తర్వాత వారి ద్వారా మోక్షమును పొందుటకు వీలున్నది.

మోక్షసామ్రాజ్యము పొందుటకు ద్వారము ఒక గురువే. కావున గురువును ఆశ్రయించి ఆయన ద్వారా జ్ఞానము, యోగము పొంది జన్మరహితమైన మోక్షము సంపాదించుకోండి, 60 లేక 70 సంవత్సరముల కాలము బ్రతుకు ఈ జన్మయందు 20 లేక 30 సంవత్సరములు ప్రపంచ చదువులు చదివి, పెద్దపెద్ద డిగ్రీలు సంపాదించుకొని, పెద్దవారము అని అనిపించుకొనినా ఆ విలువ అంతయూ చచ్చునంత వరకే ఉండును. డాక్టర్లుగా, ఇంజనీర్లుగా పట్టాపొందినా దాని ప్రయోజనము కొంతకాలమే ఉండును. ఎంత డబ్బు సంపాదించినా దానివద్ద మనముండునది కొంత కాలమే, ప్రపంచములో ఒక్కొక్క జన్మ కొంత కొంతకాలమే ఉండును. కావున ఈ జన్మ కూడా కొంతకాలమే ఉండును. చీకటిలో తాడును పాముని భ్రమించినట్లు, అజ్ఞానములో శాశ్వతముకాని దానిని, శాశ్వతము అనుకొని మనము ఎంతో పొరపాటుపడుచున్నాము. ఆ పొరపాటును తెలుసుకొని శాశ్వితము కాని ఈ జీవితమును నిర్లక్ష్యము చేసి, శాశ్వతమైన మోక్షము కోసము ప్రయత్నము చేయవలయును. మానవులమైన మనకు ఎంతో తెలివి ఉన్నది. దానిని ఉపయోగించి ఇంతకుముందు మోక్షము కోసము ప్రయత్నించిన వారిని గురించి ఆలోచించిన, మనకంటే ఎక్కువ తెలివియున్న వారే దానికి ప్రయత్నము చేసినట్లు తెలియును. మోక్షము అనుచూ మోసము చేయు దొంగభక్తులు ప్రపంచములో ఉండవచ్చును. వారిని చూచి మోక్షము అనునది చెడ్డది, దానిని ప్రయత్నించువారు అందరూ చెడ్డవారు అనుకోక, మోక్షము యొక్క సారాంశము మీదికి ఒకమారు మీ దృష్టితో పారచూడండి. మోక్షమును గురించి తెలుసుకోలేని జీవితము నిరర్థకము అని కూడా తెలుసుకోండి. **"మోక్షమును గురించి తెలుసుకున్న జన్మ సార్థకమైనట్లే"**నని తెలుసుకోండి.

*****

# యమలోకము - స్వర్గలోకము

జీవులు భూమి మీద పుట్టి నిత్యమూ కర్మములను చేయుచునే ఉన్నారు. జీవితములో పుట్టినది మొదలు చచ్చువరకు కష్టసుఖములను అనుభవించుచునే ఉన్నారు. జీవితకాలములో స్వార్థముకోసము చేయదగినవి, చేయరానివి చేసి పుణ్యము పాపము సంపాదించు కొనుచున్నారు. చేయు పనులయందు కంటికి కనపడక వచ్చు పాపపుణ్య భీతి ఏమాత్రము లేక ఉన్నారు. చేయుపనులయందు పాపము వచ్చునని తెలిసిననూ యమలోకమునకు పోయిన రోజు కదా నరకము అనుభవించునది, ఏనాడో వచ్చు నరకమునకు భయపడి ఈ రోజు మనకు అనుకూలమైన పనులను ఎందుకు మానుకోవలయునని, నరకము వచ్చినరోజు చూస్తాములే అని అనుకొంటున్నారు. పాపపుణ్యములు ఉన్నాయనీ తెలుసు, దానిని తప్పక అనుభవించవలయునననునదీ తెలుసు, కానీ ఏమాత్రము భయము లేక చేయుచున్నారంటే దాని నిజస్థితి తెలుసుకోలేదని అర్థమవుచున్నది.

కర్మ కారణము చేత జీవుడు భూమిమీద పుట్టుచున్నాడు. కర్మ అనగా పాపపుణ్యముల మిశ్రితము. పాపము వలన నరకము, పుణ్యము వలన సుఖము సంభవించుచున్నది. కొంత మందిని అడుగగా నరకము యమలోకములో, స్వర్గము దేవేంద్రలోకములో ఉన్నవని తెలుపుచున్నారు. మరియు పాపము చేసిన వారిని యమలోకములో యముడూ యమకింకర్లూ అనేక బాధలు పెట్టుచున్నారని, అక్కడ బాధలు అన్నియూ అనుభవించిన తర్వాత పుణ్యముఉంటే స్వర్గలోకమునకు పోయి సుఖాలు అనుభవించు చున్నారని చెప్పుచున్నారు. గీతయందు సాంఖ్యయోగమున **"జీవుడు శరీరమును వదలిన వెంటనే తల్లిగర్భములో పూర్తి తయారై, ప్రసవింపబడిన వేరొక శిశుశరీరములో పోయి దూరుచున్నాడు. ఎట్లనగా పాత వస్త్రమును**

**విడిచి క్రొత్త వస్త్రమును ధరించినట్లు"** అని భగవంతుడు చెప్పియుండగా మనము అజ్ఞానము వలన జీవుడు మరొక చోటయున్న యమలోకానికి పోవునని అనుకొనుచున్నాము. అట్లు జరగడము లేదని తెలిసినవారు చెప్పగా కొంతమంది వినక, జీవులు యమలోకానికి పోయి నరకమును అనుభవించకపోతే యమధర్మరాజు ఎక్కడికి పోవును? యమకింకర్లు ఎక్కడకి పోవుదురు? యమలోకము ఎందుకు? అని వాదించుచున్నారు. వీరి మాట ప్రకారము పోయిన గీతయందు చెప్పిన వాక్యము అబద్ధమగును. సరే గీత ప్రకారము పోయిన వీరి వాదన అబద్ధమగును. రెండునూ గట్టి వాదనలే కానీ పరమాత్మ యొక్క వాదన ఏనాటికీ అబద్ధము కాదు. మానవుల వాదన కూడ అబద్ధము కాదు కానీ కొంత తెలుసుకోవలసి ఉన్నది.

మానవులు పుట్టినది మొదలు కష్టసుఖములు అనుభవిస్తున్నారు. కొంతమంది ఎక్కువ సుఖము అనుభవించుచున్నారు. కొంతమంది ఎక్కువ కష్టమనుభవించుచున్నారు. ఒకడు ఏ పనీ చేయక ఊరకయున్నా అష్ట ఐశ్వర్యములు అనుభవించుచున్నాడు. ఒకడు దినమంతయూ ఎంతో శ్రమపడుచున్నా వానికి కడుపునిండా అన్నము దొరకడము లేదు. పరమాత్మ అంశ అందరియందు సమానమైనా కొంతమందికి కష్టము ఎందుకు సంభవించుచున్నదని ఎవరు ఆలోచించ లేదు. డబ్బు ఉన్నవాడు సుఖపడు చున్నాడు, లేనివాడు బాధపడుచున్నాడని అనుకొంటున్నారు. కానీ కష్ట సుఖములకు మూలకారణమైన పాప పుణ్యములను ఏమాత్రమూ గ్రహించక ఉన్నారు. తాను కష్టపడుచూ ఇతరుల కష్టములను చూస్తూ యున్నా, ఇవి ఎక్కడివి అని ఆలోచించడము లేదు. మనము పూర్వ జన్మమున సంపాదించుకున్న పాపపుణ్య ఫలితము కదా! అని తెలుసుకోలేదు. ఒకవేళ తెలిసివారు చెప్పిననూ నమ్మలేక ఉన్నారు. ఎవరు నమ్మినా నమ్మకపోయినా

పూర్వజన్మలో చేసిన పాపపుణ్యమే ఈ జన్మయందు తనకు తెలియకనే మానవుడు అనుభవించుచున్నాడు. అది ఎట్లనిన ఒక ఉద్యోగి ఒక నెల అంతయూ పని చేసిన దాని ఫలితముగా నెల ఆఖరున జీతము వచ్చును. ఆ జీతము అనగా ముందు నెల చేసిన పని ఫలితము రెండవ నెలంతయూ నిత్యావసర వస్తువులకై వినియోగించుచూ అనుభవించును. అట్లే ఒక కూలివాడు దినమంతయూ పొలములో పనిచేయగా దాని ఫలితము రెండవ దినమున అనుభవించుచున్నాడు. మరియు రైతు ఒక సంవత్సర మంతయూ కష్టపడి సేద్యము చేసి పంట పండించగా ఆ పంటను రెండవ సంవత్సరము అనుభవించుచున్నాడు. ఈ విధముగానే మానవుడు ఒక జన్మలో సంపాదించుకున్న పాపపుణ్యముల యొక్క ఫలితము రెండవ జన్మలోను, రెండవ జన్మలో సంపాదించుకున్న పాపపుణ్యములను మూడవ జన్మయందు అనుభవించుచున్నాడు. కావున శ్రీకృష్ణపరమాత్మ చెప్పినట్లు జీవుడు శరీరమును విడిచిన వెంటనే వేరే శరీరము ధరించుచున్నాడు. కానీ యమలోకమునకు పోలేదు. అందువలననే జీవుడు ముందు జన్మలో చేసుకొన్న పాపపుణ్యము ప్రకారము భూమిమీద కష్ట సుఖములను అనుభవించుచున్నాడు. ఒక జీవి అన్నీ చెడ్డపనులు చేయడము లేదు. అట్లే అన్నీ మంచిపనులు చేయడము లేదు. మంచి పనులయందు పుణ్యము, చెడ్డ పనులయందు పాపము ఎవరికి తెలికయకుండానే సంభవించుచున్నది. అందువలన ఏ జీవి అయినా పాపపుణ్య మిశ్రితుడై ఉండును. జీవుడు తన జీవిత కాలము ఎక్కువ మంచి కార్యములనే చేసియుంటే పుణ్యము ఎక్కువ లభించి ఉండును. అట్లుకాక జీవితకాలమున ఎక్కువ చెడ్డ పనులు చేసియుంటే పాపము ఎక్కువ సంభవించి ఉండును. కావుననే ఒక జీవి ఎక్కువ సుఖము అనుభవించడమూ, ఒక జీవి ఎక్కువ కష్టము అనుభవించడమూ భూమిమీద జరుగుచున్నది.

యమధర్మరాజు ఎక్కడ? యమకింకర్లు ఎక్కడ? యమలోకము ఎక్కడ? అను ప్రశ్నలకు సమాధానము ఏమనగా! గీతాశాస్త్రమున **'దండనాధికారులలో యముడను నేను'** అని పరమాత్మ అన్నాడు. కావున యమధర్మరాజు అన్ని శరీరములందు నివశించు ఆత్మ అనియూ, యమ కింకర్లు ఆత్మవలన ప్రేరేపితమై ఒక జీవుని బాధించు అన్ని రూపములు అనియూ తెలియుచున్నది. అందువలన పెద్దలు **'నానా రూపేణ కాల కింకరః'** అని అన్నారు. ఇక యమలోకమనిన జీవుడు కష్టపడు స్థలమేనన్న మాట. కావున భూలోకమే యమలోకమని తెలియుచున్నది. పాప కారణమైన కష్టములను యమధర్మరాజా? లేక యమకింకరులా? బాధించు చున్నది అను అనుమానము కొందరికి రావచ్చును. దానికి సమాధానము ఏమనాగా! తన శరీరముతో వచ్చు బాధలన్నియూ యమధర్మరాజు విధించునవేననీ, అట్లుకాక తనకంటే ఇతర రూపములగుండా వచ్చు ప్రతి బాధ యమకింకర్లు విధించునవేనని తెలియుచున్నది. మన శరీరమునందు ఎల్లవేళలా ఆత్మ ఉన్నది కదా! ఆత్మకు తెలియక ఏమియు చేయజాలము, కనుక సర్వపనులకూ ఆత్మ సాక్షిగా ఉంటున్నది. శరీరమునందున్న ఆత్మయే నవగ్రహముల చేత పాపపుణ్యములను గ్రహించి కర్మచక్రమందుంచి మరుజన్మమున అనుభవించునట్లు చేయుచున్నది.

మనము పాపపుణ్యములను అనుభవించుచున్నా, వాటిని మాయ చేత గ్రహించుకోలేకున్నాము. మాయయే పాపపుణ్యముల యొక్క నిజస్థితిని తెలియకుండా చేయుచున్నది. గ్రుడ్డివాడు ఏనుగు కాలుపట్టుకొని స్థంభమను కొని ఏనుగును గుర్తించలేకపోయినట్లు, మాయ అను గ్రుడ్డితనము చేత కనులు కనపడని వారు పాపపుణ్యములను అనుభవించుచున్నా ఎట్లు భ్రమించుచున్నారనగా!

మన మూటను మనమే మోయుచున్నామనుకొనుము, ఎవ్వరు మోయించలేదు కదా! నా మూటను నేనే మోయుచున్నాను కదా! అని అనుకోవడమే మాయ. మన మూటను మనము మోయుచున్నా, మోయించునది వేరొకటున్నది, అదే కర్మ. మనయందు మూటను వేరొక చోటికి తీసుకపోవలయునను కర్మ సంకల్పము కలిగియున్న కదా! మనము మోయుచున్నది. ప్రేరేపణకు కారణము కర్మ. కావున ఆ పనికి మూలము కర్మ. చేయుచున్న పని మనది కానీ లేక ఇంకెవరిదైన కానీ బరువు మోయడమేకదా! మూట భారము యొక్క బాధ అనుభవించుచున్నది జీవుడే కదా! కావున బాధను (శిక్షను) అనుభవించువాడు జీవుడు. శిక్షను విధించు వాడు కాలుడు (ఆత్మ) అట్లే కర్మ ప్రేరేపణ వలన ఎన్నియో పనులు చేయుచూ, అందు సంభవించు బాధలను అనుభవించుచూనే ఉన్నాము. ఒక మానవుడు గుండు ఎత్తుకొని నా అవసరము కొరకు నేను ఎత్తుకొని పోవుచున్నానని అనుకొనుచున్నాడు. నిజముగా జరుగుచున్నది పాపము అనుభవించడము అని తెలుసుకోలేకపోయినాడు. చనిపోయిన కుక్క శవమును లాగుచూ పోవుచున్నవాడు నాకు ఈ సమయములో యముడు కుక్క శవమును లాగు శిక్షను విధించినాడు కదా! అని తెలుసుకోలేకపోవుచున్నాడు. వంకాయల గంపను ఎత్తుకొని వ్యాపారము చేయుచున్నవాడు నాకు ఈ సమయములో యముడు వంకాయల గంపను తలపైకి ఎత్తి, దానిని మోయుచూ ఊరంతయు తిరుగునట్లు చేయుచున్నాడు కదా! అని తెలుసుకోలేకపోవుచున్నాడు. జలుబు (పడిశము) పట్టిన ఒక రోగి వేరే బావి నీరు త్రాగినందుకు జలుబు చేసినదని మాయచేత భ్రమించుచున్నాడు. జలుబుకు కారణము పాపము, ఆ పాపమును ఇపుడు అనుభవించు సమయము వచ్చినది కావున యముడు ఆ పాప ఫలితముగా నాకు

జలుబును కలుగచేసి, తలను నొప్పించుచున్నాడు అని తెలుసుకోలేక పోవుచున్నాడు. కడుపునొప్పి ఉన్నవాడు ఎందుకు వచ్చినది? లోపల బాధను ఎవరు విధించుచున్నారు? అని తెలుసుకోలేక పోవుచున్నాడు. కాని జ్ఞాని అయినవాడు తప్పులేనిదే శిక్ష ఉండదు, కావున ప్రతి బాధను యముడు న్యాయముగా ఎంత విధించవలయునో అంతే విధించును, అని తలంచుచుండును. యముడు మనయందే నివాసముండి మనలను ప్రేరేపించుచున్నాడు. ఒకనిని రైలుక్రింద పడునట్లుచేసి వానికి ఎంత బాధ కలుగవలయునో అంతే బాధపడునట్లు, ఎంత దెబ్బ తగులవలయునో అంతే తగులునట్లు చేయుచున్నాడు. ఈ విధముగా ఎన్నో కర్మములను మనము నిత్యమూ అనుభవించుచూ యున్ననూ, మాయచేత ఏమాత్రము తెలుసు కోలేక యముడు ఎక్కడో ఉన్నాడు, యమలోకము ఎక్కడో ఉన్నదని అనుకొనుచున్నాము. పామును చీమలు హింసించుచున్నవి కానీ, పాము పాలిటికి ఆ సమయములో చీమలు యమకింకర్లని తెలుసుకోలేక పోవుచున్నాము. చీమలను తొండలు తింటున్నవి. కానీ ఆ సమయములో చీమలకు తొండ యమకింకరుడని గ్రహించలేకపోవుచున్నాము. గొర్రెను మనుషులు చీల్చి వేయుచున్నారు. గొర్రెకు ఆ సమయములో యమకింకర్లు మనిషి రూపముగా ఉన్నారని తెలుసుకోలేకపోవుచున్నాము. అడవిలో ఒక జంతువును పులి చీల్చివేయుచున్నదనుకొనుము. ఆ సమయములో ఆ జంతువుకు పులి యమకింకరుడు అని తెలుసుకోలేక పోవుచున్నాము. రిక్షాలో ఒకడు కూర్చొని ఉన్నాడు, ఒకడు రిక్షాను కష్టపడి లాగుచున్నాడు. అక్కడ కూర్చున్నవాడు సుఖమును, బండిని లాగువాడు కష్టమును అనుభవించుచున్నారు. దానిని చూచిన మనము కూర్చున్నవాడు వాని పుణ్యమును అనుభవించుచున్నాడు, రిక్షాను లాగువాడు వాని యొక్క

పాపమును అనుభవించుచున్నాడు అని ఏమాత్రము మనము తెలుసుకోలేక పోవుచున్నాము. ఇట్లు ప్రపంచములో నిజముగా ఏమి జరుగుచున్నదని మాయచేత తెలుసుకోలేకపోవుచున్నాము. నిజముగా జరుగునది ఒకటైతే మనము అనుకొనునది వేరొకటి ఉండును. మాయను విడిచి నిజముగా జరుగుచున్నది ఏమిటి? చేయుచున్నవారు ఎవరు? అని తెలుసుకొనిన యమలోకము ఎక్కడ ఉన్నదీ, యయకింకర్లు ఎవరైనదీ, యముడు ఎవరైనది నిజముగా తెలియును.

కొంతమంది మంచివారు "మేము చెడు పనులను చేయలేదు కదా! భగవంతుడు మమ్ములనే ఎక్కువ కష్టపెట్టుచున్నాడు. దుర్మార్గులు చెడు కార్యములను చేయుచున్ననూ వారిని సుఖపెట్టుచున్నాడు. దేవుని దగ్గర న్యాయమున్నదా" అని అనుచున్నారు. కొంతమంది మూఢులు దైవభక్తులను చూచి "భక్తులకు కూడా కష్టాలుంటాయా! దేవుడు మిమ్ములను కష్టపెట్టడు కదా!" అని హేళన చేయుచున్నారు. దీనికి సమాధానము, **"ఎవని పాపమునైన, ఎవని పుణ్యమునైన ఆత్మ తొలగించదు"** అని గీతయందు భగవంతుడు పలికినాడు. మరియు "నాకు ఎవరి పాపపుణ్య సంబంధము లేదు" అని కూడా చెప్పినాడు. కావున ఈ జన్మలో మంచివారైనా ముందు జన్మ పాప ఫలితము వలన కష్టములు వచ్చుచుండును. అంత మాత్రమున దేవుని దగ్గర న్యాయమున్నదా అని మంచివారు అనకూడదు. దుర్మార్గులు ముందుజన్మలో చేసిన పుణ్యఫలితము వలన సుఖములు ఈ జన్మలో అనుభవించుచుందురు. ఈ జన్మలో చేసిన దుర్మార్గపనుల ఫలితము మరలవచ్చు జన్మయందు తప్పక అనుభవించుచుందురు. అట్లే ఈ జన్మయందు మంచివారు చేసిన మంచిపని ఫలితము, మరల వచ్చు జన్మయందు తప్పక అనుభవింతురు. భక్తులు కూడా కష్టమనుభవించుటకు

కారణము పోయిన జన్మలో చేసుకొన్న పాపమే. ఇపుడు కొందరు ఈ విధముగా అడుగవచ్చును. పాపము చేసిన దాని ఫలితము అనుభవింప వలసినదేనా? లేక తప్పించుకొనుటకు వేరే మార్గము ఉన్నదా? దానికి జవాబు జ్ఞానయోగములో **"అఖిల పాపాత్ములందు నీవెంత అధమ పాపయుతుడవైనను కలుష జలది ఓడచే దాటినట్లు జ్ఞానమను ఓడచే పాపమును దాటగలవు."** అని పరమాత్మ అన్నాడు. కావున ఎంతటి పాపాత్ముడైనా జ్ఞానముచే తప్పించుకొనవచ్చును. అగ్నికి కట్టెలను కాల్చు గుణమున్నట్లు, జ్ఞానమునకు పాపమును నశింపజేయు గుణమున్నది. కావున ఎవడైతే జ్ఞానమును ఆర్జించుకొనునో వాని పాపము జ్ఞానాగ్ని వలన దహింపబడి, అనుభవించవలసిన దాని నుండి తప్పించుకొనుటకు వీలగుచున్నది. జ్ఞానము కావలయునన్న పరమాత్మను ఆశ్రయించవలసిందే. కొంతమంది భక్తులు జ్ఞానమార్గమును అనుసరించి ప్రపంచములో వచ్చు కష్టములకు ఓర్చుకొన లేక మేము పరమాత్మ భక్తులము కదా! జ్ఞానమున్న వారము కదా! మాకే కష్టములు వచ్చుచున్నవే అని జ్ఞానమార్గమునే వదలి వేయుచున్నారు. దీనితో దేవుని మాటనే అబద్ధమనునట్లు చేయుచున్నారు. పరమాత్మ పలికినమాట ఎప్పటికీ అసత్యముకాదని తెలుసుకోలేక పోయినారు. అగ్నియందు ఎన్ని కట్టెలైనా కాలిపోవు విధముగా జ్ఞానాగ్ని యందు సర్వ కర్మచయము భస్మమొనరింపబడును. పాపపుణ్యములు రెండునూ లేకుండా సమసిపోవుటకు ప్రారంభించి, కొంతకాలమునకు రెండునూ లేకుండా పోవుటచే జీవుడు పరమాత్మయందు ఐక్యత చెందు చున్నాడు. పరమాత్మను కొంత కాలము నమ్మినంత మాత్రముననే కర్మ అంతయు పోవలయునంటే ఎట్లగును? ఒక మోపు కట్టెలను కాల్చుటకు గంటకాలము పట్టును. బండెడు కట్టెలను కాల్చుటకు ఒక దినము పట్టును.

అట్లే నూరు బండ్ల కట్టెలను కాల్చుటకు కొన్ని నెలలు పట్టును. కట్టెలు ఎక్కువయున్నకొద్దీ కాల్చు కాలము ఎక్కువగును. అట్లే కర్మ అను కట్టెలను జ్ఞానాగ్ని కాల్చుతూనే ఉండును. కర్మ పూర్తిదహింపబడు వరకు జీవుడు ప్రారబ్దకర్మను అనుభవింపవలసి ఉండును. భక్తులు కర్మను ఒక ప్రక్క అనుభవించుండగా వేరొకప్రక్క జ్ఞానాగ్ని కర్మను కాల్చుచుండునని తెలియు చున్నది.

యమలోకము ఇక్కడే ఉన్నది, యమధర్మరాజు, యమకింకర్లు కూడా ఇక్కడే ఉన్నారు. మనము అనుభవించు కష్టములే నరకము అనియు, దేవతలు దేవేంద్రుడు దేవలోకము అంతా ఇక్కడే ఉన్నదనియు, మనము అనుభవించు సుఖములే స్వర్గ సుఖములనియు తెలియుచున్నది. కావున వాస్తవము తెలుసుకొని యమలోక స్వర్గలోకములకు అందక ఉన్న పరమాత్మను అందుకోవలయునని కోరుచున్నాము.

*****

# దేవతలు - రాక్షసులు

ప్రపంచములో అనేకమంది దేవతలు ఉన్నారు. మరియు రాక్షసులు ఉన్నారు. ప్రపంచములో రెండే జాతులు మానవులందు ఆదినుంచి ఇప్పటికిని ఉన్నవి. అవియే 1) దేవ జాతి 2) రాక్షస జాతి. జ్ఞానమున్నవారు ఈ రెండిటినీ గుర్తించవచ్చును. మరియు తను ఏజాతివాడైనది తెలుసుకో వచ్చును. ఈ రెండు జాతులు ఎట్లు ఏర్పడుచున్నవనగా! గుణముల బట్టియేనని తెలియుచున్నది. ఈ గుణములున్న వారు రాక్షసులనియు, ఈ గుణములున్న వారు దేవతలనియు గుర్తించనగును. భగవద్గీతయందు

**"దైవాసుర సంపద్విభాగ యోగము"** లో భగవంతుడు దేవతల గుణములను, రాక్షస గుణములను తెలియజేశాడు. మరియు వారి ప్రవర్తనలను కూడా తెలిపియున్నాడు. ఇంకనూ శ్రీకృష్ణపరమాత్మ ఏమన్నాడనగా "ద్వౌభూత సర్గౌ లోకేస్మిన్ దైవాసుర ఏవచ" **"లోకమున దేవతలు రాక్షసులు అను రెండు విధములగు జీవరాసులు భూమిమీద పుట్టుచున్నవి"** అన్నాడు. కావున భూమిమీదనే దేవతలు, రాక్షసులు ఉన్నారని తెలియుచున్నది.

దేవతలు ముప్పది మూడుకోట్లు ఉందురని ఒక ప్రతీతి. వారు ఎంతమంది అయినా విష్ణు, ఈశ్వర, బ్రహ్మ మొదలుకొని ఇంద్రుడు ఇంద్ర పరిపాలనయందుండు దిక్పాలకులు దేవతలే కదా! వారు ఎక్కడ ఉన్నారు? వారు భూమిమీద ఎక్కడ గుర్తింపబడరే అని కొంతమందికి అనుమానము రావచ్చును. దానికి సమాధానము ఏమనగా! పరమాత్మ చెప్పినట్లు దేవతలు అందరూ భూమిమీదనే ఉన్నారు కానీ మనము గుర్తించలేకపోవుచున్నాము. మనకు చూపులేక ఎదుట ఏమీ లేదన్నట్లు మనము వారిని చూడలేక దేవతలు భూమిమీద లేరంటున్నాము. మనకున్న స్థూలకన్నులతో చూచిన అన్ని మానవాకారములే కనిపించును. కాని మానవాకారములయందే ఉన్న దైవత్వము ఏమాత్రమూ కనిపించదు. మానవులయందున్న దైవత్వమును గుర్తించి ఈయన ఫలానా దేవుడు అని తెలుసుకొనుటకు జ్ఞానదృష్టి కావలయును. జ్ఞానదృష్టి లేకున్న స్థూలదృష్టికి పై ఆకారములే కనుపించును. దానివలన అందరూ మానవులే అని అనుకొందుము స్థూలదృష్టితో దేవతలను గుర్తించలేము.

కొంత కొంత జ్ఞానశక్తి ఉన్న వారందరు దైవాంశపరులే అనగా దేవతలే, దేవతలు అందరూ సమానముకాదు. ఎందుకనగా వారి యందుండు జ్ఞానశక్తి సమానముగా ఉండదు. అత్యధిక జ్ఞానశక్తి ఉన్నవాడు

విష్ణువు. అక్కడనుంచి యోగశక్తి తగ్గుకొలది ఈశ్వర, బ్రహ్మ మొదలుకొని దిక్పాలకుల వరకు ఉందురు. అట్లే అజ్ఞానము ఉన్నవారు రాక్షసులు. వారు కూడా అందరూ ఒకే రకముగా ఉండరు. వారు అజ్ఞానమును బట్టి వారియందు చిన్న పెద్ద అను భేదములుండుటకు వీలున్నది. దీనిని బట్టి జ్ఞానశక్తి ఉన్నవారందరూ దేవతలనియు, జ్ఞానశక్తి లేని వారందరూ రాక్షసులనియు తేలుచున్నది.

దేవతలైన విష్ణు, ఈశ్వర, బ్రహ్మ మొదలగువారు ఈ కలియుగము నందు కూడా ఉన్నారా? విష్ణు, ఈశ్వర, బ్రహ్మ మొదలగువారు పెద్ద జ్ఞానులైనా దేవునియందు ఐక్యము చెందక కలియుగమునందు కూడా ఉన్నారా? వారికి మోక్షము లేదా? వారు కూడ అందరి మాదిరి జన్మ ఎత్తుచునే ఉందురా? అను అనుమానము అందరికి రావచ్చును. వారికి నా సమాధానము ఏమనగా! దేశములో రాజు, యువరాజు, మంత్రి, ముఖ్యమంత్రి, సేనాధిపతి అని ఎన్నియో పదవులు కలవు కదా! మొదటినుంచి ఒకే వ్యక్తి రాజుగా, ఒకే వ్యక్తి మంత్రిగా ఉన్నారా, అట్లు ఎవరూ లేరు. రాజు, మంత్రి మొదలగు పదవులు మాత్రము అట్లే ఉన్నవి. ఆ పదవులలో ఒకరి తర్వాత ఒకరు వారి యోగ్యతను బట్టి నిర్ణయించ బడుచున్నారు. ఈ విధముగానే ప్రపంచములో విష్ణు, ఈశ్వర, బ్రహ్మ అనబడు మొదలగు పదవులు కలవు. యోగశక్తిని బట్టి విష్ణు, ఈశ్వర, బ్రహ్మ మొదలగు పదవులు జీవులకు ఇవ్వబడుచున్నవి. ఒక జీవుడు ప్రపంచమంతటిలోను యోగశక్తియందు మొదటివాడైనాడనుకొనుము. ఆ జీవుడు ఒక శరీరమును ధరించి భూమిమీద పుట్టును. యోగశక్తి యందు మొదటివాడైన దానివల్ల మొదటి దేవతా పదవి అయిన విష్ణు పదవికి అతను అర్హుడు. కావున ఆ జీవుడే దేశములో విష్ణువు. ఆ జీవుడు ఆ

జన్మలో కూడా యోగము సాధించి పూర్తి యోగశక్తి సంపాదించుకొన్నవాడై దేవునియందు ఐక్యత చెందుచున్నాడు. అందువలననే పూర్వకాలము వైకుంఠములో ఉన్న విష్ణువు కూడా యోగము చేసినట్లు తెలియుచున్నది. అదే అంశకు తగినవారు ఎందరో యోగము చేసినట్లు తెలియుచున్నది. విష్ణు పదవిని ఒక జీవుడు కొంతకాలము అధిష్టించి దేవునియందు ఐక్యముకాగానే, ఆ సీటుకు తగిన వేరొక జీవి ప్రపంచములో తయారయ్యే ఉండును. రాజు పదవి ఖాళీ ఏర్పడగానే దేశములో వేరొకడు ఆ పదవికి అర్హుడైనట్లు ప్రపంచములో విష్ణు, ఈశ్వర, బ్రహ్మ మొదలగు పదవులు ఖాళీ ఏర్పడతూనే ఆ అంశకు తగిన జ్ఞానశక్తి (యోగశక్తి) పరులు తయారగుచునే ఉందురు. కావున విష్ణు, ఈశ్వర, బ్రహ్మ మొదలగువారు కూడ శరీరములు ధరించి ఉన్నారు. వారు కూడా మోక్షము కొరకు విశేషముగా యోగమాచరించుచున్నారు. వారు వారి యందు యోగశక్తి సంపూర్ణస్థితి చెందినపుడు పరమాత్మయందు లీనమగుచున్నారు. తిరిగి వేరే జీవులు వారి అంశకు తగినవారై వారి పదవి యొక్క నామమును పొందగలుగుచున్నారు.

ఇక్కడ కొంతమంది ఒకే కాలములో ఒకే అంశకు చెందిన వారు ఇద్దరు జీవులు ఉందురా! రాముడు, పరశురాముడు విష్ణువాంశ పరులేకదా అని సంశయపడవచ్చును. దానికి నా సమాధానము. ఒకే కాలములో ఒకే అంశకు చెందిన ఇద్దరు జీవులు ఉండుట ఎప్పటికీ సంభవింపదు. ఇక రాముడు, పరుశురాముడన్న ఇద్దరూ విష్ణు అంశను అలంకరించిన వారే అయివుంటే ఇద్దరూ ఒకే కాలములో విష్ణు అంశకు సరిపోయివుండరు. కొంతకాలము పరశురామునిపట్ల, కొంతకాలము రాముని పట్ల విష్ణువాంశ ఉండియుంటుంది. అనగా కొంతకాలము ఒక జీవుడు విష్ణువు, మరికొంత

కాలము వేరొక జీవుడు విష్ణువు. రామునకు వివాహమగునంతవరకు విష్ణువు అను పదమునకు పరశురాముడే అర్హుడు. అంతవరకు యోగశక్తియందు అతనిని మించినవారు ప్రపంచమున లేకుండిరి. రాముని వివాహ సమయమున, పరుశురాముడు రాముని ఎదుర్కొనిన సమయమున, యోగశక్తియందు మిన్న రాముడే అయ్యెను, పరశురాముని యోగశక్తిని రాముడు మించినవాడై నాటి నుండి రాముని జీవితాంతము రాముడే విష్ణువైనట్లు తెలియుచున్నది. కావున రాముడు పరశురాముడు ఇద్దరూ విష్ణువాంశసంభూతులే అని తెలియుచున్నది. ఈ విధముగానే ముప్పది మూడుకోట్ల దేవతా అంశలు ఉన్నవి. ఆ అంశలకు తగిన జ్ఞానశక్తి గల జీవులు ఆ దేవతలని అనిపించుకొనియుందురు. జరిగిన కాలమును విశధీకరించి చూచిన మశ్చీంద్రుడు విష్ణుపదవికి, ఆయన శిష్యుడు గోరా కుమారుడు ఈశ్వర పదవికి, అర్హులయినట్లు తెలియుచున్నది. ఆ కాలములోనే కాక ఈ కాలములో కూడా విష్ణు, ఈశ్వర మొదలుకొని ఆఖరువరకు యోగ్యత కలిగిన యోగశక్తిపరులు ఉన్నారు. కొంతమంది వారిలోని మాయవలన వారి యోగ్యత వారికే తెలియకుండా పోయినది. కొంతమంది తమ యోగ్యతను తెలుసుకొని ఉన్నారు. గీతలో పరమాత్మ చెప్పినట్లు భూమిమీదనే సజీవులై దేవతలు అందరూ ఉన్నారు. వారు పరమాత్మకు భక్తిపరులై యోగము చేయుచునే ఉన్నారు.

జ్ఞానులకు అనగా జ్ఞానశక్తి కల్గినవారికి (దేవతలకు) విరుద్ధముగా ఉండు వారందరూ రాక్షసులే. వీరియందు జ్ఞానశక్తి ఏమాత్రము ఉండదు అన్నియు తమ శక్తి వలననే జరుగుచుండునని అనుకొందురు పరమాత్మ విషయము వీరికి వ్యతిరేకముగా ఉండును. అనేక భయంకరమైన పాపములు సంపాదించుకొనెడి వారై ఉందురు. రాక్షసులందరూ ఆశకు

మించిన కోర్కెలు కోరుచుందురు, వారియందు గర్వము తాండవించుచుండును. అపరిమితమైన కోర్కెలతో విషయసుఖములకంటే వేరే సుఖములు పెద్దవి లేవని చెప్పుచుందురు. మరియు ఆశ అను తాడుచేత కట్టబడినవారై సుఖములు కావలయునని ఆశించుచూ, ఆ సుఖములకొరకు ధనమును చాలా అన్యాయమార్గములో సంపాదించుచున్నారు. ఇంకా తనకంటే ఎవరు తెలిసినవారులేరని వారి ఇష్టానుసారముగా పూజలు చేయుచున్నారు. ఇటువంటి రాక్షసులను గీతయందు **"క్రూరులును, ద్వేషులును మంచిని దూషించువారును అయిన ఈ నరులను రాక్షస గర్భములయందు జన్మించునట్లు చేసి, వారిని మాయలో దుఃఖములను పొందునట్లు చేయుదును. ఈ విధముగా రాక్షసుల కడుపులోనే జన్మించి జన్మ జన్మకూ అజ్ఞానులగుచు, నన్ను తెలుసుకొను జ్ఞానము యొక్క గట్టు ఏమాత్రము కనిపించక అధమ గతికి పోవుదురు"** అని తెలిపి ఉన్నాడు. కావున ప్రపంచములో అజ్ఞానములోపడి రాక్షస జన్మ ఎత్తక, జ్ఞానమార్గమును అనుసరించి జ్ఞానశక్తి సంపాదించుకొని దేవతల కడుపుననే జన్మించుచూ, జన్మ జన్మకు యోగశక్తి ఎక్కువైనవారై ఆఖరుకు పరమాత్మ యందు లీనులు కావలయునని తెలుపుచున్నాము.

ఇంతవరకు చెప్పినను కొందరికి ఇంకను అనుమానముండి గీతా శాస్త్రములో అక్షర పరబ్రహ్మ యోగమున శ్రీ కృష్ణుడు **"అబ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోర్జున! మా ముపేత్యతు కౌన్తేయ! పునర్జన్మ న విద్యతే" "బ్రహ్మలోకమాది మొదలగు లోకములన్నియూ మరల జన్మము కలుగ జేయును. కానీ నన్ను పొందినవారికి తిరిగి జన్మరాదు"** అని అన్నాడు కదా! ఈ మాటతో లోకములు వేరు ఉన్నట్లు, అక్కడ దేవతలు ఉన్నట్లు తెలియుచున్నదే! అని అడుగవచ్చును. దానికి నా సమాధానము,

దేవతలందరూ ఇక్కడే ఉన్నారు. వారి సామీప్యమున జన్మించవలయు నంటే ఎంతో పుణ్యము చేసి ఉండవలయును. వారివద్ద జన్మించడమే వారి లోకమున జన్మించడము. అట్లు పుణ్యము చేసి వారివద్ద జన్మించి నప్పటికీ వారికి తిరిగి జన్మలు ఉన్నవి. కానీ నన్ను పొందినవానికి తిరిగి జన్మలేదు. అని పరమాత్మ తెలియజేసినాడు కానీ వేరుకాదు. అట్లే రాజవిద్యా రాజగుహ్య యోగమున *"త్రైవిద్యా మాం సోమపాః పూత పాపా యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే, తేపుణ్య మాసాద్య సురేంద్రలోక మశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్" "తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్య లోకం విశన్తి, ఏవం త్రయీధర్మ మను ప్రపన్నా గతాగతం కామా కామా లభన్తే"* "యాజ్ఞికులు, సోమపానులు, పాపములేనివారై నా దయచే స్వర్గము చేరగలిగి మిక్కిలి పుణ్య జన్మములను, దివ్యములైన భోగములను, దివ్య సుఖములను అనుభవించుచుందురు. అట్లు స్వర్గ సుఖములను అనుభవించిన తర్వాత తగ్గు లోకమునకు వచ్చుచుందురు. ఇట్లు కామపరులై పుణ్యము సంపాదించు కొన్న వారి గతి ఉండును. వారికి అశాశ్వతములైన సుఖములే లభించును" అని పరమాత్మ అన్నాడు. ఇక్కడ కూడ స్వర్గలోకము వేరు ఉన్నదని చాలా మంది పొరపాటుపడుచున్నారు. పుణ్యము చేసిన వారికి స్వర్గము ఇచటనే ఉన్నది. వారు స్వర్గ సుఖములను ఇచటనే అనుభవించుచున్నారు. పుణ్య ఫలితము అయిపోయిన వెంటనే కష్టపడు జన్మలు తిరిగి ఎత్తుచున్నారు. అందులకే మనము అనుభవరీత్యా బాగుగా సుఖపడు వానిని పై స్థితిలో ఉన్నాడని, కష్టపడువానిని తగ్గు స్థితిలో ఉన్నాడని అనుచున్నాము. అట్లే ధనికునికి బీదవానికి పోల్చు సమయములో కూడ వాడెక్కడ వీడెక్కడ అని అంటున్నాము. ఈ మాటలో కూడా వానికి వీనికి ఎంతో దూరము అన్నట్లున్నది. ఆ దూరము ఏమిటో అర్థము చేసుకోవలయును. ఆ

భేదము భూమిమీదనే కనబడుచున్నదని తెలుసుకోవలయును. వాడు పై స్థితిలో వీడు తగ్గుస్థితిలో ఉన్నాడు అంటున్నాము. వాని పై స్థితి వీని క్రింది స్థితి భూమిమీదనే ఉన్నదని తెలుసుకోవలయును. అట్లే ఒకడు బాగుగా బ్రతికి సుఖములు అనుభవించి తర్వాత వాడు కష్టాలపాలైనాడనుకొనుము, అపుడు కూడా వాడు అధోగతి పట్టినాడని అంటున్నాము. అధోగతి అంటే తగ్గుస్థితి ఆ తగ్గుగతి కూడా భూమి మీదనే ఉన్నట్లు తెలుసుకోవలయును.

పుణ్యము చేసినవాడు భూమిమీదనే స్వర్గసుఖములు అనుభవించుచున్నాడు. పాపము చేసినవాడు భూమిమీదనే నరకము అనుభవించుచున్నాడు. పై లోకము క్రిందిలోకము అనునవి అన్నియూ ఈ భూమి మీదనే ఉన్నాయి. ఎవని లోకము వానిది, వాని లోకమునకు వీడు రాడు, వీనిలోకమునకు వాడు రాడు అని జ్ఞానిని అజ్ఞానిని పోల్చి చెప్పు సమయమున కూడా అనుచుందుము. ఒకనాడు గురువుగారైన బ్రహ్మము గారు శిష్యుడైన సిద్ధయ్యను లోకము ఎట్లున్నది అని ప్రశ్నించగా ఎవని లోకము వానిది స్వామి అని సమాధానముగా సిద్ధయ్య చెప్పెనట. పరమాత్మ కూడా నేను ముల్లోకములు ఆవహించియున్నాను. నేను లేని చోటు లేదని తెల్పెను. చివరకు లోకములను గురించి తెలుసుకోవలయునంటే జ్ఞానదృష్టి చేతనే తెలుసుకొనుటకు వీలగును. అన్ని లోకములు భూమి మీదనే ఉన్నవి. వీటిని గురించి పూర్తిగా తెలుసుకోవలయునంటే అసాధ్యమేమో అనిపించును. కానీ జ్ఞానము ప్రకారము వివరించుకొంటే సులభముగానే అర్థమగను.

ముఖ్యముగా ఉన్నవి మూడు లోకములే. అందు ఒక్కొక్క లోకములో 108 ఉపలోకములున్నవి. మొత్తము 324 లోకములు మన తలలోనే

గుణములరూపముతో గలవు. ఒక జీవుడు వాని కర్మానుసారము శరీర ధారియై భూమిమీదనే ఉండు లోకములలో చిక్కుకొనుచుండును. ఎవని లోకము వానికి మంచిగా కనిపించుచుండును. వీటిని వివరించుతూ పోవుటకు ఇపుడు సందర్భము కాదు. కాబట్టి ఇంతటితో మిగతా లోకముల వివరమును విరమించుకొంటూ, నరక కష్టములు, స్వర్గ సుఖములను జీవుడు ఇచటనే అనుభవించుచున్నాడని తెలుపుచున్నాము. అట్లుకాక స్వర్గలోకము నరకలోకము ఇతరముగా ఉంటే పుణ్యపాపములు రెండునూ జీవుడు అక్కడే అనుభవించితే, ఇక్కడ భూమిమీద పుట్టనవసరము లేదు కదా! పాప పుణ్యముల కారణముచేత మనము జన్మకు వచ్చుచున్నామని బాగుగా తెలిసియు, పాప పుణ్యములను ఎక్కడో అనుభవించివస్తాము అంటే దానికి అర్థమే లేదు. వేరే లోకములలో పాపపుణ్యములను అనుభవించితే ఇక్కడ జన్మించనవసరమే లేదు. కావున అన్ని లోకములు ఇక్కడే ఉన్నవని, దేవతలందరూ ఇక్కడే ఉన్నారని తెలుసుకోవలయును. పరమాత్మ కూడా ఇదే భావనతో గీతయందు చెప్పియున్నాడు. ఆ భావనను అర్థము చేసుకోలేక మనమే తికమక పడుచున్నాము. పరమాత్మ తెలిపిన గీతాశాస్త్రమును పరమాత్మ భావన ప్రకారమే అర్థము చేసుకోవలయునంటే ఎంతో జ్ఞానము పొంది ఉండవలయును. అట్లు కాకపోతే వేరే విధముగా అర్థమగును. ఎవని జ్ఞాన ఫలితమును బట్టి వానికి అర్థమగును. అందులకే ఈ కాలములో ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా చెప్పుకొనుచున్నారు. మా దృష్టిలో గీతాశాస్త్రమును వక్రమార్గములో అర్థము చేసుకొను వారికి పరమాత్మ తిరిగి మానవరూపముగా వచ్చి చెప్పినను అక్కడికీ అర్థము చేసుకోలేక చెప్పేవాడు మన మాదిరి మనిషే కదా! మాకంటే వీనికి ఎక్కువ తెలిసి ఉండునా? అను గర్వము విడువకుంటే ఏమీ ప్రయోజనము లేదు.

మనము ఏనాడైతే గర్వమును విడిచి మనకు తెలియని యధార్థము ఇంకా ఎంతో ఉన్నదను భావనకు వచ్చిననాడే బాగుపడుదుమని తెలుపుచున్నాను. కావున నాకే బాగా తెలుసునను గర్వమును విడచినవారై, దేవతలు వారిలోకములు ఇక్కడే ఉన్నవని తెలుసుకోవలయును. మరియు రాక్షసులు వారి లోకములు ఇక్కడే ఉన్నవని కూడా తెలుసుకోవలయును.

*****

# విద్య - అవిద్య

విత్ అను పదము నుండి విద్య అను పదము పుట్టినది. విత్ అనగా తెలుసుకోవడమని అర్థము. అందువల్ల దానినుండి పుట్టిన విద్య అను పదమునకు కూడా అదే అర్థము వర్తిస్తున్నది. అవిద్య అనగా తెలియక పోవడమని తెలియుచున్నది. చిన్నతనము నుండి బడికిపోయి మనకు తెలియని భాషనో, పరిసర విషయములనో, గణితమునో ఏదో మొత్తము మీద తెలియనిదానిని తెలుసుకొంటాము. అలా తెలుసుకొంటున్న దానిని విద్య అంటున్నాము. విద్య కోసము ధనమునిచ్చి నాకు తెలియనివి తెలియపరచండని అర్థించు వానిని (అడుగు వానిని) విద్యార్థి అంటున్నాము. విద్య + అర్థి = విద్యార్థి. విద్యార్థి అనగా విద్యను అర్థించువాడని, ఇంకా తెలియునట్లు చెప్పుకోవాలంటే తనకు తెలియని వాటిని తెలియుట కొరకు ఇంకొకరి వద్దకుపోయి అడుగువాడని అర్థము.

తెలియనివి తెలియజెప్పు వానిని బోధకుడు అంటున్నాము. తెలియజెప్పువాడు బోధకుడు, తెలియజెప్పించుకొనెడి వాడు విద్యార్థి అన్నది సూత్రము. ఈ సూత్రము ప్రకారము ఏ విషయము చెప్పువాడైనా బోధకుడే. అలాగే ఏ విషయమును తెలియ చెప్పించుకొనెడివాడైనా విద్యార్థే, తెలియ

జెప్పించుకొనునది ఏదైనా విద్యయే. మానవుడు చిన్నతనము నుండి ఏదో ఒకవిద్యను నేర్చుకొంటూనే ఉన్నాడు. తనకు యుక్తవయస్సు వచ్చువరకు ఎన్నో విద్యలు నేర్చి యం.ఏ., యం.యస్.సి., బి.యస్.సి. మొదలగు డిగ్రీలు పుచ్చుకొని పి.హెచ్.డిలు తీసుకొని నేను విద్యను పూర్తి నేర్చినానను కొంటున్నాడు. పిహెచ్‌డిలు తీసుకొన్నవాడైనప్పటికీ అతను అనుకొనునట్లు విద్యావంతుడేనా అని యోచిస్తే అతడు నేర్చిన వరకు విద్యావంతుడే. ఇంకనూ అతను నేర్వవలసినదీ, తెలియవలసినదీ ఉన్నది. కావున అతను సంపూర్ణ విద్యావంతుడుకాడని చెప్పవచ్చును. తెలియవలసినది మిగిలి ఉన్నది. కావున అతను అవిద్యాపరుడనే చెప్పవచ్చును.

ముఖ్యమైన వాటికి, ముఖ్యము కానివి సమానము కాదు. కనుక ముఖ్యము కానివి అనేకము నేర్చి, ముఖ్యమైనది ఒకటి నేర్చకున్ననూ అతను అవిద్యాపరుడే అని చెప్పవచ్చును. అట్లన్నపుడు ముఖ్యము కానివి ఏవి? ముఖ్యమైనవి ఏవి? అనువిషయము అందరికి తెలియకపోయి ఉండవచ్చును. దానిని గురించి తెలుసుకొందాము. ప్రపంచములో ఉన్న విద్యలు, తెలియవలసిన విద్యలు ఆరుమాత్రమే. అవి ఏవనగా! 1) గణిత శాస్త్రము 2) రసాయనశాస్త్రము 3) భౌతికశాస్త్రము 4) ఖగోళశాస్త్రము 5) జ్యోతిష్యశాస్త్రము 6) యోగశాస్త్రము. మొత్తము ఆరుశాస్త్రములలో అతి ముఖ్యమైనది యోగశాస్త్రము. శరీరములందు కీలక పాత్రవహించు జీవాత్మ, ఆత్మల గురించి యోగశాస్త్రము తెలియజేయుచున్నది. జీవాత్మ, ఆత్మలులేనిది ప్రపంచమంతయూ చైతన్యములేని జీవరహిత జడముగా ఉండగలదు. అలాగే పరమాత్మలేనిది జడముగానున్న ప్రపంచము కూడా లేదు. ముఖ్యమైన మూడు ఆత్మలను గురించి తెలుపునది కావున యోగశాస్త్రము ముఖ్యమైనదని చెప్పవచ్చును.

మిగతా 5 శాస్త్రములో ఉన్నవి అన్నియూ ప్రపంచసంబంధ విద్యలేనని తెలియాలి. నేడు ప్రాథమికపాఠశాల మొదలుకొని విశ్వ విద్యాలయముల వరకు ఉన్న చదువులన్నియు ఐదుశాస్త్రముల విద్యలే. ఆరవశాస్త్రమైన యోగశాస్త్రమనునది ఒకటున్నదని చెప్పువారు లేరు, మరియు అది ఈనాటి విద్యాబోధనలందు లేకుండా పోయినది. కావున ఏ విద్యార్థికి యోగశాస్త్రము గురించి తెలియదు. ఎవడు ఎన్ని చదువులు చదివినప్పటికీ అన్నిటికంటే ముఖ్యమైన యోగశాస్త్రమును గురించి తెలియకపోవడము వలన అట్టివానిని అవిద్యాపరుడనియే చెప్పవచ్చును. ఎన్నో డిగ్రీలు పుచ్చుకొన్నను ఒక్క యోగశాస్త్రము తెలియనంతమాత్రమున అవిద్యాపరుడని చెప్పుటకు ముఖ్యమైన మరొక కారణము కూడా గలదు, అది ఏమనగా!

ఏ విద్య అయినా ఒక భాషా లిపితో మొదలవుతుంది. ఆ లిపి కొన్ని అక్షరములసముదాయముతో కూడి ఉండును. ఏ విద్య అయినా అక్షరసారాంశముతో కూడిఉండును. విద్య ఉన్నవాడిని అక్షరజ్ఞానము ఉన్నవాడనుట సహజముగా వింటున్నాము. అక్షరము అనగా అసలు అర్థము తెలియనివారై అది ఒక ప్రపంచ చదువే అనుకొంటున్నాము. అసలు అర్థమును బట్టి చూస్తే క్షరము అనగా నాశనము, అక్షరము అనగా నాశనము కానిదై అవినాశిగనున్నది. అట్టి అవినాశియైన ఆత్మ జ్ఞానము గురించి తెలిసినవాడు అక్షరములను తెలిసినవాడని, విద్యాపరుడని చెప్పవచ్చును. ఆత్మ జ్ఞానమును గూర్చి తెలియని వానిని అక్షరము గూర్చి తెలియనివాడని, అక్షరజ్ఞానము తెలియనివాడని, అవిద్యాపరుడని చెప్ప వచ్చును. దీనినిబట్టి ఆత్మజ్ఞానములేని ఎన్ని చదువులు చదివినను వాడు అవిద్యాపరుడు అని చెప్పవచ్చును.

నేడు అక్షర సారాంశములేని ఎన్నో చదువులున్నాయి. వాటిని నేర్చుటకు కళాశాలలు, విశ్వవిద్యాలయాలు గలవు. అక్షరజ్ఞానములేని విద్యలు నేర్చుటకు ఎన్నెన్నో వేలు, లక్షలు డబ్బులు ఖర్చుపెట్టవలసి ఉన్నది. వివరము తెలియని మానవుడు ఎంతో వ్యయప్రయాసలకోర్చి, అక్షరజ్ఞానము లేని విద్యలు నేర్చి, విద్యావంతుడనని గర్వపడుచున్నాడు. కానీ తాను ఎన్ని నేర్చినా అవిద్యాపరుడననే సత్యము తెలియకున్నాడు. నేటి ప్రపంచ సంబంధ విద్యలన్నీ ప్రపంచములో బ్రతుకుటకు వీలు కల్పించునవే, కానీ పరమాత్మయందు మనగలుగుటకు వీలుకల్పించునవి కావు. ఒక లెక్కలో ప్రపంచవిద్యలు నేర్చినవాడు కూడా నేడు ప్రపంచములో తగిన ఉద్యోగములు రాక, వాడు చదివిన చదువులకు విలువలేక, ఏ చదువు రానివానివలె కాయకష్టము చేసి నిరాశగా బ్రతుకవలసి వచ్చుచున్నది. ఆత్మ చదువు నేర్చినవాడు ప్రపంచములో ధైర్యముగా బ్రతుకగలుగుచున్నాడు. చనిపోయిన తర్వాత కూడా స్థిరస్థాయిగా ఉండగలడు.

అన్ని శాస్త్రములకంటే మించిన ఆరవ శాస్త్రమైన యోగశాస్త్రమును తెలిసినవానికి ఎన్ని కష్టములు వచ్చినప్పటికీ అవి వానికి కష్టములుగా తోచవు, వాటి బంధములను లెక్కచేయడు. అందువలన ఆరవ శాస్త్రమైన యోగవిద్యను గీతయందు "పవిత్ర మిహవిద్యతే" అన్నారు. అంతేకాక "నహి జ్ఞానేన సదృశ్యం" అన్న మాట కూడా గలదు. దీనికంటే మించిన విద్యలేదు మరియు దీనికి సమానమైనది కూడా లేదని అర్థము. దానిని నేర్పువారు లేరా? నేర్చెడివారు లేరా? అన్న సంశయము కొందరికి రావచ్చును. దానికి జబాబు ఏమనగా! యోగశాస్త్రమును తెలుసుకోవాలను కొనువారు అరుదుగా ఉన్నారు. ఆ శాస్త్రమును గురించి తెలుపువారు మరీ అరుదుగా ఉన్నారు.

నేడు ప్రపంచ చదువులు చదివి ఎంతో నేర్చిన అవిద్యాపరులు కొందరు యోగశాస్త్రవిలువను తెలియక గురువులను నీచముగా చూస్తున్నారు. గురువుల వద్ద ఆత్మజ్ఞానమును తెలుసుకొను వారిని తెలివి తక్కువవారుగా లెక్కించుచున్నారు. జీవితములో కొద్ది కాలముండు ఉద్యోగస్తులు కొందరు, తమకు ప్రభుత్వము కల్పించిన అధికారమును పట్టుకొని గర్వపడుచూ, పూజ్యనీయమైన గురు సాంప్రదాయములనే లెక్కించక గురువులను కించపరుచుచున్నారు. అటువంటి వారిని మేము అడగడము ఏమనగా! నెల ఫీజులతో సహా డబ్బులాగి అక్షర సారాంశములేని విద్య చెప్పు గురువులకంటే ఉచితముగా నిస్వార్థముగా అన్నిటికంటే మించిన యోగశాస్త్రమును తెల్పు వారు తక్కువ వారా? ప్రభుత్వమునకు గులాము పనిచేస్తూ అధికారములో ఉన్నంతవరకు నమస్కారము పెట్టించుకొని, అధికారమూడిన వెంటనే ఎవరూ విలువివ్వని జీవితమును జీవించు వారికంటే, ఎంతో మందితో జీవితాంతము పూజ్యులుగా ఉండు గురువులు తక్కువవారా? డబ్బు ఖర్చుపెట్టి చైతన్యములేని విద్యనేర్చెడి వారికంటే, డబ్బు లేకుండా ఉచితముగా సాటిలేని విద్యను నేర్చుకొనెడి గురు శిష్యులు తెలివితక్కువ వారా?

ఎందరో తాత్కాలిక సంపత్తి, అధికారము, హోదాతో మిడిసిపోతూ రేపు నా “జీవితము” ఏమిటని యోచించక, నెలాఖరులో నా “జీతమేమిటని” యోచిస్తున్నారు. కాలగర్భములో కలసిపోవు శరీరమును గూర్చి, తనకు కల్గు అవస్థలను గూర్చి, తనను ఎవరూ రక్షించలేని అనుభవాలను గూర్చి యోచించక గ్రుడ్డిగా మానవుడు బ్రతుకుచున్నాడు. యం.ఎ. చదివి, యస్.ఐ. పని వచ్చిందని, నా స్టేషన్ పరిధిలో ఉన్నవానిని కొట్టగల అధికారముందని అనుకొనుచున్నాడు. కానీ నా శరీర పరిధిలో అధికారము గల వాడొకడు

ఉన్నాడనీ, శరీర పరిధిలోనున్న శిక్షను తాను ఏమాత్రమూ తప్పించుకోలేనని తెలియలేక పోవుచున్నాడు. ప్రపంచ చదువులు ఎన్ని చదివినప్పటికీ ఆత్మజ్ఞానము లేనిది అవిద్యయే. కావున విద్య అంటే ఏమిటో తెలియండి, అక్షరమంటే ఏమిటో తెలియండి. భాషా అక్షరములతో కూడినది అసలైన విద్య అనుకోక, అక్షరముతో కూడినదియే అసలయిన విద్య అని తెలుసుకో. నీవు ఎన్ని డిగ్రీలు పుచ్చుకొన్ననూ జీవితములో సారాంశములేనివని తెలుసుకో. తృప్తిని శాంతిని కల్పించు, మానవ జీవితమునకు సారాంశమును చేకూర్చు విద్య అయిన బ్రహ్మవిద్యను (యోగశాస్త్రమును) తెలుసుకో, ఇంత వరకూ ఉన్న అవిద్యను వదలి విద్యాపరుడవుకమ్ము. క్షరమును వదలి అక్షరమును తెలుసుకొనుము.

*****

# యోగ విద్య

జీవుడు ఆత్మను తెలుసుకొనుటకు, ఆత్మను తెలిసి పరమాత్మయందు ఐక్యమగుటకు, జనన మరణ ప్రవాహమునుండి దూరమై శూణ్యమునందు అంతటా తానైయుండుటకు యోగవిద్య నేర్వవలసి ఉన్నది. ప్రపంచములోని ఎన్నో విద్యలయందు యోగవిద్య గొప్పది, పవిత్రమైనది. మానవుని తెలివి గొప్పగా ఉంటే కాని ఈ విద్య అర్థము కాదు. అసలు చాలామందికి ఈ యోగవిద్య ఒకటుందని కూడా తెలియదు. కొందరికి తెలిసినా దానిని ఎక్కడ నుండి మొదలు పెట్టి నేర్వవలయునో తెలియదు. ఉన్న విద్యలలో ఏది యోగవిద్యయో తెలియదు. అటువంటివారు యోగవిద్యను తెలుసు కోవలయుననుకోవడములో తప్పులేదు. కానీ ఇతర విద్యలను యోగవిద్యగా

భావించి, దానిని నేర్వడము ఆచరించడములో చాలా పొరపాటు ఉన్నది. విలువైన జీవితకాలమే వ్యర్థమై పోవుచున్నది.

యోగవిద్య తెలియవలయునను వారు ఈ విద్యను ఎవరు, ఎప్పటి నుండి ప్రారంభించారు. దీనిని ఆచరించి అనుభవము పొందినవారున్నారా? దీనికి ఆధారమైనది ఏ శాస్త్రమైనా కలదా? అని తెలియవలయును. అట్లు తెలియక విన్నదీ, కన్నదీ అంతా యోగవిద్యేననుకోవడము పొరపాటు. ఈ యోగవిద్యకు షట్‌శాస్త్రములలో చివరదైన యోగశాస్త్రము ఆధారము. యోగశాస్త్రమందు యోగమునకు కావలసిన శాసనములన్నీ వివరముగా ఉండును. యోగశాస్త్రము మినహా ఐదు శాస్త్రములను మానవుడే తయారు చేశాడు. యోగశాస్త్రము మాత్రము మానవరూపములో ఉన్న భగవంతునిచే (పరమాత్మచే) బయల్పడినది. మిగతా ఐదు శాస్త్రముల చేత ప్రపంచమున ఎన్నియో ఫలితములు లభించినప్పటికీ, యోగశాస్త్రము చేత ఒకే ఒక ఫలితము లభించుచున్నది. యోగవిద్య వలన ఫలితము కర్మ నశించి మోక్షము లభించడము తప్ప మరి ఏమీ లేదు.

ఒకే ఒక ఫలితమునందించు యోగవిద్య అన్ని విద్యలకంటే కష్టమైనది. అందువలన సులభముగా ఎవరికినీ అర్థము కాదు. ఎంతో పట్టుదల ఉంటే కానీ లభించని యోగవిద్యను బోధించువారు, ప్రపంచ విద్యలు తెల్పు ప్రపంచ బోధకులకంటే అధికులు. యోగవిద్య యొక్క బోధకులు పూర్వము నుండి నేటి వరకు ఉన్నారు. నాటికి నేటికి యోగశాస్త్రము ఒకటే అయినప్పటికీ బోధించు బోధకులు నాటికి నేటికి మార్పుచెంది ఉన్నారు. ఆనాటి బోధకులు యోగవిద్యను యోగ శాస్త్రాను సారము బోధించెడి వారు. నేడు కొందరు గురువులమనుకొను బోధకులు శాస్త్రమును ఆధారము చేసుకోవడము లేదు. అశాస్త్రీయ పద్ధతిలో బోధ

చేయుచున్నారు. ఆనాడు భక్తున్ని సంపూర్ణ జ్ఞానిని చేసి తర్వాత యోగపద్ధతిని బోధించి ఉపదేశమిచ్చెడివారు. దానికి ఎంతో కాలము పట్టెడిది. నేడు పోయిన వెంటనే ఉపదేశము ఇచ్చువారున్నారు. పూర్వకాలములో ఎంతో పవిత్రముగా బోధింపబడు విద్య నేడు క్లాసులు కోర్సులను వరకు వచ్చినది. ఆనాడు శిష్యులకు గురువు ఒక్కడే. అతని చేతనే ఉపదేశము పొంది, అతనినే దైవముగా పూజించెడివారు. నేడు ఒక పెద్ద గురువు, అతని క్రింద అసిస్టెంటు గురువులు చాలా భాగాలుగా ఏర్పడినారు. పెద్ద గురువుకు వ్యవధి లేదు అని క్రింది గురువులే ఉపదేశము ఇచ్చుచున్నారు. తీసుకొను వారు తెలియనివారే కనుక మనకు ఉపదేశము లభించితేచాలని అనుకొను చున్నారు.

తీసుకొనువారు ఉపదేశము పొందవలయునను కోర్కె తప్ప, ఉపదేశమంటే ఏమిటని, దాని ఫలితమేమని ఏమాత్రము ఆలోచించడము లేదు. అంతో ఇంతో చదువుకొన్న వారు కూడా యోచించక ఇష్టమొచ్చిన మార్గమును అనుసరించుచున్నారు. పూర్వకాలములో విన్న దానిని వివరించి తెలుసుకొమ్మని, తెలుసుకొనిన దానిని ఆచరించి అనుభవానికి తెచ్చుకొమ్మని తెలిపేవారు. నీవు తెలుసుకొనిన జ్ఞానమును ఇతరులకు తెలుపమని కూడా చెప్పేవారు. నేడు గురురహస్యమని ఇతరులకు తెలుపకూడదని నిబంధనలు విధించు గురువులున్నారు. మరియు మేము చెప్పు బోధలు మాత్రము వినవలయునని, ఇతరుల బోధలు కానీ, ఇతర పుస్తకములు కానీ చూడకూడదను వారు కూడా కలరు. తమది గొప్పవిద్య అయినపుడు ఆ విధ నిబంధనలెందుకో అర్థము కాలేదు.

సంశయరహితమైనదే జ్ఞానము. సంశయములు మిగుల్చునది జ్ఞానము కాదు. నేడు సంశయములు తీర్చలేని శాస్త్రరహితమైన జ్ఞానమును

చాలామంది ప్రజలు అనుసరిస్తున్నారు. అటువంటి వారికి ఇది సరియైన దారి కాదని చెప్పినా వినరు. అసలు జ్ఞానమే కాని దానిని అనుసరిస్తూ అదియే స్వచ్ఛమైన జ్ఞానమనుకొనువారు కలరు. దైవజ్ఞానము కొన్ని నిబంధనలతో కూడియుంటుందని తెలియక వారికిష్టమొచ్చిన దానిని జ్ఞానమనుకొనువారు కలరు. గారడి విద్యలలాంటి మహాత్యములను గొప్పగా తలచినవారు బ్రహ్మవిద్యను గుర్తించలేక పోతున్నారు. ఇహములో కల్గు ప్రపంచ సుఖముల కొరకు కాకుండా పరములో కల్గు దైవసన్నిధి కొరకు జ్ఞానమును అనుసరించవలెనను విషయమును మరచిపోయి ప్రపంచ సుఖములను, ప్రపంచ కొర్కెలను నెరవేరుటకు క్రియలను చెప్పు గురువును ఆశ్రయించుచున్నారు.

జ్ఞానము తెలియకనే సాధన చేయకూడదని శాస్త్రము చెప్పు చున్ననూ, పూర్తి జ్ఞానము తెలియకనే ఉపదేశము పొంది సాధన చేయువారు కొందరున్నారు. అటువంటివారు మేము చేయు సాధన తృప్తిగా ఉందనీ, సాధనలో హాయిగా ఉందనీ, మత్తుగా ఉందనీ అంటున్నారు. వారి అనుభవాన్ని ఎన్నో విధములుగా చెప్పినప్పటికీ దీనివలన మనకు లభించు ఫలితమేమి? ఏ ఫలితము కోసము సాధన చేయుచున్నాము అనుమాట పూర్తిగా మరచినారు. ప్రతి పనికి ఒక ఫలితముంటుంది కదా! మీరు చేయు సాధనకు ఏ ఫలితమున్నదని కొందరిని అడిగిన మాకు ఆత్మశాంతిగా ఉన్నదని, ముందుకంటే మనసు నిర్మలముగా ఉన్నదనియే చెప్పుచున్నారు. అసలైన ఫలితమును మరచిపోయి సాధన చేయడమే ముఖ్యమనుకొను చున్నారు. యోగశాసనముల మినహా ఉన్న పద్ధతులు యోగముకాదని తెలియనివారు అశాస్త్రీయపద్ధతిలో సాధన చేస్తున్నారు. అటువంటి సాధన వలన కర్మ నాశనమగు శక్తి లభించదు. కర్మ నాశనముకాని సాధన ఎంత ఘాడముగా చేసిన ప్రయోజనము లేదు.

మరి కొందరు ఆత్మను గురించిన సాధన చేస్తున్నామంటున్నారు. అయినప్పటికి వారు  మా సాధన వలన కొన్ని జన్మల తర్వాత మాకు దేవతాజన్మలు లభించుతాయని అంటున్నారు.  యోగము అనుపదము ఉపయోగిస్తూ దేవతలుగా మారుతామనుట ఆశ్చర్యకరము.  జీవాత్మ ఆత్మతో సంయోగము చెందినపుడు యోగమంటాము.  యోగము వలన మోక్షము లభించునని, పుణ్యము వలన ఉత్తమ జన్మలు, దేవతారాధన వలన దేవతా జన్మలు లభించునని యోగశాస్త్రము తెలియజేయుచున్నది.  అటువంటపుడు యోగము వలన దేవతా జన్మలు లభించుననడము అశాస్త్రీయము కాదా!

మా సాధనకు శాస్త్రము అవసరము లేదని, మా గురువుగారు మాముందు ఉంచిన ఆహారమును తినడమే మాకు ముఖ్యమని కొందరను చున్నారు.  అట్లు తినడములో తప్పులేదు కానీ తినే తిండి వలన మన శరీరములో ఉన్న రోగము పోతుందా, లేని రోగము వస్తుందా అని యోచించడము ముఖ్యము.  అందువలన ఏది ఎటువంటిదను విమర్శనా శక్తి నీలో రావలయును.  విమర్శ ద్వారా సత్యాసత్యములు తెలుసుకొను స్థోమతకు నీవు రావలెను.  సంశయములను వెంటనే నిర్మూలనము చేయు జ్ఞానివి కావలయును.  అపుడు యోగ సాధన ఆచరించిన కొద్దీ నిమిషముల లోనే యోగమును సాధించవచ్చును.  అట్లుకాకుండా ప్రపంచములో ఆస్థులు పెద్దగా ఉన్నవారు  గొప్ప గురువులనుకొని వారి మాటలను నమ్మితే జీవిత కాలము వృథా అగును. వారు చెప్పు మార్గమును  యోచించి శాస్త్రపద్ధతియైతే దానిని అనుసరించినా జీవితము సాఫల్యమగును.

వేయిమంది బోధకులలో ఒక గురువు ఉండవచ్చును, ఉండక పోవచ్చును.  గురువు వేయి సంవత్సరములకొకమారు భూమి మీదకు రావచ్చును, రాకపోవచ్చును.  కావున గురువు విషయములో జాగ్రత్త లేకపోతే

నీ జన్మే వృథా అవుతుంది. ప్రతీ విద్య ఆరు శాస్త్రముల సంబంధముగనే ఉండును. ప్రతీ విద్య శాస్త్రబద్ధమైనపుడు బ్రహ్మవిద్య శాస్త్రము కాకుండునా? శాస్త్రీయ పద్ధతిలో యోగసాధన చేసిన నరుడు యోగశక్తి పొంది కర్మనుండి ముక్తుడు కాగలడు. యోగశాస్త్రవిశారథుడైన శ్రీకృష్ణుడు తెలిపిన యోగ శాస్త్రమైన భగవద్గీతను చూడండి, అందులోని శాసనములు వెలికి తియ్యండి, ఆచరించండి, తప్పనిసరిగా యోగినుండి బ్రహ్మర్షి వరకు ఎదగగలరు. శాస్త్రము తెలిసినవాడు శాస్త్రి, యోగము చేసినవాడు యోగి. అందువలన యోగశాస్త్రము తెలిసి శాస్త్రివై, యోగము ఆచరించి యోగివై, కర్మరాహిత్యము చేసి సిద్ధుడై పోవలయునని తెలుపుచున్నాము. శాస్త్రి కాని యోగి, యోగి కాని శాస్త్రి పరమాత్మను పొందలేడు.

*****

# వక్రమార్గము

భూమి మీద ఒకటి చిన్న దేశముంటే మరియొకటి పెద్ద దేశమున్నది. ఇట్లు ఎన్నో చిన్న పెద్ద దేశములతో భూమి నిండి ఉన్నది. చిన్న దేశములో గానీ, పెద్ద దేశములో గానీ ఆ దేశానికి చట్టరీత్యా ఒక అధ్యక్షుడు ఉంటాడు. ఆ అధ్యక్షుని యొక్క ఆజ్ఞలో ఆ దేశస్థులందరూ మెలగవలసి ఉన్నది. చట్టరీత్యా అతనిని అందరూ గౌరవించవలసి ఉన్నది. కేవలము ఒక్క దేశమునకు నాలుగైదు సంవత్సరములు మాత్రము అధ్యక్షపదవిలో ఉన్న వానినే ఎంతో గౌరవించు ప్రజలు, భూమిమీద అన్ని దేశములకేగాక, విశ్వములోని అన్ని గోళములకు ఆదికర్తయై, అధ్యక్షునిగా శాశ్వతముగా ఉన్న దైవమును ఎవరూ గౌరవించడము లేదు. ప్రపంచమునకంతటికీ ఆదికర్తయైన పరమాత్మ ఒకడున్నాడని తెలిసినవారు

కోటికొక్కడు కూడా ఉండుట అరుదు. ఈ మాట కొందరికి ఆశ్చర్యమును కలుగ చేయవచ్చును. ఎన్నో దేవాలయములు ఉన్నాయి, ఎందరో భక్తులు ఉన్నారు, ఎన్నో విధ ఆరాధనలు జరుగుచున్నాయి, ఎంతో డబ్బును దేవుని కోసము మేము ఖర్చు చేయుచున్నాము అటువంటపుడు కోటికొకరు కూడా అరుదను మాట ఎంత సమంజసము అను సందేహము చాలామందికి కలుగవచ్చును.

నిజము చెప్పాలంటే నేటి మానవులలో భక్తి ఉన్నది. కాని అది అసలైన దేవుడొకడున్నాడని కాదు. వేల దేవతలను మానవుడే సృష్ఠించుకొని వారిలో కొందరిని ఆరాధిస్తున్నాడు. మానవులలో భక్తి దేవుని మార్గము వైపు సాగక అన్యదేవతలవైపు పోవుచూ ఏనాడో వక్రమార్గము పట్టినది. గుణములేని దేవునికి కూడా ఆశ అను గుణమును కల్పించి నాకు ఈ పని నెరవేర్చు నీకు నేను ఇది ఇస్తానని దేవునికే ఆశ చూపు స్థితికి మన భక్తి దిగజారి వక్రమార్గము పట్టినది. సిద్ధాంతము ప్రకారము దేవుడు ఏమీ చేసేవాడు కాడు, సాక్షి భూతునిగా చూసేవాడు మాత్రమేనని శాస్త్రములో ప్రకటించి చెప్పారు. దేవుడంటే ఎవరని తెలియనివారు ఎందరినో దేవుళ్లను కల్పించుకొని అసలైన దేవున్ని తలవను కూడా తలవలేదు. దేవతల భ్రమలో పడినవారికి అగమ్య గోచరమైన దేవుడొకడున్నాడని కూడా తెలియదు. కంఠమాధుర్యమును బయటికి చూపు భజనలు, అందచందాలు చూచు కొనుటకు అనుకూలమైన తిరునాల్లు ఈనాడు ఉన్నాయి. నాడు దేవుని పేరుతో జరుపుకొను తిరునాల్లు నేడు గుంపులో త్రోచుకొనే దానికి అన్నట్లున్నాయి. ఇది వక్రమార్గము కాదా! పూర్వము దైవమును తెలియజేయు చిహ్నములుగా వెలసిన దేవాలయములు దర్శనానికి టికెట్లు, పూజలకు రేట్లు పెట్టి ధనార్జనలో పోటీపడుచున్నాయి. ఇది వక్రమార్గము

కాదా! పరమార్థచింతన గల్గి ఆ పరమార్థమునే బోధించి దానిని తెలుపుటయే మా కర్తవ్యమను బ్రహ్మవిద్యా గురువులు నేడు పరమార్థమును వదలి ప్రపంచార్థమైన విద్యాబోధనలను చేయుంచుచూ చిన్నబడి నుండి పెద్ద విశ్వవిద్యాలయము వరకు నెలకొల్పుచున్నారు. ఇది వక్రమార్గము కాదా! ప్రపంచమునకంతా ఒకే దేవుడని తెలియక మతముకొక దేవుడని మతద్వేషములు పెంచుకోవడము నేటి ప్రజల వక్రమార్గము కాదా! కుటుంబములోని వ్యక్తిని చనిపోయేటట్లు చేయి నాకు వచ్చిన ఆస్తిలో పావలా భాగము నీకు ముడుపు వేస్తానని నీచమైన కోర్కెలు కూడ కోరే స్థితికి మన భక్తి దిగజారిందంటే అది పూర్తి వక్రమార్గము పట్టినట్లే కదా!

మానవులు ఈ విధముగా మారిపోవుటకు కారణము ఏమిటని యోచిస్తే ఒకటి అసలైన దైవమును గురించి తెలియజెప్పే గురువులుగానీ, స్వాములుగానీ ఈనాడు లేరు. రెండు నిజమైన దేవుడొకడున్నాడని ఎవరైనా చెప్పేవారు ఉండినా వినేవారు లేకుండా పోయారు. ఈ రెండు కారణముల వలన దైవమార్గము వక్రమార్గమై పోయినది. ఈనాడు గురువులు భక్తిని కల్గించు పెద్దలు ఉన్నారు కదా! మీరు లేరంటున్నారేమిటని కొందరికి ప్రశ్న రావచ్చును. దానికి మా సమాధానము దైవత్వమును తెలిసిన జ్ఞానులు ఎవరైనా ఉంటే ఇప్పటి సమాజమును చూచి మనము సత్యము చెప్పితే మనుషులు వినే స్థితిలోలేరనీ, అలా సత్యమును చెప్పితే ఇపుడున్న వీరికి వ్యతిరేఖముగా కనిపిస్తుందనీ, దానివలన తమకే ముప్పుకల్గుతుందని తలచి భయపడి ఏమీ చెప్పక ఊరకున్నారు. కొందరు పెద్దలు దైవత్వము యొక్క సారాంశము తెలియనివారైనప్పటికీ వారు అనుసరిస్తున్నది వక్రమార్గ మైనప్పటికీ, అదే గొప్పదని అదే ప్రజలకు బాగా నచ్చుతుందని తలచి

దానిలోనికే ఇంకా కొంతమందిని ప్రవేశపెట్టవలయునని ప్రయత్నించుచుందురు. ఉదాహరణకు ఒక విషయమును తెలియ చెప్పుకొందాము.

పూర్వపు పెద్దలు దైవమార్గములో ఏర్పరిచిన పద్ధతులను పూర్తిగా వదలిపెట్టి, తమ ఇష్టమొచ్చిన ఒక దేవతనో లేక దేవున్నో కల్పించుకొని, తాము ఆరాధిస్తూ వక్రమార్గములో చాలామంది ప్రయాణించుచున్నారు. అటువంటివారు ఇంకా ఏమనుచున్నారనగా! మనము లాభము పొందేదానికే ఈ దేవత ఉన్నదని, మనము లాభము పొందాలంటే దానికి ఒక క్రమమున్నదనీ, ఈ దేవతకు ఈ పూజ చేస్తే ఇంత లాభమొస్తుందనీ, చేయని వారికి నష్టమొస్తుందనీ లాభ నష్టముల లిస్టు వ్రాసి, ఆ వ్రాతనంతా కొన్ని వందల కాగితముల మీద అచ్చువేసి పంచడము జరుగుచున్నది. అది అంతటితోనే ఆగక ఆ కాగితమును చూచినవారు అటువంటి నమూనా కాగితములనే వారు తయారు చేసి ఇతరులకు పంచవలెననీ, అట్లు పంచని వారికి కష్టాలు నష్టాలు వస్తాయనీ, పంచిన వారికి సుఖము లాభము వస్తుందనీ. ఈ విధముగా చేసిన వారికి ఇంత డబ్బు వచ్చింది, హేళనగా వదలివేసిన వారికి చాలా కష్టములు, నష్టములు వచ్చాయని కూడా అందులో వ్రాసి ఉండుట వలన ఆ కాగితమును చదివిన ప్రతివారు అదే విధముగా అచ్చువేసి పంచుతున్నారు. చదివిన వారు లాభాలొస్తాయను ఆశతోనైన లేక అలా పంచక పోతే నష్టమొచ్చునను భయముతోనైన వారు అలాగే చేయుచున్నారు.

ఏమి తెలియని ప్రజలలోనికి అంతో ఇంతో తెలిసినవారు ఇలా చేసి ఒక రోగాన్ని ప్రవేశ పెట్టినట్లు చేస్తే, ఆ రోగము కలరా క్రిమిలాగ వ్యాపించి పోవుచున్నది. ఈ విధముగా బహుళ ప్రచారములో ఉన్న విషయములే నేటి మానవునికి అంటుకొని ఉన్నవి. ఎవడైనా ఇది

వక్రమార్గము సరియైన మార్గమిదికాదని చెప్పినా మానవుడు వినేస్థితిలో లేడు. దేవుడు అణువణువున వ్యాపించి ఉన్నవాడు. దేవుడు మనయందు కూడా వ్యాపించి ఉన్నాడు. ఆ దైవము కర్మ అను మూలసూత్రముచే ప్రపంచమునంతటినీ నడుపుచున్నాడు. మనము చేసుకొన్న పాప పుణ్యములే కర్మవుతున్నది. ఆ కర్మే ప్రతి జీవిని క్రమము తప్పక నడిపిస్తున్నది. కర్మ వలననే జీవితములో సుఖదుఃఖములు కల్గుచున్నవి. లాభనష్టములు, సుఖ దుఃఖములు కర్మననుసరించి ఉండునని శాస్త్రము తెలియచెప్పుచుండగా అజ్ఞాన మానవుడు ఈ పని చేస్తే లాభమొస్తుంది, ఈ పని చేయకపోతే నష్టమొస్తుందని, ఆశనో భయమునో కల్పించుచున్నాడు. మన కర్మ రికార్డులలో కష్టమొచ్చుట ఉండినపుడే కష్టము వచ్చునని, అలాగే లాభమొచ్చునట్లున్నపుడే లాభమొచ్చునని, అలాకాక భూమి మీద ఏ దేవతలు లాభనష్టములు కల్గించలేరని చాలామందికి తెలియదు. మేము ఇంతగా చెప్పుచుండినప్పటికి, మేము చెప్పుటయే కాక యోగశాస్త్రము మరియు పూర్వపు మహర్షులు చెప్పినప్పటికీ అసలు మార్గమును గుర్తించలేక వక్రమార్గమునే అనుసరిస్తూ మమ్ములను వెక్కిరించువారు కూడా కలరు.

ఎవరు ఏమి చెప్పినా కర్మమును మినహా ఏ దేవత కానీ, ఏ దేవుడు కానీ, లాభమును గానీ, నష్టమును గానీ కల్గింపజాలరు. పలానా సమయమునకు చావవలెనని కర్మ ఉండినవాడు ఎన్ని దేవతలకు మ్రొక్కినా వాడు బ్రతకడు. చావు లేనివాడు మ్రొక్కినా, మ్రొక్కకున్నా బ్రతకగలడు. నేటి కాలములో ఎంతో పవిత్రమైన దేవాలయములని పేరుగాంచిన దేవాలయ సమీపములోనే దైవదర్శనమునకు పోయినవారు ప్రమాదాలకు గురవుచున్నారు. వారిని అక్కడి దేవుడు ఎందుకు కాపాడలేక పోయాడు? ఆలయములో మ్రొక్కుబడులు చెల్లించి రెండవ సంవత్సరము కూడా గుడికి

వస్తానని మ్రొక్కిపోయిన వారు తిరిగి ఇల్లు చేరకమునుపే ప్రమాదాల కారణముగా మృత్యువాతబడడము జరుగుచున్నది. అపుడెందుకు ఆ దేవుడు వారిని ఆ ప్రమాదాలనుండి కాపాడలేక పోయాడు? అది కర్మప్రకారము జరుగును కనుక అలా జరిగితీరుతుంది. కర్మరాహిత్యము చేయబడని మార్గములో దేవున్ని ఆరాధిస్తే ఏమీ ప్రయోజనము లేదు. దైవజ్ఞానమును తెలిసిన ప్రవక్తలు చెప్పిన పద్ధతి ప్రకారము, భగవద్గీత చెప్పిన ప్రకారము దైవారాధనలు చేస్తే అవి సక్రమమార్గములవును, లేకపోతే అవి వక్రమార్గములవును. ముందు దైవమార్గములో వక్రమార్గమంటే ఏమిటి, సక్రమ మార్గమంటే ఏమిటని యోచించండి. మానవులు కల్పించు ఆశలకు, దేవుడు లొంగువాడు కాదని తెలియండి. ఏదో కల్గుతుందని ఆశించి పూజించు వాడు లాభమొచ్చిననాడు దేవున్ని పూజిస్తాడు, నష్టమొచ్చిననాడు దూషిస్తాడు. అటువంటి పద్ధతి లేకుండా అన్నిటికీ కారణమైన కర్మను గూర్చి తెలుసుకొని, ఆ కర్మను లేకుండా చేసుకొని అసలైన దైవమును చేరండి.

*****

# యోగశక్తి

మనిషి చర్మాసనమును ఉపయోగించి, యోగదండమును ఉపయోగించి సరైన యోగమునందు నిలిచియుండిన సమయమున యోగశక్తి మనిషి శరీరమునందు ప్రవేశించునని తెలుసుకొన్నాము. ఇక్కడ కొందరికి యోగశక్తి అనగానేమి? అది ఎట్లుండును? దాని ప్రయోజనము మానవునకు (జీవునకు) ఏమియుండును? అను సంశయములు బయలు దేరవచ్చును దానికి నా సమాధానము వినుము.

యోగశక్తి అనగా దానికి ఎన్నో పేర్లు ఉన్నవి. జ్ఞానశక్తి, పరమాత్మ శక్తి, ఆత్మశక్తి, జ్ఞానాగ్ని అని యోగశక్తినే అందురు. ఎన్నిపేర్లున్నా శక్తి మాత్రము ఒక్కటే. అది ఎట్లుండుననగా దానికి ఆకారము లేదు, రంగులేదు, రుచిలేదు, వాసనలేదు, కావున స్థూలదృష్టికి అది కనిపించదు. సూక్ష్మదృష్ఠికి, జ్ఞానదృష్టికి మాత్రము కనిపించును. కావున దానిని గురించి చెప్పుటకు వీలగును. ప్రపంచములో జీవులకు దాని ప్రయోజనము నోటితో చెప్పలేనంత ఉన్నది. జ్ఞాన (యోగ) శక్తి లేని జీవితము నిరర్థకము. పవిత్రమైన మానవజన్మను పొంది, ఆత్మ విషయములయందు ముఖ్యమైన జ్ఞానశక్తిని తెలుసుకోలేని ఎడల మానవజన్మకే అర్థము లేకపోవును. అటువంటి యోగశక్తిని గురించి తెలుసుకొందాము.

యోగశక్తికి రూపములేదు అయినా మీకు అర్థమగుటకు ఒక రూపముగా భావించి చెప్పుచున్నాము. యోగశక్తి ఒక విధమైన పొగ రూపముగా ఉన్నదనుకొనుము. అది భూమి మొదలుకొని ఆకాశము వరకు వ్యాపించి ఉన్నది. అనగా ప్రకృతి స్వరూపములైన పంచభూతముల యందు అన్నిటా నిండుకొని ఉన్నది. ఒక మనిషిలోపల కూడా శక్తియున్ననూ బయటకూడ మనిషి చుట్టూయుండును. సముద్రములో జీవరాసులు ఎక్కడ ఉన్న నీటియందే ఉండినట్లు సకలజీవరాసులు యోగ (ఆత్మ) శక్తియందే ఉన్నవి. నీకు నాకు మధ్యన కంటికి కనిపించక ఉండునది అంతయు యోగశక్తియే. శక్తిలో లేని జీవరాసంటూ ప్రపంచమున లేదు. అణువణువున అదియే వ్యాపించి ఉన్నది దీనినే పరమాత్మశక్తి, పరమాత్మ అనికూడా అనుచున్నారు. ఈ శక్తిలోనే నవగ్రహముల స్థూలదేహములైన సూర్యగోళము, చంద్రగోళము, నక్షత్రగోళములు బంధింపబడి శూణ్యమున తేలుచున్నట్లు అగుపించుచున్నవి. ఈ యోగశక్తిని (జ్ఞానశక్తిని) సమూలాగ్రముగా తెలుసుకొన్న జీవునికి తిరిగి జన్మ ఉండదు.

యోగశక్తి యోగియందు ప్రవేశించుచుండును అన్నాను కదా! అంతకుముందు మానవునియందు శక్తి ఏమాత్రము ఉండదా? అను సంశయము కొందరికిరావచ్చును. దానికి సమాధానము, ఒక్క మానవుని యందే కాక సర్వజీవరాసులయందును శక్తి సమముగా ఉండును. కానీ యోగి యోగమాచరించుకొలదీ అతనియందు బయట ఉన్న శక్తి కూడా ప్రవేశించి ఎక్కువగుచున్నది. అందువలననే గీతయందు పరమాత్మ **"నన్ను పూజించు మనుజులు నాలుగు రకములుగా ఉన్నారు. అందు జ్ఞాని శ్రేష్ఠుడు, వానియందు నేను నాయందు వాడుండును"** అని అన్నాడు. శక్తి యోగి శరీరమున ప్రవేశించి సప్తస్థానమున నిలుచుచుండును. ఇట్లు ప్రవేశించు శక్తి ఒక నిర్ధిష్టమైన సంపూర్ణ స్థితిని అందుకోగానే ఆ యోగికి మోక్షము ప్రాప్తించును. యోగమును ఆచరించు యోగులు అందరూ సమానముకాదు. ఎందుకనగా యోగశక్తి ఒకరియందు ఎక్కువ, ఒకరియందు తక్కువ ఉండవచ్చును. కావున ఆ శక్తిని బట్టి యోగులయందు కూడ చిన్న పెద్ద భేదములు ఉన్నవని చెప్పవచ్చును. యోగశక్తిని పొగరూపముగా భావించుకున్నాము కదా! యోగి యోగము చేయు సమయమున అతని శరీరమునకు గల సూక్ష్మరంధ్రముల ద్వారా యోగశక్తి అతని లోపలికి ప్రవేశించుచుండును. ఇక్కడ బయట ఉన్న శక్తి లోనికి ప్రవేశించి శరీరములో దాని సాంద్రత పెరిగిన, బయట ఖాళీపడును కదా అని కొందరికి అనుమానము రావచ్చును. దానికి సమాధానము, ఇంటినిండా దట్టముగా నిండుకొనియున్న పొగ కొంత కిటికీగుండా బయటికి పోయిన ఇంటియందు ఖాళీ స్థలము ఏర్పడదు. కానీ పొగయొక్క సాంద్రత తగ్గును. అటులనే పరమాత్మ శక్తి అపారమైనది దానియందు అణుమాత్రము యోగి యందు ప్రవేశించిన ఖాళీ ఏర్పడదు. సాంద్రత కూడ తగ్గినది అని చెప్పుటకు

వీలుకాక ఉండును. యోగి సంపూర్ణ స్థితి చెంది తిరిగి ప్రపంచమంతటా నిండియున్న శక్తిలోనే కలసి మోక్షము పొంది, జన్మఎత్తక పోవుటచే యోగియందు చేరిన శక్తి తిరిగి శూణ్యముననే చేరుచున్నది. కావున శక్తి ఎక్కడ ఖాళీ ఏర్పడక ఎప్పటి మాదిరే ఎల్లవేళలా ఉంటున్నది. దీనినిబట్టి జీవరూపము దైవరూపముగా మారుటకు శక్తి ఆధారముగా ఉన్నదని తెలియుచున్నది. శక్తియే దైవము, దైవమే శక్తి. రంగు, రూపము, రుచి, వాసనయున్న కర్పూరము శూణ్యమున కలియుటకు అగ్ని అవసరమయినట్లు రంగు, ఆకారము, గుణములు కలిగిన జీవుడు శూణ్యమున (పరమాత్మలో) కలియుటకు శక్తి అవసరము. యోగులు శక్తి సంపాదించనిది పరమాత్మలో కలియలేరు. కావున ప్రతి యోగి కష్టమునకోర్చి సాధన జరుపుకొన వలయును. అట్లు లేకున్న దైవమునందు కలియుటకు వీలుకాదు.

అనంతశక్తి అయిన పరమాత్మ నుండి సంచలనమై ఉద్భవించిన జీవరాసులు తిరిగి ఆ శక్తియందే లీనము కావలయును. అట్లు లీనమగుటకు ఆ శక్తిని గురించి తెలుసుకోవలయును. శక్తిని తెలుసుకున్న తర్వాత తన నిజస్థలమేదైనది, తన నిజమైన పేరేదైనది, నిజానికి తను ఎవరు అన్నది తెలుసుకొనగలడు. శక్తిని తెలుసుకోలేనంత వరకు తన నిజస్థితి ఏమాత్రము తెలియక, తన పేరడిగిన పుట్టిన తర్వాత పెట్టబడిన పేరునే చెప్పుచుందుము. అదియు తనకు ప్రపంచ తెలివి వచ్చిన తర్వాత ఇతరులు పేరుతో పిలుస్తూయుండగా అదియే నా పేరు అని అనుకొని దానిని చెప్పుచున్నాడు. కానీ నిజానికి నీ పేరు ఏమంటే చెప్పలేడు. నీవెవరని ప్రశ్నించిన ఫలాన వారి కొడుకును అని అనుచున్నాడు, అదియు వారికే పుట్టాడు అని అందరూ అంటూయుంటే తను అంటున్నాడు. ఇతరులు మొదట వీరే మీ తల్లీ తండ్రీ అని చెప్పితే వారినే జీవితాంతము

తల్లితండ్రులుగా చెప్పుచున్నాడు, శక్తిని తెలుసుకున్న తర్వాత నిజముగా నీ తల్లి తండ్రి ఎవరని ప్రశ్నించిన ప్రపంచములో శరీర సంబంధమయిన తల్లితండ్రుల పేర్లు చెప్పక పరమాత్మయే తండ్రి అని నిజమైన సమాధానము చెప్పగలడు.

ఆత్మశక్తిని సంపాదించుకొన్న వానినే పెద్దలు యోగి అని అనుచున్నారు. యోగి శరీరమున ప్రవేశించిన ఆత్మశక్తి అట్లేయుండునా? అంటే ఉండదనియే చెప్పవచ్చును. ఎందుకుండదనగా మామూలు అగ్నికి ప్రపంచములో సర్వ వస్తువులను కాల్చే గుణము ఉన్నది. అట్లే యోగియందు ఉన్న జ్ఞానశక్తికి (యోగశక్తి) సర్వ కర్మలను కాల్చే గుణమున్నది. కావున యోగియొక్క కర్మలను కాల్చి బూడిద చేయుటకు శక్తి ఖర్చువుచూ ఉన్నది. యోగిశక్తిని సంపాదించుకొలది ఆ శక్తి కొంత కర్మను కాల్చుటకు ఉపయోగపడుచుండును, కొంత మిగులుచుండును. కర్మలు సంపూర్ణముగా కాలినరోజు జీవునితో కూడబడియుండిన శక్తి జీవుని తనయందే లీనము చేసుకొని జన్మ లేకుండా చేయును. జన్మ రావలయునన్న కర్మయుండ వలయునుకదా! మోక్షము రావలయునన్న జ్ఞానశక్తి ఉండవలయునుకదా! కావున కర్మలేనిది జన్మలేదు, జ్ఞానము లేనిది మోక్షము లేదు.

జ్ఞానశక్తికి కర్మను కాల్చు శక్తి ఉన్నది. కావున గీత యందు పరమాత్మ జ్ఞానయోగములో *"యథైదాంసి సమిద్ధోగ్నిర్భస్మ సాత్కురు తేర్జున, జ్ఞానాగ్ని సర్వ కర్మాణి భస్మసాత్కురుతే తథా"* **"అగ్నియందెన్ని కట్టెలైన గాని భస్మమై నాశనమై పోయినట్లు జ్ఞానమను అగ్నిచే సర్వకర్మలు భస్మమొనరింపబడుచుండును"** అని అన్నాడు. దీనిని బట్టి కర్మ జ్ఞానశక్తి వలన నిశ్శేషముగా కాలిపోవుటకు వీలున్నదని తెలియుచున్నది. మరియు

జ్ఞానశక్తి చేత యోగి తన కర్మనే కాక ఇతరుల కర్మను కూడా కాల్చవచ్చును. అగ్ని ఏ కట్టెనైనా కాల్చినట్లు జ్ఞానాగ్ని ఎవరి కర్మనైనా కాల్చగలదు. అది ఎట్లనిన వినుము.

శరీరమునందు ప్రవేశించిన యోగశక్తిని యోగి సంకల్ప పూర్వకముగా ఇతరులయందు ప్రవేశింపజేయవచ్చును. అట్లు శక్తిని యోగి శరీరము నుండి బయటికి పంపుటకు నాలుగు మార్గములు కలవు. ఒకటి అరచేయి, రెండు పాదము, మూడు చూపు, నాలుగు వాక్కు ఈ నాలుగు యోగశక్తిని బయటికి పంపుటకు యోగి శరీరమున ద్వారములుగా ఉన్నవి. శ్రీ పోతులూరి వీరబ్రహ్మముగారు అచ్చమ్మ కుమారుని కన్నుల మీద హస్తము ఉంచుట చేత అరచేతి ద్వారా శక్తి ఆ కర్మ జీవియందు ప్రవేశించి అంధత్వకారణమైన పాపమును కాల్చి వేసెను. కావున అచ్చమ్మ కుమారునికి చూపువచ్చెను. అట్లే ఏసుప్రభువు గ్రుడ్డివాని కళ్ళకు మట్టిపూసి చూపు తెప్పించెను. అరచేతితో తాకి కుష్ఠరోగులను సహితము బాగుచేసెను. మరియు ఆయన నోటితో చెప్పినంతమాత్రమున దయ్యములు పారి పోయెను. శ్రీకృష్ణుడు కండ్లనుండి చూచినంత మాత్రముననే కొంతమంది బాధలు నివారణమాయెను. ఈ విధముగా ఎందరో మహానుభావులైన యోగులు తమలోయున్న యోగశక్తిని (జ్ఞానాగ్నిని) ఇతరులకు చూపు, నోరు, అరిచేయి, అరికాలు ద్వారా సంకల్పముతో ప్రసరింపచేసి వారిలోనున్న కర్మలను కాల్చిరి. కావున యోగశక్తి వీలుపడితే ఎవరి కర్మనైన కాల్చును అని తెలియుచున్నది. జీవుని జన్మకు కర్మే కారణము. కర్మను కాల్చు బలము ఒక్క పరమాత్మ శక్తికే ఉన్నది. పరమాత్మను నమ్మిన వారికే ఆ శక్తి లభించును. అది లభించిన జన్మలు అంతమొందును, జన్మలేకున్న జీవుడు అనంతశక్తి అయిన పరమాత్మయందు లీనమైపోవును. అత్మయందు

లీనమైన జీవుడు జగతి యొక్క ప్రళయములకు ప్రభవములకు సంబంధము లేక నిత్యానందములో నిండిపోవును. కావున శాశ్వత ఆనంద పదవి కావలయునన్న నిత్యము యోగమాచరించి యోగశక్తి సంపాదించవలయు నని తెలియజేయుచున్నాము.

*****

# యోగదండము యొక్క ఆవశ్యకత

సర్వప్రపంచాత్మక పరబ్రహ్మము లేక పరమాత్మ, లేక దేవుడు సర్వజీవరాసుల శరీరములందు నివాసము చేయుచున్నాడు. కనుక జీవరాసుల శరీరము యొక్క నిర్మాణములోని ప్రత్యేకత గురించి తెలుసు కొనుట బ్రహ్మవిద్యయందు ముఖ్యమైన విషయము. శరీరములు వేరైన అందులో ఉన్న పరమాత్మ యొక్క అంశము ఒక్కటే. జీవులు ఎన్నైనా వాటితో పాటు గల ఆత్మ వలన చలనమవుతున్న జీవరాసుల శరీరమును విభజనచేయగా ప్రతి శరీరము రెండు భాగములుగ కనిపిస్తున్నది. అవియే కుడి ఎడమ భాగములు. కుడిప్రక్క ఏ అవయవములు ఉన్నవో, అవియే ఎడమ ప్రక్కన కూడ ఉన్నవి. ఇది ప్రతి జీవరాసి శరీరములో గమనించ వచ్చును. చీమ మొదలుకొని ఏనుగు వరకు నిర్మాణము ఒకే రకముగా ఉండును.

మానవ శరీరమును పరిశీలించి చూచితే ఒక భాగమున ఏమి ఉన్నవో రెండవ భాగమున కూడ అవియే ఉన్నవి. ఒక ప్రక్క చెవిగలదు దానికి మరో ప్రక్క మరొక చెవి ఉన్నది. కుడి ప్రక్క కన్ను ఉన్నది, దానికి ఎడమ ప్రక్కన వేరొక కన్ను ఉన్నది. కుడి ప్రక్కన ముక్కురంధ్రము ఉన్నది.

దానికి ఎడమ ప్రక్కన వేరొక ముక్కురంధ్రము ఉన్నది. కుడి ప్రక్క యొక్క కళ్ళు, కనుబొమలు, చెవులు మొదలగు అవయవముల యొక్క కొనలు, మొదలు ఏ దిశకు ఉన్నా దానికి వ్యతిరేకముగా అవే అవయవములకొనలు మొదల్లు వేరొక దిశకు ఉండును. మనిషికి నోటియందు దంతముల సంఖ్య 32 ఉన్న వాటియందు 16 ఒక వైపు, మిగత 16 వేరొక వైపు ఉండును. అట్లే అన్నీ సమపాళ్లుగ విభజింపబడి ఉండును. పై దంతముల వరుసనందు ముందర వెడల్పయిన దంతములు రెండు ఉండును. వాటి యందు ఒకటి కుడిప్రక్క, ఒకటి ఎడమ ప్రక్క ఉండును. వాటి నుండి చూచిన కుడిప్రక్క మూడవది ఒక కోరపళ్ళు ఉండును. అదే విధముగా ఎడమ ప్రక్క కూడ మూడవది ఒక కోరపళ్ళు ఉండును. అట్లే కుడి ప్రక్క ఎన్ని దవడ దంతములు ఉన్నవో ఎడమ ప్రక్క కూడ అన్నియే ఉండును. అదే విధముగా కుడిప్రక్క ఒక హస్తము దాని వ్యతిరిక్త దిశలో వేరొక హస్తము ఉండును. అట్లే శరీరమంతయు రెండు భాగములుగా కనిపించును. లోపలయున్న అవయవములు కూడ రెండుగా విభజింపబడి ఉన్నవి. శరీరము రెండు భాగములయినది కదా! ఆ రెండు భాగములు కలిసినట్లు పైనుంచి క్రింది వరకు ఒక రేఖ ఏర్పడి ఉన్నది. ఆ రేఖ కుడి ఎడమ భాగములను విభజించుచు శరీర పై భాగమున ప్రత్యక్షముగా కనిపించు చున్నది. ఇది శరీరముపై ముక్కు క్రింద భాగమున, పై పెదవి మీద బాణముకొనవలె కనిపించుచున్నది. కొంతమందికి గడ్డము మీద కూడ మధ్యలో తగ్గు కనిపించుచు రేఖ ఏర్పడినట్లు కనిపించుచున్నది. మరియు కంఠము మొదలుకొని లింగస్థానము వరకు వెంట్రుకలు మధ్యనున్న రేఖ దగ్గర కలుస్తు ఒక గీత ఏర్పరచినట్లున్నది. ముఖ్యముగా పురుషులకు లింగము క్రింద వీర్య గ్రంథుల మధ్య నుంచి గుదస్థాన రంధ్రము వరకు

చిన్న తీగ లావుతో ప్రత్యేకముగ రేఖ కనిపించుచున్నది. ఈ విధముగా శరీరము రెండు భాగములుగా (కుడి ఎడమ) కనిపించుచున్నది.

పూర్వకాలము నుండి 'అర్ధనారీశ్వరుడు' అను పేరు వాడుకలో ఉన్నది. ఈ వాక్యమును విశధీకరించగా సగ శరీరము ఆడ, సగ శరీరము మగ రూపు కలిగిన దానివలన అర్ధనారీశ్వరుడు అని కొందరు అనుచున్నారు. నారీ అనగ ప్రకృతియనీ, ఈశ్వర అనగా పరమాత్మయనీ అర్థము ప్రకృతి పరమాత్మలు లేని శరీరము భూమిమీద లేదు. కనుక ప్రతి శరీరములు అర్ధనారీశ్వరమేనని ప్రతి ఒక్కరూ తెలుసుకోవలెను.

అర్ధనారీశ్వరుడు ప్రపంచమంతయు నిండి ఉన్నాడు, ప్రతి జీవరాసి శరీరములోను కూడుకొని ఉన్నాడు. ఏ విధముగా ఉన్నాడనగా! అర్ధ అనగా సగము, నారీ అనగ అబల లేక స్త్రీ, ఈశ్వర అనగ బల లేక పురుషుడు. ప్రతి శరీరమును పరిశీలించగా స్త్రీతత్త్వము, పురుషతత్త్వము కనుపించుచునే ఉన్నది. ఎక్కడ పురుషతత్త్వము ఉన్నదో, అక్కడ వ్యతిరిక్తమైన స్త్రీతత్త్వము ఉన్నది. అందువలననే శరీరము రెండు భాగములుగా విభజింపబడి ఉన్నది. ఒక భాగమున పురుషతత్త్వము ఉండగా వేరొక ప్రక్క భాగమున స్త్రీతత్త్వము ఉన్నది. అందువలననే శరీరము ఒక ప్రక్క బలముగా ఉండగా, వేరొక ప్రక్క బలమునందు వ్యత్యాసము కలిగి ఉన్నది. శరీరమున ఒక ప్రక్క అవయవములు ఒక సైజు ఉండగా, వేరొక ప్రక్క అవయవముల సైజునందు భేదమున్నది. అట్లే చూపునందునూ, వినికిడియందునూ, ప్రతి ఒక్క దానియందును భేదము కలదు. కుడి చేతితో రాయి విసిరినట్లు ఎడమ చేతితో విసరలేము. ఒక చేతితో ఎత్తిన బరువును వేరొక చేతితో ఎత్తలేము. ఈ విధముగా ప్రతి జీవరాసి శరీరము అర్ధనారీశ్వర ఆకారముతో ప్రపంచమునందు ప్రత్యక్షముగ కనిపించుచుండగ తెలియక వేరువేరుగా

ఉన్న పార్వతిని శివుని కలిపి పురాణములు సృష్టించి అర్ధనారీశ్వరుడు కైలాసమునందున్నాడు అన్నారు కొందరు. ఆ అర్ధనారీశ్వరుడు కనిపించడు, కానీ నేను చెప్పు అర్ధనారీశ్వరుడు అడుగడుగున కనిపించుచూనే ఉండును. యోచన చేస్తే నీవే అర్ధనారీశ్వర ఆకారమున ఉన్నావు. నీవే కాక నీ చుట్టూ ఉన్న ప్రతిజీవి అర్ధనారీశ్వర ఆకారము కలిగి ఉన్నది. శరీరము రెండు భాగములను విషయము అన్ని జీవరాసులకు గలదు. ఈ కుడి ఎడమ విధానము వృక్షములలో లేదే అని అనుమానించవలసినది లేదు. వృక్షములలో కూడ ప్రతి ఆకు రెండు భాగములుగా విభజింపబడి కనిపిస్తున్నది. చిన్న ఆకులైన చింతాకు, తుమ్మాకులలో కూడ రెండు భాగముల విభజన కనిపిస్తున్నది. వాటిలో కూడ కుడి ఎడమ తేడాలు గలవు.

ఇక్కడ శరీరమును రెండు భాగములుగా ఎందుకు విభజన చేయవలయును? సగము బలముగా సగము అబలముగా ఎందుకు నిర్ణయించవలయును? అను సంశయము కొందరికి బయలుదేరవచ్చును. దానికి సమాధానము ఏమనగా! జీవుడు కర్మ చేత భూమియందు జన్మించి మరణించుచున్నాడు. కర్మ అనగ పాపము మరియు పుణ్యము. జీవుడు కర్మ అనుభవించుటకు శరీరమును ధరించుచున్నాడు. శరీరమును ధరించుటకు రెండే కారణములు. ఒకటి పాపము, రెండవది పుణ్యము. కావున శరీరము కూడ రెండుగ విభజింపబడి ఉన్నది. శరీరము లేకుండా కర్మలేదు, కర్మ లేకుండా శరీరము లేదు. ఈ రెండింటికి ఉన్నంత సన్నిహిత సంబంధము ప్రపంచములో వేటికిని లేదు. కర్మ రెండు భాగములే కావున శరీరము కూడా రెండు భాగములే. శరీరము రెండు భాగములుగా విభజింపబడుటకు మరియొక కారణము కూడ కలదు. అది ఏమనగా!

కర్మరూపమై నిలిచిన ప్రపంచమును పాలించుటకు పరమాత్మ అంశ కొన్ని రూపముల సమూహమై నిలిచినది. ఆ రూపములు ప్రత్యేకమైన శక్తులు కల్గి ఉన్నవి. ప్రపంచము కర్మరూపము కావున పాపపుణ్యముల రూపములోనున్న కర్మను ధర్మము తప్పక జీవరాసులపై విధించుటకు ఆత్మ అంశయే యమధర్మరాజుగ రూపొందినది. అందువలననే గీతా శాస్త్రమందు **'దండనాధికారులయందు యముడను నేను'** అని అన్నాడు యమధర్మరాజు కాలచక్రమునకే అధినేతగా ఉన్నాడు. యముడే కాలము, కాలమే యముడు. కాలమునందు పాపపుణ్యములు సూక్ష్మాతి సూక్ష్మముగా జీవులపై ప్రసరింపచేయుటకు కాలుని ఆధీనమునందు ప్రత్యేకమైన శక్తులు ఏడు తయారైనవి అవి ఏవనగా 1) సూర్యుడు 2) చంద్రుడు 3) అంగారకుడు 4) బుధుడు 5) గురుడు 6) శుక్రుడు 7) శని. వీరు సృష్ట్యాదియందు నిర్మాణమైనారు. వీరు కర్మచక్రమునకు అధినేతలు. గమనింపవలసిన విషయము కాలుడు (యముడు)ను అనుసరించి కాలచక్రము, ఆదిత్యాది సప్త గ్రహములను అనుసరించి కర్మచక్రము తిరుగుచున్నది. కాలచక్ర ఆధీనమందు కర్మ ఉన్నది. కాలము జరుగుకొద్దీ కర్మ జరుగుచుండును. కాలము, కర్మ దేవుని ఆధీనమునందుండును. వీటిని గురించి తర్వాత తెలియచేయుదును. ఇపుడు తెలియజేయునది ఏమనగా!

సూర్యుడు మొదలుకొని శని వరకు మొత్తము ఏడుగురున్నారు కదా! ఈ ఏడుగురికి ఒక్కొక్క దినము ఒక్కొక్కరికి ప్రపంచ పాలనయందు రాజసింహాసనము అధిష్టించు అధికారమున్నది. కావున మొదట దినము సూర్యుడు ప్రపంచ సింహాసనమును అధిష్టించెను. అందువలన ఆ దినమునకు ఇంగ్లీషులో **'సన్‌డే'** తెలుగులో **'ఆదివారము'** అని పేరు ఉంచబడినది. రెండవ దినము చంద్రుడు ప్రపంచ సింహాసనము

అధిష్టించెను. కావున ఆ దినమునకు తెలుగులో **'సోమవారము'** అని ఇంగ్లీషులో మూన్‌డే అని పేరు పెట్టగా చివరికది మన్‌డే అయినది. మూడవ దినము అంగారకుడు ప్రపంచ సింహాసనము అధిష్టించెను. కావున ఆ దినమునకు **'మంగళవారము'** అని పేరు కల్గెను. అట్లే బుధుడు, తర్వాత గురువు, ఆ తర్వాత శుక్రుడు, అటుపిమ్మట శని వరుసగా ప్రపంచ సింహాసనము అధిష్టించిన దానివలన ఆయా దినములకు వారి పేర్లు పెట్టబడినవి. సృష్ట్యాది మొదటిదైన ఆదివారముతోనే ప్రారంభమైనది. నాటినుండి ఆ ఏడుగ్రహములు క్రమము తప్పక ప్రపంచపాలన చేయుచున్నారు. ఇప్పటికి కూడ ఆ ఏడు దినములనే వారములుగా మనము లెక్కించుకొనుచున్నాము. సప్తగ్రహములు కర్మను బట్టి రెండు భాగములుగా ఉండుట వలన, సప్తగ్రహములు కూడ కొన్ని పాపము పాలించునవిగా, కొన్ని పుణ్యమును పాలించునవిగా చీలిపోయి గురువర్గము, శనివర్గములైనవి. రెండు వర్గములలో నాయకులు గురు, శనులే. కావున గురుపార్టీ, శనిపార్టీ అని వారిపేర్లే ఆ వర్గములకు చెప్పబడినవి. రెండు వర్గములకు క్రమశిక్షణా వీక్షకులు రాహు, కేతు గ్రహములు.

ప్రతి పని సక్రమముగ జరుగవలెనంటే ఆ పనికి ఆ పనిచేయువానికి ఒక పర్యవేక్షకుడు కావలెను. పాపపుణ్య పాలకులైన రెండు వర్గముల వారికి పర్యవేక్షక అధికారులు రాహువు కేతువులు. మొదటలేని రాహువు కేతువులు తర్వాత గ్రహముల గుంపులో చేరి వారికి వ్యతిరిక్తదిశలో తిరుగుచు అందరిని కలియుచున్నారు. తనిఖీ అధికారులవలె వచ్చి చేరి వారు కూడ పని చేయుచూ సప్తగ్రహములకు ఎదురుగ వచ్చుచున్నారు. రాహువు కేతువు సమానదూరములో ఉండి, సమానవేగము కల్గియుండి అపుడపుడు ఏడు గ్రహములను కలియుచు తాము మాత్రము ఎప్పటికీ

కలియకున్నారు. అన్ని విషయములలోను వీరికి ప్రత్యేకత కలదు. కావున వీరికి కూడ ప్రతిదినము అధికారమున్నది. ప్రతి దినము రాహుకాలము అను పేరుతో 1.1/2 గంట కాలము కేటాయించబడినది. ఏడు దినములకు రాహుకాలము 1.1/2 గంట ప్రకారము 10.1/2 గంటలగుచున్నది. అలాగే ఏడు గ్రహములకు ప్రతిదినము సప్త గ్రహములలో ఒక్కొక్కరికి 10.1/2 గంట వారమునకు వచ్చుచుండగా, రాహువు కేతులవుకు కలిసి వారమునకు 10.1/2 గంట వచ్చుచున్నది. సప్త గ్రహములు ఖగోళములో కుడి నుండి ఎడమకు తిరుగగా రాహువు కేతువులు మాత్రము ఎడమనుండి కుడివైపుకు తిరుగుచున్నారు.

ముఖ్యముగా సప్తగ్రహాల స్థితులు ఎట్లున్నవనగా! గ్రహములు మొత్తము ఏడు ఉన్నపుడు, అనగా సృష్ఠి మొదటిలో గ్రహములు రెండు భాగములుగా విభజింపబడినవి కదా! ఎందుకనగా గ్రహములను ప్రపంచములో పాపపుణ్యములను పాలించుటకు కదా! నిర్మించినది. కాబట్టి పాపమును పాలించువారు కొందరు, పుణ్యమును పాలించువారు కొందరుగా రూపొందిరి. 1) సూర్యుడు 2) చంద్రుడు 3) అంగారకుడు 4) గురుడు ఒక సమూహముగా, 1) బుధుడు 2) శుక్రుడు 3) శని ఒక సమూహముగా నిలిచిరి. ఈ విధముగా సప్తగ్రహములు రెండు భాగములాయెను. రెండు తెగలుగా (పార్టీలుగా) తయారైన వీరు ఒక పక్షమునకు మరొక పక్షమువారు బద్ధ విరోధులుగా నిల్చిరి. పాపము పుణ్యమునకు ఎంత దూరమో అట్లే వీరి అన్యోన్యత అంతదూరము. అంటే పార్టీని బట్టి పరమశత్రువులు వీరు ప్రపంచములోని జీవరాసుల మీదనే కదా అధికారము చలాయించ వలసినది. కాబట్టి జీవుల శరీరములు కూడ వీరికోసమై రెండు భాగములుగా తయారైనాయి. అవియే కుడి, ఎడమ. ముఖ్యముగా గమనించండి మనలో

ఉన్న శ్వాస కూడ కొద్దిసేపు ఎడమ వైపు, కొద్దిసేపు కుడివైపు ముక్కు రంధ్రములలో ఆడుచుండును. అలాగ ఆడుటకు కారణము సప్తగ్రహములు రెండు భాగములైన దానివలననేనని గుర్తుంచుకోవలెను.

రెండు వర్గములలో చివరిగానున్న గురువు, శని ఇరువురే తమతమ పార్టీలలో ముఖ్యులు. కావున గురుపార్టీ, శనిపార్టీ అని చెప్పబడుచున్నది. గురుపార్టీలో సూర్య, చంద్ర, కుజులు ముగ్గురు, శనిపార్టీలో బుధ, శుక్రులు ఇద్దరూ ఉండడము వలన గురువు పార్టీలో ఒకరు ఎక్కువ అయినారు. కావున అటువంటి ఆధిక్యత లేకుండా రెండు పార్టీలు సమానముగా ఉండుటకు, పరమాత్మ ప్రేరేపితుడైన యముడు (కాలుడు) చంద్రుని నిర్ణీత కాలమునందు గురువు పార్టీయందును, దానికి సమానమైన కాలమునందు శనిపార్టీయందును ఉండునట్లు నియమించెను. అందువలన చంద్రుడు కాలానుగుణముగా కొంత కాలము ఒక పక్షము, మరికొంత కాలము వేరొక పక్షము వారియందును చేరుచుండును. దీనినిబట్టి మనలో ఆడు శ్వాస కూడ కొంతకాలము కుడి, కొంతకాలము ఎడమగా ప్రతిరోజు ఆడుచున్నది. చంద్రుడు గురుపక్షమున ఉండిన దినములలో అభివృద్ధి అగుచు, పున్నమిగా ఏర్పడుచున్నది. వ్యతిరేక పక్షమైన శని పక్షములో చంద్రుడు దినదినము సన్నగిల్లుచుపోయి, ఆఖరుకు అమావాస్యగా ఏర్పడుచున్నది. ఇది అందరికీ ప్రత్యక్షముగా కనిపించుచున్నది. ఇది అంతయు గమనించిన ఎడల శరీర నిర్మాణమునందే తెలియుచున్నది. శరీరము ఎందుకు రెండు భాగములుగా తయారైనదంటే? పాపము, పుణ్యము అను రెండిటికే శరీరము అవసరము, కావున శరీరము రెండు భాగములుగానే తయారైనది. సప్తగ్రహములు పాపపుణ్యములను అనుసరించి రెండు పక్షములుగానే తయారైనవి. కాబట్టి శరీరము కూడా రెండు

పక్షములుగానే తయారైనది. దీనివలననే ఈ శరీరమునకు అర్ధనారీశ్వరుడు అన్న పేరు వచ్చినది. లోపల సూర్యచంద్రనాడి విభజనగా, బయటి కుడి ఎడమ విభజనగా రూపొందిన శరీర అవయవముల గురించి తెలుసుకొనినట్లయితే పరమాత్మ ఎటువంటివాడో తెలుసుకొనుటకు కొంతమార్గము ఏర్పడును. **భగవద్గీతయందు శరీరము క్షేత్రము, నేను క్షేత్రవేత్తను అని పరమాత్మ అన్నాడు.** శరీరము అనెడి క్షేత్రమును తెలుసుకొననిదే క్షేత్రవేత్తను తెలుసుకొనుటకు వీలుండదు. కావున బ్రహ్మవిద్య యందు శరీరమును తెలుసుకొనుట ముఖ్యాంశము.

కుడి ఎడమ రెండుభాగములు కలిసి ఏర్పడిన శరీరములోనే కదా మానవుడు భక్తి, ధ్యాన, యోగములాచరించి ఆత్మను తెలుసుకోవలసినది. కావున యోగమాచరించు ప్రతివారును గురు, శని పక్షములను తప్పక తెలుసుకొని యోగమాచరించవలయును. అట్లు కాని ఎడల వారి యోగము నిష్ప్రయోజనము. గురు పక్షదినములలో కుడిప్రక్క శరీరము బ్రహ్మశక్తిని గ్రహించునదియై ఉండును. శని పక్ష దినములలో ఎడమ ప్రక్క శరీరము బ్రహ్మశక్తిని గ్రహించునదియై ఉండును. దీనిని ఏనాడో మన పెద్దలూ మహర్షులూ గ్రహించి దానిప్రకారమే వారు యోగమాచరించుటకు యోగదండమును ఉపయోగించుచుండిరి. కాలక్రమేణ విపరీత భక్తులు ఉద్భవించి ఒక విషయమును కూడ తెలుసుకోలేకపోయినను పెద్దలు తెలిపి ఆచరించిన వాటినే వ్యర్థము అన్నారు. కానీ వ్యర్థమన్నవారి మాటలూ, వారు ఆచరించు పద్ధతులూ వ్యర్థమనీ నిజముగా వారికి తెలియదు. పవిత్రమైన మహర్షులు నడిచి చూపించిన మార్గములనే సరికాదంటున్నారు. సూత్రములు తెలియని ఈ కాలము భక్తులు యోగదండముతో పని ఏమున్నదని అనుచున్నారు.

యోగము అనగా ఆత్మతో కలియడము అని అర్థము కదా! యోగదండము అనగా ఇది ఏదో ఆత్మసంబంధమునకై వినియోగించున దని సులభముగా తెలియుచున్నదే, అటువంటి యోగదండమును ఈ కాలమున చాలామంది దానిని సులభముగా తీసివేయుచున్నారు. ఆ కాలమున విశ్వామిత్ర, వశిష్ఠాది మునులు మనకంటే తెలివితక్కువవారా! లేక విధానములు తెలియనివారా! ఎంతో గొప్ప యోగవిద్యా సంపన్నులై యోగదండమును ఉపయోగించి యోగమును సాధించియుంటే, వారికంటే తక్కువ వారమైన మనము యోగదండమును లేకనే యోగము సాధించ గలమా! యోగదండము లేక యోగము సాధించగలము అన్నది కలలోని మాట. అందుకే ఈనాడు పెద్ద స్వాములు అని పేరుగాంచినవారు కూడ భగవంతుడు గీతాశాస్త్రమున అక్షరపరబ్రహ్మ యోగమున చెప్పినట్లు అంత్యకాలములో రాత్రిపూటనో, దక్షిణాయనమునో, కృష్ణపక్షముయందునో మరణించుచున్నారు. దానితో వారికి తిరిగి జన్మ కలదని ప్రత్యక్షముగా తెలియుచున్నది. దేశములో భక్తులనిపించుకొన్న వారు కూడా పగలు కాక శుక్లపక్షముకాక, ఉత్తరాయణమునకాక ఉన్న సమయమున మరణించు చున్నారంటే, వారు ఇంకా తెలుసుకోవలసినది చాలా ఉన్నది. ఆచరించ వలసినది చాలా ఉన్నదని తెలియుచున్నది. గీతాశాస్త్రమందు అక్షర పరబ్రహ్మయోగము 28 శ్లోకములో **"శుక్ల, కృష్ణ పక్షములను తెలిసినవాడు వేదముల వలన, యజ్ఞముల వలన, తపస్సుల వలన, దానముల వలన లభించెడు పుణ్యఫలములను, అతిక్రమించువాడు"** అని భగవంతుడు తెలిపి ఉన్నాడు. గీతాశాస్త్రమును బోధించు బోధకులకే పక్షము అంటే ఏమిటో తెలియకపోతే, శుక్ల కృష్ణ పక్షముల గురించి ఏమి తెలియును? గీతా శాస్త్రములో భగవంతుడు విషయము విపులముగా తెలిపియుంటే, ఈ

కాలములో కథలను ఉపమానములుగా చెప్పుచూ, భగవంతుని భావములను విడిచి వేరే భావములో పడుచున్నారు. దినములో పగలు రాత్రి, నెలలో కృష్ణ శుక్లపక్షములు, సంవత్సరములో ఉత్తర దక్షిణాయనములు ఎందుకున్నా యని ఎప్పుడైతే విశధీకరించి గురువువలన తెలుసుకుంటాడో వాడే ధన్యుడు, వాడే సర్వజ్ఞుడు. పరమాత్మ ప్రపంచమంతటా నిండి ఉన్నాడని తెలుసు అంటున్నారు. కానీ ఎవరో చెప్పుచుంటే వీరు అనుచున్నారు. నిజముగా ఎట్లు నిండి ఉన్నాడన్నది విశధీకరించుకోలేదు. శుక్ల, కృష్ణపక్షములు మనకు కనబడుచున్నవి కదా అని అనుకొనుచున్నారు. కానీ ఎందుకు? ఎట్లు? జరుగుచున్నవని విశధీకరించుకోలేదు. గుడిలో దేవుడు సూక్ష్మము నుండి మాట్లాడుట చూస్తున్నారు. దయ్యములు ఆవహించి మాట్లాడుట కూడ చూస్తున్నారు. కానీ ఎందుకు ఇట్లు జరుగుచున్నది? దీని నిజస్థితి ఏమిటి? అను విషయము మీద ఏమాత్రము మానవులకు ఆసక్తి లేదు. ఉన్నదంతా స్వార్థము. మొదటి నుండి ఈ భూమియే ఉన్నది. దీని మీదనే ఎంతో తాపత్రయపడి ఏమి తీసుకుపోయిన వారులేరని అందరికి తెలుసు, కానీ తమ నిజస్థితులను తెలుసుకోక ఒకప్పుడు వదలిపోవు వాటికై మానవుడు కాలమును వినియోగించుకొనుచున్నాడు.

సప్తగ్రహములు నవగ్రహములుకాక ముందే ఉండిన విధాన మేమనగా! సప్తగ్రహములకు సప్తదినములు నిర్ధేశింపబడినవి కదా! గ్రహములు రెండు భాగములుగా విభజింపబడినవి కదా! వాటిననుసరించి దినములు కూడ రెండు పక్షములుగా (భాగములుగా) విభజింపబడినవి. ఆదివారము, సోమవారము, మంగళవారము, గురువారములను ఒకటిగా, బుధవారము, శుక్రవారము, శనివారములను ఒకటిగా నిర్ణయించారు. రెండు భాగములుగా సమత్వమునందు ఉండుటకు చంద్రుడు 15

దినములు ఒక ప్రక్క, మిగతా 15 దినములు వేరొకప్రక్క మారుచుండును. ఈ విధముగా మారుటనే పక్షము అందురు. ఈ విధముగా చంద్రుడు మారుటవలన రెండు పక్షముల గ్రహములకు సమత్వబలము ఏర్పడుచున్నది. చంద్రుడు గురుపక్షమున చేరినపుడు శుక్లపక్షము అనియు, శనిపక్షమున చేరినపుడు కృష్ణపక్షము అనియు తెలియుచున్నది. శుక్ల పక్షములో ఆది, సోమ, మంగళ, గురువారములు ఒకటిగా, కృష్ణపక్షములో బుధ, శుక్ర, శని, సోమవారములు ఒకటిగా ఉన్నవి. శుక్లపక్ష ఆది, సోమ, మంగళ, గురువారములలో శరీరమునందు కుడిప్రక్క భాగము మాత్రమే బ్రహ్మశక్తిని గ్రహించుకొను బలము కల్గి ఉండును. ఆ దినములలో శరీర ఎడమ భాగము బ్రహ్మశక్తిని ఏమాత్రము గ్రహించుకోలేదు. కృష్ణపక్ష బుధ, శుక్ర, శని, సోమవారములలో ఎడమ ప్రక్క శరీరము మాత్రము బ్రహ్మశక్తిని గ్రహించుకొను సామర్థ్యము కలిగి ఉండును. ఈ దినములలో శరీర కుడి భాగము ఏమాత్రము బ్రహ్మశక్తిని గ్రహించుకోలేదు. కాబట్టి యోగము ఆచరించు వేళలలో ఏ దినము మనము యోగము చేయుచున్నామో, ఆ దినము శరీరములో ఏ భాగమునకు చెందియున్నదో తెలుసుకొని ఆ భాగములోనే మనలో ఆడుచున్న శ్వాసను నడుపుచుండవలయును. శ్వాస ఏ భాగములో ఎక్కువగా నడచిన ఆ భాగములో అధిపతులైన గ్రహములు బ్రహ్మశక్తిని శరీరములోనికి వచ్చునట్లుజేయుదురు. అట్లుకాక వ్యతిరిక్తదిశన శ్వాస ఆడుచుండిన బ్రహ్మశక్తిని గ్రహించు సామర్థ్యము ఆ దిశ కోల్పోవును. ఇందులకు ఉదాహరణగా తెలియజేయు విషయమిది.

ఒక యోగి మంగళవారము యోగము ఆచరించుచున్నాడను కొనుము. మంగళవారము గురుపక్షమున చేరినది. కాబట్టి గురుపక్షము శరీరమున కుడిపార్శ్వమందు అధికారము కలిగియున్నది. కావున ఆ యోగి

శ్వాసను కుడివైపు ముక్కు రంధ్రములోనే ఆడునట్లు చేసుకొనవలయును. శ్వాస కుడి ముక్కురంధ్రములో ఆడునంత వరకు, యోగము చేసినంత సేపు యోగశక్తి కుడిప్రక్క శరీర సూక్ష్మరంధ్రముల ద్వార లోపలికి ప్రవేశించు చుండును. అట్లుకాక శ్వాస ఎడమ ముక్కు రంధ్రమున ఆడుచుండిన యోగి ఎంతసేపు యోగమునందున్నను బ్రహ్మశక్తి అతని యందు ప్రవేశించదు. ద్వారములు మూయబడి ఉండును. అందువలన శక్తి లోపలికి ప్రవేశించ లేదు. శ్వాస ఎడమప్రక్కకు మారిన దానివలన ఎడమప్రక్క శరీరమున సూక్ష్మరంధ్రముల ద్వారములు తెరచుకొని ఉండును. ఆ దినము గురుపక్ష దినమైనది, కాబట్టి బ్రహ్మశక్తి ఎడమ ప్రక్కన ప్రవేశించదు. ఎందుకనగా ఎడమ ప్రక్కయున్న గ్రహముల దినము కాదు. దీనినిబట్టి ఏమి తెలియు చున్నదనగా! శ్వాస ఏ ప్రక్క ఆడుచున్నదో, ఆ వైపు శరీర భాగము మాత్రమే శక్తిని గ్రహించుకొనును. దినములు ఏ పక్షములో ఆ పక్షభాగముననే బ్రహ్మశక్తి ఉండును. అందువలన బ్రహ్మశక్తిని సంపాదించుకొను యోగులు పూర్వము యోగసమయము ఏ పక్షదినముదో ఆ ప్రక్కననే శ్వాస నడుపు చుండెడివారు.

గురు శని పార్టీ దినములు కాలక్రమమున పద్ధతిగ మారు చుండును. కానీ మనలో ఉన్న శ్వాస పద్ధతిగ మారదు. శ్వాస దానికి ఇష్టమొచ్చినట్లు ఏ వైపుకంటే ఆ వైపుకు మారుచుండును. అటువంటి ఒక పద్ధతిలేని శ్వాసను ఒకే ప్రక్క నిలిపి యోగమును సార్థకము చేసుకొనుటకు ఉపయోగించు దండమునే 'యోగదండము' అని అందురు. యోగదండము వినియోగించకున్నను అది ఎట్లుండునో కొందరికి తెలిసి ఉండును.

మనలో ఉన్న శ్వాసను ఒకే ప్రక్క ఎక్కువగా ఆడునట్లు చేయ వలయునంటే, దానికి వ్యతిరిక్త శరీర భాగములో యోగదండమును వినియోగించవలయును. భుజమునకు క్రింద మోచేతికి పైభాగమున యోగదండము యొక్క పంగను ఆనించి దానిక్రిందికొనను భూమిమీద అనునట్లు పెట్టి ఉంచవలయును. అట్లు ఉంచుట వలన ఆ చేతి నరమునకు దండము యొక్క వత్తిడి తగులుట వలన శ్వాస దానికి వ్యతిరిక్త దిశలోనికి మారును. ఉదాహరణకు బుధవారము యోగమును సలుపు వేళ ఎడమప్రక్క శ్వాస ఆడవలయును. కావున కుడిచేతి క్రింద యోగ దండమును ఉంచుకొనవలయును. కుడిప్రక్క దండమును ఉంచుకోవడము వలన శ్వాస దానంతటదే ఎడమ ప్రక్కకు పోవును. కుడి ముక్కురంధ్రములో ఎక్కువగా గాలి వచ్చుచుండిన దానిని సూర్యనాడి అనియు, ఎడమ ముక్కురంధ్రములో ఎక్కువగా గాలి వచ్చుచుండిన దానిని చంద్రనాడి యనియు పెద్దలు చెప్పుచుందురు. సూర్యచంద్ర నాడులు మనకు స్వాధీనమున ఉండి నడుచుటకు యోగదండము తప్పక ఉండవలయును. దీనిని విపులముగా తెలిసిన వశిష్ఠాది మహామునులు సహితము యోగదండమును వదలక తమ వద్దనే అన్ని వేళల ఉంచుకొనుచుండిరి. మరియు వారు జింక చర్మమును ఎక్కడికి పోయినను వదలక తీసుకొని పోయెడివారు. కానీ ఈ కాలమున చర్మాసనము లేకపోతే ఏమి? దేవుడు ఒప్పుకొనడా? అనువారు తయారైనారు. ఆ కాలమున తెలిసిన పెద్దలు కష్టాలను కూడ లెక్కచేయక వారు ఎక్కడికి పోయి యోగమాచరించ వలయునన్న అక్కడికి చర్మమును, యోగదండమును తీసుకుపోయి యోగమాచరించెడివారు. కానీ ఈ కాలమున మనము వాటిని విసర్జించినదే కాక, వాటిని ఉపయోగించిన వారిని మరియు ఉపయోగించుచున్న వారిని హేళన చేయుచున్నాము.

చంద్రుడు రెండు ప్రక్కల మారుచుండును. కావున ఈ విషయమును బాగుగా అర్థము చేసుకొనవలయును. యోగము సలుపు యోగులు అందరూ ఈ విధానము అనుసరించిన ఎడల యోగశక్తి తప్పక మిమ్ములను చేరును. అట్లుకాని ఎడల శక్తిని నష్టపోయిన వారగుదురు. (యోగములు మొత్తము మూడు రకములనీ, వాటిలో కేవలము ఒక బ్రహ్మయోగములో మాత్రము యోగదండమును ఉపయోగించవలెననీ మిగతా రెండు యోగములకు దానితో పనిలేదని గుర్తుంచుకోవలెను).

**1) ఆదివారము సూర్యుని దినము :** సూర్యుడు గురుపార్టీకి చెందిన వాడు. గురుపార్టీ శరీరమున కుడిప్రక్క అధికారము కల్గి ఉన్నది. కావున ఆ దినమున బ్రహ్మశక్తి కుడిప్రక్కనే వచ్చుటకు అవకాశము కలిగి ఉండును. శక్తి శరీరములోనికి ప్రవేశించుటకు కుడిప్రక్క సూక్ష్మరంధ్రముల ద్వారములు తెరుచుకొని ఉండవలయును. సూక్ష్మరంధ్రముల కవాటములు తెరుచుకొనుటకు శ్వాస కుడిప్రక్కనే ఆడవలెను. అనగా సూర్యనాడియందు ఆడవలయును. అందువలన యోగదండము ఎడమచేతి క్రింద ఉంచుకోవలయును.

**2) సోమవారము చంద్రునిదినము :** శుక్లపక్ష సోమవారము గురుపార్టీయందు ఉండును. కాబట్టి శ్వాస కుడి ముక్కు రంధ్రములో (సూర్యనాడిలో) ఆడవలయును. కృష్ణపక్ష సోమవారము శనిపార్టీలో చేరి ఉండును. కాబట్టి శ్వాస ఎడమ ముక్కురంధ్రములో (చంద్రనాడిలో) ఆడవలయును. శుక్లపక్షములో వచ్చు సోమవారమున యోగదండమును ఎడమ ప్రక్కన ఉంచుకోవలయును. కృష్ణపక్షములో వచ్చు సోమవారము యోగదండమును కుడిప్రక్క ఉంచుకోవలయును.

**3) మంగళవారము అంగారకుని దినము :** కాబట్టి గురుపక్షమున కలదు. అందువలన శ్వాస కుడిప్రక్క (సూర్యనాడిలో) ఆడవలయును. యోగదండమును ఎడమప్రక్క ఉంచుకొనవలయును.

**4) బుధవారము బుధుని దినము :** కాబట్టి శనిపక్షమున కలదు. అందువలన శ్వాస ఎడమప్రక్క (చంద్రనాడిలో) ఆడవలయును. యోగ దండమును కుడిచేతి క్రింద ఉంచుకొనవలయును.

**5) గురువారము గురువు దినము :** కాబట్టి గురుపక్షమున చేరి ఉన్నది. శ్వాస కుడిప్రక్క (సూర్యనాడిలో) ఆడవలయును. యోగ దండమును ఎడమచేతి క్రింద ఉంచుకొనవలయును.

**6) శుక్రవారము శుక్రుని దినము :** కాబట్టి శని పార్టీలో చేరి ఉన్నది. శ్వాస ఎడమప్రక్క (చంద్రనాడిలో) ఆడవలయును. యోగదండము కుడిప్రక్క ఉంచుకొనవలయును.

**7) శనివారము శని దినము :** కాబట్టి శనిపార్టీలో చేరి ఉన్నది. శ్వాస ఎడమప్రక్క (చంద్రనాడిలో) ఆడవలెను. యోగదండమును కుడిప్రక్క ఉంచుకొనవలెను.

**విజ్ఞప్తి :** యోగసాధన చేయువారికి ఒక ముఖ్య గమనిక. శ్వాస కుడి ఎడమ రెండు ప్రక్కల ఆడుచుండునన్నాము కదా! గురుపక్ష దినములలో యోగము చేయువేళ కుడిప్రక్కన, శనిపక్ష దినములలో యోగము చేయువేళ ఎడమప్రక్క శ్వాస ఆడించుకొనవలయును. అందుకొరకు యోగదండమును వ్యతిరిక్త దిశలో ఉపయోగించవలయునని తెలిపి ఉన్నాము. కానీ ఆ విధముగ యోగసాధన చేయువారిలో అరుదుగ కొందరికి మాత్రమే శ్వాస మేము చెప్పిన విధముగా మారదు. అట్లు మారని ఎడల మాకు శ్వాస

యోగదండమును వినియోగించినా మారలేదే? అని ఎవరు కూడా చింతించవలసిన పనిలేదు. మేము ఏ విధముగా చెప్పి ఉన్నామో ఆ విధముగానే యోగదండమును వినియోగించి సాధన చేయవలయును.

ఈ విషయమును గురించి ఇంకా విపులముగా తెలుపునది ఏమనగా! శరీరములో కుడి భాగములో పెద్దగ సూర్యనాడి కలదు. అట్లే ఎడమ భాగమున పెద్దగ చంద్రనాడి కలదు. మన శరీరములో అంతఃకరణములలో రెండవది మరియు ముఖ్యమైనది అయిన మనస్సు మెలుకువలో ఈ సూర్యచంద్రనాడుల మీదనే ఉండును. ఒక దినమునందు సూర్యనాడి మీద కొంతకాలము, చంద్రనాడి మీద కొంతకాలము మనస్సు నివాసము చేయుచుండును. మనస్సు కుడి ప్రక్క సూర్యనాడి మీద ఉన్నపుడు శ్వాస కుడి ముక్కురంధ్రములోను, ఎడమ ప్రక్క చంద్రనాడి మీద ఉన్నపుడు శ్వాస ఎడమప్రక్క ముక్కురంధ్రములోను ఎక్కువగా వచ్చుచుండును. ఆ రోజు లోపల ఉన్న మనస్సు ఏ వైపునకు పోయిన ఆ వైపునందు శ్వాస ఆడుచుండును. మనస్సును ఒకే నాడి మీద ఉంచు నిమిత్తము యోగ దండమును ఉపయోగించ వలయునని తెలిపియున్నాము. యోగదండము వినియోగించిన దిశలో మనస్సు ఉండక దానికి వ్యతిరిక్త దిశలో ఉండును. కావున శ్వాస కూడ యోగదండము వినియోగించిన వైపుకాక దానికి వ్యతిరిక్త దిశలో ఆడుచుండును. కానీ నూటికి ఒకటి రెండు శాతము కొందరికి సాధన చేయువేళ యోగదండము వినియోగించిన శ్వాస మారక యోగదండము వినియోగించిన వైపే ఉండును. కానీ లోపల మనస్సు అట్లు ఉండక వ్యతిరిక్త దిశకు మారియుండును. యోగమునకు మనస్సు ముఖ్యము కానీ శ్వాస ముఖ్యము కాదు. అందువలన మారని శ్వాస కొరకు ఎవరు కూడా చింతచేయకూడదు.

యోగదండమును వినియోగించిన వెంటనే పైన శ్వాస మారకుండినా లోపల మనస్సు మారిఉండును. కావున యోగశక్తి కూడ మనస్సు ఉన్నవైపు శరీరములో ప్రవేశించుచూనే ఉండును. యోగ దండము వినియోగించిన శ్వాస మారనివారు కూడ యోగశక్తిని నష్టపోకుండ దానిని పొందుచుందురనియే తెలుపుచున్నాము. ముఖ్యముగ లోపల మనస్సు కుడిఎడమలుగా మారు నిమిత్తము యోగదండమును వినియోగించు చున్నామని ప్రతి ఒక్కరు తెలుసుకోవలయును. అందువలన మేము తెలియజేసినట్లు యోగదండమును వినియోగించి యోగము చేయవలెను. పూర్వము మనస్సు గురు శనిపక్షములలో సూర్యచంద్రనాడుల మీద మార్చుకొనుటకై శంకరుడు యోగదండమును వినియోగించినాడని, విష్ణువు తన తలక్రింద కుడి ఎడమ చేతులను ఉంచుకొని పవళించి యోగము చేసినారనుట కూడ మరువకూడదు. విష్ణువు, శంకరుడు ఆచరించి ఉండగా, మనము ఆచరించకపోతే గొప్ప లోపము. అందువలన అందరూ గ్రంథములో చెప్పినట్లు బ్రహ్మయోగము చేయు సమయములో యోగ దండమును ఉపయోగించుకోవలెను.

*****

# చర్మాసనముల ఆవశ్యకత

పూర్వము మహర్షులు సహితము యోగదండము జింక, చర్మము చేత ధరించి తిరిగినారని అందరికి తెలుసు. యోగదండము లేనిది యోగమాచరించుట కష్టమని తెలుసుకున్నాము. ఇక మహర్షులు చర్మములు ఎందుకు ఉపయోగించుచుండిరి అను విషయమును తెలుసుకొందాము. యోగము ఆచరించువేళ బ్రహ్మశక్తి లేక యోగశక్తి శరీరమునందు

ప్రవేశించుచుండును. ఈ విధముగా ప్రవేశించు శక్తి శరీరమున బ్రహ్మనాడిని చేరి సప్తస్థానమైన సహస్రారచక్రమున గుంపుగా కూడుకొనుచుండును. సహస్రారమున గుంపుగా చేరిన శక్తినే విష్ణు, ఈశ్వర పటములయందు వారి తల వెనుకభాగమున వెలుగురూపమున చిత్రీకరించడము జరుగు చున్నది. తల వెనుకభాగమున వెలుగు చిత్రీకరించిన ఎడల అది వారి యొక్క జ్ఞానశక్తి అని తెలియవచ్చును. ఈ ప్రకాశశక్తిని దేవతలు పద్ధతి ప్రకారము యోగమును ఆచరించి సంపాదించుకొన్నారు. పద్ధతియనగా యోగదండము ఉపయోగించి, చర్మము ఉపయోగించి చేయడము. చర్మము ఉపయోగించు రహస్యమేమనగా? వివరింతును వినుము.

యోగి బ్రహ్మయోగము ఆచరించువేళ జ్ఞానశక్తి అతనియందు ప్రవేశించుచుండును. శరీరమున ప్రవేశించిన శక్తి బ్రహ్మనాడిని చేరి, ఊర్ధ్వముగా ప్రయాణించి, తలయందుకల ఏడవచక్రమున చేరుచుండును. అట్లు చేరువేళ క్రింద భూమ్యాకర్షణశక్తి వలన కొంత యోగశక్తి బ్రహ్మనాడి ద్వారా క్రిందికి ఆకర్షింపబడి గుదస్థానమునందుకల ఆధార కమలమను నాడీకేంద్రము నుండి భూమిని చేరుచుండును. కానీ యోగి యోగము చేయునపుడు శక్తినంతయు భూమి ఆకర్షించుకొనదు. కేవలము సగము మాత్రము నష్టపోవుట జరుగుచున్నది. అర్థభాగము మాత్రము భూమి యందు ప్రవేశించిన ఆ శక్తి తిరిగి శూన్యమున మిళితమగుచుండును. భూమికి ఇటువంటి శక్తి ఉన్నదని మన పెద్దలు ఏనాడో తెలుసుకొని, వారు బ్రహ్మయోగము చేయు సమయమున చర్మ ఆసనములను ఉపయోగించుచుండిరి. చర్మమును భూమిమీద పరచి దానిమీద యోగి కూర్చున్న, యోగి శరీరమునందు ప్రవేశించు శక్తిని భూమి లాగుకొనలేదు. గోడను దాటి సూర్యకిరణములు ఏలా పోలేవో అట్లే చర్మమును దాటి శక్తి

పోలేదు. శక్తికి చర్మము నిరోధము. దేశములో చర్మము తప్ప ఏ వస్తువులు శక్తిని నిరోధించలేవు. చాపమీద కూర్చున్న, మంచముమీద కూర్చున్న, ఎక్కడ కూర్చున్న శక్తి తప్పక నష్టమగును. చర్మము మీద కూర్చున్న యోగి యొక్క శక్తి ఏమాత్రము నష్టపడదు.

భూమి పంచభూతములందు ఒకటి కావున దీనికి విచిత్రమైన ఆకర్షణాశక్తి ఉన్నది. పైకెగిరిన వస్తువును మాత్రము భూమి తన వైపు ఆకర్షణవల్ల లాగుకొన్నట్లు యోగి యోగము చేయువేళ అనగా యోగ శక్తి శరీరములో ప్రవేశించు వేళ మాత్రమే శక్తిని తనవైపు లాగుకొనును. భూమి తన మీదనున్న వస్తువును కదల్చలేనట్లు సహస్రారచక్రమున చేరిన శక్తిని ఏమాత్రము ఆకర్షించుకోలేదు. దీనిని బట్టి యోగి యోగము చేయువేళ మాత్రమే శక్తి నష్టపోవుటకు వీలున్నది. మిగతా సమయములందు నష్టపోవుటకు వీలులేదని తెలియుచున్నది.

యోగి యోగించు సమయమున అర్ధభాగము శక్తియే ఎందుకు నష్టపోవును. నష్టపోవుశక్తి సగముకంటే ఎక్కువో! లేక తక్కువో! ఎట్లు చెప్పనగును? అన్న సంశయము కొందరికి రావచ్చును. దానికి సమాధానము, శక్తి శరీరమునందు ప్రవేశించి బ్రహ్మనాడిని చేరుచుండును కదా!. బ్రహ్మనాడిలో నాభి స్థానమును మొదలుకొని క్రిందిప్రక్క ప్రవేశించు శక్తిని అంతయు భూమి లాగుకొనును, నాభి స్థానము మొదలుకొని పైన ప్రవేశించు శక్తిని భూమి లాగుకొనలేదు. నాభికంటే పైన ప్రవేశించు శక్తిని లాగుకొనుటకు భూమికి ఆకర్షణ బలము తక్కువ వచ్చును. కావున ఆరు చక్రములలో మూడు చక్రముల వరకే భూమ్యాకర్షణశక్తి పారును. కాబట్టి యోగి సగభాగము శక్తిని మాత్రము నష్టపోవుటకు వీలున్నది. ఆసనములో చర్మమును ఉపయోగించినట్లయితే యోగశక్తి చర్మమును

దాటిపోలేదు. భూమ్యాకర్షణ చర్మమును దాటి లాగలేదు. విద్యుశ్చక్తిని రబ్బరు ఎట్లు నిరోధించుచున్నదో అట్లే భూమ్యాకర్షణ శక్తిని నిరోధించు చున్నది.

పూర్వకాలమున యోగులందరు చర్మమునుపయోగించి శక్తిని ఏమాత్రము నష్టపోక గొప్ప శక్తిపరులైనారు. ఈ కాలమున చర్మము యొక్క ప్రత్యేకత తెలియనివారు చర్మములతో అవసరము ఏమున్నది? అని వాదించుచున్నారు. అవసరములేనిదే గీతయందు ఆత్మ సంయమ యోగములో 'యోగి జింక చర్మము మీద కూర్చోవలయునని' భగవంతుడు ఎందుకు చెప్పాడు? ఈ కాలములో యోగదండములు, జింక చర్మములు నాగరికతలేని పాతకాలపు పద్ధతులని అనువారు కూడ ఉన్నారు. పాతకాల పద్ధతులతో పాతకాలము వారు పలికిన పలుకులకు ప్రకృతియే తలక్రిందులు అయ్యేంత పని జరిగేది. కానీ క్రొత్త కాలములో క్రొత్త పద్ధతుల ద్వారా వీరు సాధించినదేదో తెలియకున్నది. శివుడు చర్మమును ఎల్లప్పుడు తన నడుముకు చుట్టుకొనెడి వాడు. వశిష్ఠుడు, విశ్వామిత్రుడు మొదలగు మహామునులు చర్మమును, యోగదండమును ప్రక్కనే యుంచుకొని ఎంతో భద్రముగా చూచుకొనెడివారు. కానీ ఈ కాలములో అంత పవిత్రమైన వస్తువులు ఏమాత్రము మానవులయందు విలువ లేకుండా పోయినాయంటే మానవుడు దిగజారి పోతున్నాడన్నమాట.

యోగశక్తిని నిరోధించుటకు ఒక జింక చర్మమేనా పనికి వచ్చునది అను ప్రశ్న కొందరికి కలుగవచ్చును. అందులకు సమాధానము ఏమనగా? యోగి శరీరమునకు ఇతరముగా ఉన్న ఏ జీవరాసి శరీర చర్మమైనా శక్తిని నిరోధించు బలము కలిగి ఉండును. ఆ చర్మము సజీవముగానైన ఉండ వచ్చును లేక నిర్జీవముగానైన ఉండవచ్చును. అందువలననే పూర్వము

శివుడు ఒక్కొక్కపుడు ఏనుగు చర్మము ధరించెడివాడు, మరియు పులి చర్మమును కూడ ధరించెడి వాడు, ఇంకనూ జింక చర్మము కూడ ధరించెడి వాడు. దీనిని బట్టి ఏ జీవరాసి చర్మమైన ఒక్కటే అనుమాట తెలియుచున్నది. క్రైస్తవ మతకర్త అయిన ఏసుప్రభువు యొక్క గురువుగారైన యోహాను ఒంటె చర్మము ధరించెడివాడు. శ్రీ మహావిష్ణువు బ్రతికిన పాము మీద ఎడమ చేతి మీదుగా మరియు కుడిచేతి మీదుగా పవళించుచూ సూర్య చంద్రనాడులను మార్చుచు యోగము చేసినట్లు తెలియుచున్నది. పాము మీద పవళించినాడు కావున పాము చర్మము శక్తిని నిరోధించుచున్నది. ఇట్లు పరిశీలించిన సజీవములైనా సరే లేక నిర్జీవములైనా సరే చర్మము తప్పనిసరిగా ఉండవలయునని తెలియుచున్నది. కానీ ఈ కాలమున మనము అహంకార యుక్తులమై అంతయు తెలియుననుచు, ఎవరైన చెప్పినను దానిని కించపరుస్తూ అధోగతిపాలగుచున్నాము. విష్ణు, ఈశ్వర, మహర్షులకంటే మనము పెద్దవారమా! చూపులేని గ్రుడ్డివాడుపోయి గుంతలో పడినట్లు జ్ఞానదృష్టిలేని మానవులు 'మాయ' అను గుంతలో పడి, దానిలో మునిగి తేలి ప్రతిదినము ప్రతివాడు చేయు పనులనే చేయుచూ, ఏమాత్రము పరమాత్మ మార్గమును గుర్తించక ఉన్నారు. తెలియని దానిని తెలిపినవాడు, కనిపించని దానిని చూపించినవాడు, అజ్ఞానములో జ్ఞానమిచ్చినవాడు, చీకటిలో దీపమై వచ్చినవాడు **"గురువు"** అని నమ్మి గురుసేవయందు జీవితమును సార్థకత చేసుకొని, జ్ఞానదృష్టిని సంపాదించుకొని సర్వజ్ఞుడవు కావలయునని కోరుచున్నాను.

*****

# ఆశ్రమములు

ఇపుడు ఆశ్రమముల గురించి తెలుపుచున్నాను. ఇందు తెలుపు విషయములు అందరికి కాక కొంతమంది ఆశ్రమవాసులకు విరుద్ధముగా కనిపించవచ్చును. వారికి నా మీద కూడ ఆగ్రహము రావచ్చును. ఇందు నా తప్పు ఏమున్నది? దీని విషయమై నేను ఏమాత్రము బాధ్యుడను కాను. నాకు ఏమియు తెలియదు. ఈ గ్రంథమంతయు ఆత్మ ప్రేరేపితమున వ్రాయుచున్నాము. కానీ వ్రాయునది నేను ఎంతమాత్రము కాదు. కావున నన్ను దూషించినను, పొగిడినను మరియు దీనివల్ల వచ్చు కీర్తి, అప కీర్తులన్నియు నా తండ్రి అయిన పరమాత్మకు మరియు నా సోదరుడైన ఆత్మకు చేరును.

ఈ కాలములో భూమిమీద కొంతమంది భక్తాగ్రగణ్యులు ఆశ్రమములను సృష్ఠించుకొని ఉన్నారు. అందు కొన్ని ఆశ్రమములు బయటి ప్రపంచములో పేరు ప్రఖ్యాతులు లేకున్నా ఎంతో పవిత్రత కలిగి ఉన్నవి. మరికొన్ని ప్రపంచములో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొన్నప్పటికీ పవిత్రత ఏమాత్రము లేకున్నవి. ఇంకనూ కొన్ని ఆశ్రమములు విగ్రహ ప్రతిష్టలతో నిండుకొని ఇది దేవాలయమా లేక ఆశ్రమమా అను అనుమానము కల్గించుచున్నవి. ఇంకనూ కొన్ని ఆశ్రమములు ఇది గుడియా, బడియా లేక ఆశ్రమమా అను అనుమానము కూడ కల్గించుచున్నవి. ఇవి అన్నియు గ్రహించుతూపోతే ఇంకా కొంత కాలమునకు ఆశ్రమముల స్థితి ఎట్లు మారిపోతుందో అర్థము కాలేదు.

పూర్వకాలములో భక్తులు కొంతమంది భూమిమీద ఆశ్రమములు సృష్ఠించుకొని ఉండిరి. వారు పరమ పవిత్రులుగా ఉండి, తాము నివసించు స్థలము కూడ పవిత్రస్థలము అను పేరు వచ్చునట్లు చేసిరి. అటువంటి

ఆశ్రమములను విశధీకరించి చూచిన అందు వారు యోగసాధనకై వినియోగించబడు వస్తువులైన చర్మాసనములను, యోగ దండములను ఎంతో భద్రముగా పెట్టుకొనెడి వారు. ఈ కాలములో చూస్తే ఆశ్రమములలో అవి ఎక్కడ కనిపించవు. ఒకవేళ కనిపించినప్పటికీ చూపాకారానికి వాటిని ఆశ్రమములలో పెట్టుకొని ఉందురేకానీ ఏమాత్రము ఉపయోగించరు. పూర్వకాలము ఆశ్రమములలో దేవతా ప్రతిష్టలు కానీ, దేవతా పటములు గానీ ఎక్కడ కనిపించెడివి కావు. ఈ కాలములో దేవతా ప్రతిమలను ఆశ్రమములలో ప్రతిష్టించినారు మరియు దేవతా పటములు అనేకము ఆశ్రమములలో ఉంచారు. పూర్వకాలము బ్రహ్మవిద్యను నేర్చి, దాని ద్వారా సాధనచేసి, బ్రహ్మను తెలుసుకున్న వారుయుంటే, ఈ కాలములో ప్రాపంచిక విద్య అయిన సంస్కృతమును బాగా నేర్చి, పదములకు అర్థములు చెప్పుట తెలుసుకున్నారు. బ్రహ్మవిద్యను తెలుసుకోలేకున్న సంస్కృతము తెలుసుకుంటే చాలు ఆశ్రమములలో స్వాములైపోతున్నారు.

ఆశ్రమములు ఏ విధముగా ఉండవలయునంటే ఆశ్రమములందు బ్రహ్మవిద్యను అభ్యసించువారు కాని, అభ్యసించిన యోగులు కాని ఉండవలయును. యోగదండము, చర్మాసనము యోగమునకు అవసరమైన వస్తువులు కాబట్టి అవి తప్పక ఉండవలయును. దేవతలను కొలుచువారు కాని, దేవతలను గురించి బోధించువారు కాని ఉండకూడదు. పరమాత్మను తలంచుచుండువారు కానీ, పరమాత్మ విద్యను తెలుసుకొని బోధించుచుండు వారు కాని ఆశ్రమములయందు ఉండవలయును. దేవతా ప్రతిమలను కానీ, దేవతాపటములను కానీ ఆశ్రమములయందు ఏమాత్రము ఉంచకూడదు. నిరాకారుడే సాకారునిగా ఉన్న శ్రీగురుదేవుని చిత్రమును ఉంచవచ్చును. గురువు ఆకారచిత్రము తప్ప ఇతర ఏ దేవతా చిత్రములు

ఆశ్రమములయందు ఉండుటకు అనర్హులు. గీతాశాస్త్రమున విజ్ఞాన యోగమందు **"ప్రకృతి సంబంధములగు పాపముల చేత కోర్కెలుగలవారై అజ్ఞానులగుచూ అన్యదేవతారాధన చేయుచున్నారు. దానివలన కామ్యార్థసిద్ధి లభించునుకానీ మోక్షసిద్ధి ఏమాత్రము లభించదు. అల్పబుద్ధులైన వారు పొందు ఫలితము కూడ అంతంతయే ఉండును. దేవతా భక్తులెల్లరూ దేవతలను చెందుదురు. నా భక్తులు నన్ను చేరగలరు."** అని పరమాత్మ తెలిపి ఉన్నాడు. కావున దేవతలను పూజించిన మోక్షము ఏనాటికీ లభించదు. పరమాత్మను ఆరాధించిన వారికే మోక్షము ప్రాప్తించును. ఆశ్రమమున మోక్షకాములు ఉండవలయును కానీ కార్యకాములు ఉండకూడదు. ఆశ్రమములు నిశ్చల పరబ్రహ్మ నిలయములన్నట్లు ఉండవలయును. కానీ దేవాలయములు ఉన్నట్లు ఉండకూడదు. ఆశ్రమములయందుండువారు ఇతరులకు దేవదేవుడైన పరమాత్మను గురించియే చెప్పవలయును. విష్ణు, ఈశ్వరులు కూడా సూర్య చంద్రనాడులను అనుసరిస్తూ అసలైన పరమాత్మను గురించి ఎల్లవేళలా యోగము చేయుచుండగా, మనము ఆశ్రమములలో దేవతా పూజలు చేయుచుంటే ఏమి బాగుండును. మోక్షము నొసంగుటకు పరమాత్మయే దిక్కని మేము ఎల్లవేళలా కష్టపడి యోగము చేయుచుండగా, మమ్ములను మోక్షమడుగు వారు బుద్ధిహీనులు అని శంకరుడు అన్నాడు. పూర్వకాలము మోక్షమును కోరువారు అందు సరైన ఆచరణ కల్గియుండి ఆఖరుకు మోక్షమును పొందిరి, అది సరైన పద్ధతి. అట్లుకాక ఈ కాలములో ఆశ్రమములను సృష్టించుకొని, దేవతా ప్రతిమలను అందు ప్రతిష్టించుకొని, అనుదినము పూజలు చేయుచూ, మోక్షము కావలయునన్న అడుక్కుతిను వారి వద్దకు పోయి అడుక్కున్నట్లు ఉంటుంది. దేవతలే మోక్షము కొరకు

ప్రాకులాడుచుండగా నీకెక్కడి నుండి ఇవ్వగలరు. అజ్ఞాన ప్రజలు దేవతలను పూజింపవచ్చును కానీ, ఆశ్రమవాసులు కూడా దేవతలనే పూజించుచూ యుంటే అజ్ఞానులకు ఆశ్రమవాసులకు ఏమి తేడా ఉంటుంది? కావున ఆశ్రమవాసులు దేవతలను పూజించక, దేవతలయందు కూడా చైతన్యమైన ఆత్మనూ దానికి ఆధారమైన పరమాత్మనే నమ్మవలయును. దేవతల భక్తిలో కాక, ఆధ్యాత్మిక విద్యలో ప్రావీణ్యత కల్గి ఉండవలయును.

జీవుడు మాయ అను సముద్రములో, విషయములు అను మొసళ్ల చేత, భార్యాబిడ్డలను సొరచేపలచేత, ఆస్తి పాస్తులు అను అలలచేత బాధపడుచూ, సముద్రమును ఈదలేక మునిగిపోవు సమయమున, నన్ను ఎవ్వరూ ఈ మాయ సముద్రమునుండి రక్షించువారు లేరే అని దుఃఖించు సమయమున ఓడవలె కనిపించి, వానిని మాయ సముద్రము నుండి కాపాడి ఆశ్రయమిచ్చునది ఆశ్రమము.

అజ్ఞానమనెడి చీకటిలో దారి తెలియక అవస్థలుపడుచూ, కాలమనెడి సర్పము చేత చిక్కి నిమిష నిమిషమున దాని బాధనోర్వలేక తల్లడిల్లు వానికి ఆశ్రయమిచ్చునది ఆశ్రమము, అజ్ఞానాంధకారమును పటాపంచలు చేసి కాలసర్పము నుండి విడిపించువారు ఆశ్రమవాసులు.

శరీర రోగములను బాగుచేయుటకు వైద్యశాలలు, ఆ వైద్యశాల లందు డాక్టర్లు ఉన్నట్లు, పాపపుణ్యములను భవరోగములను బాగుచేయు నిమిత్తము ఆశ్రమములు, ఆ ఆశ్రమములందు ఆశ్రమవాసులు ఉందురు. ప్రాపంచిక విద్య నేర్పించుటకై పాఠశాలలు, అందు ఉపాధ్యాయులు ఉన్నట్లు, పరమాత్మ (బ్రహ్మ) విద్యను నేర్పించు నిమిత్తము నెలకొల్పబడినవై ఆశ్రమములు ఉండవలయును. మరియు ఆశ్రమవాసులు బ్రహ్మవిద్యను సరిగా నేర్పించువారై ఉండవలయును.

బ్రహ్మవిద్యకు ప్రాణవాయువు ఆశ్రమములు, ఆశ్రమవాసులే కావున ఇంతగా తెలుపడమైనది. దీనిని గురించి ఎవరు తప్పుగా భావించకూడదని కోరుచున్నాను.

*****

# గురుబోధ యొక్క ఆవశ్యకత

గురు అనుపదమే అపారమైనది, మరియు అనంతశక్తిమయమైనది. గురుపదము ప్రపంచములో ఏ మానవుని మీద వాలినదో ఆయనే సాకార గురువు. గురువు తన రూపమునే బోధించును. తననే అనుసరించమనును, తనలోనికే చేర్చుకొనును. గురువును గురించి తెలుపుటకు సాధ్యముకాదు. ఆయన ఊహకే అందనివాడు. అటువంటి గురువుయొక్క సాకారము నుండి ఏనాడైతే జీవుడు శక్తిని పొందగలుగుతాడో ఆ సమయమునుండియే నిరాకారము నుండి శక్తి తనలోనికి ప్రవహించుటకు మొదలుపెట్టును. అట్లు సాకారమునుండి బోధ (ఉపదేశము) లేక బాప్తిస్మము లేనిదే నిరాకారమునుండి శక్తి జీవునిలోనికి రాదు. ఎందుకనగా సాకారమే నిరాకారము, నిరాకారమే సాకారము. జీవుడు సాకారములో ఉన్నాడు కాబట్టి నిరాకారుడైన సాకార గురువును ఆశ్రయించవలసినదే. గురువును ఆశ్రయించి నాల్గురకముల సేవలు చేయుచు గురువుల వద్ద వినయము కలవాడై మెలంగుచుండిన ఎప్పుడో ఒకప్పుడు గురువుకు శిష్యుని మీద శ్రద్ధ కలిగి తన జ్ఞానదృష్టిని ప్రసరింపజేయును. దానితో శిష్యుని హృదయమున జ్ఞానబీజము ఏర్పడి, అది పెరిగి మోక్షము అను ఫలమును ఇచ్చును.

సంపూర్ణమైన విశ్వాసముంచి శిష్యుడు గురువును సేవించు చుండిన, సర్వము ఎరింగిన గురువు శిష్యుని నమ్మికను గుర్తించి, వీనికి ఉపదేశము ఇచ్చిన దానిని సరైన పద్ధతిలో సాధించగలడా లేడా? అని తెలుసుకొని వాడు అర్హత కలిగినవాడైతే వెంటనే ఉపదేశమిచ్చును ఆ ఉపదేశ సమయమున కంటిచూపుకు కనపడకుండా ఏమి జరుగుచున్నదనగా! గురువు సంపూర్ణ శక్తి కేంద్రము. ఉపదేశ సమయమున గురువు నుండి జ్ఞానశక్తి బయలుదేరి శిష్యునియందు ప్రవేశించును. అంతవరకు అతని యందు ప్రవేశించని బయటి శక్తి గురూపదేశముతో వెంటనే లోపలికి ప్రవేశించును. అపుడు మొదలుకొని శిష్యుడు యోగము ఆచరించు వేళలయందు అతనియందు శక్తి ప్రవేశించుచూనే ఉండును. శిష్యుడు యోగము ఆచరించుకొలది అతనియందు యోగశక్తి వృద్ధి చెందును. అట్లుకాక గురువును ఆశ్రయించక, శాస్త్రముల వలన విషయములు తెలుసుకొని, అన్నీ తెలిసినవి ఇక గురువేల అనుచూ, తెలియని వారికే నేను తెలుపుదుననుచు ఎవడైతే గురూపదేశము లేకుండా యోగము చేయునో, వానియందు యోగశక్తి అణుమాత్రము కూడా ప్రవేశింపదు. యోగశక్తిని మొదట తనయందు ప్రవేశింప చేయుటకు మొదట తప్పనిసరిగా గురువు అవసరము. నిప్పులేని పొయ్యిలో ఎంత ఊదినను కట్టెలు చిన్నవి కానీ లేక పెద్దవికానీ అంటుకొని మండవు. మొదట ఇతరుల దగ్గరనుంచి నిప్పును సంపాదించి తన పొయ్యిలో వేసుకొని, ఆ నిప్పునే ఊదుచుండిన అది పెద్దదై ప్రజ్వరిల్లి ఎంత పెద్ద మొద్దులనైనా కాల్చుటకు సమర్థత కలుగును. కనుక జ్ఞానాగ్నిని నీవు గురువు దగ్గరనుంచియే పొందవలయును. అటుపిమ్మట నీవు సాధన చేయుచుండిన జ్ఞానాగ్ని నీయందు ఎక్కువగా

ప్రవేశించి ఎంత పెద్ద కర్మలనైనా కాల్చుటకు వీలగును. కొంతమంది గురూపదేశము సంపాదించుకొని ఇక చాలు మేము ధన్యులము అని సాధన ఏమాత్రము చేయకయున్నారు. వారి విషయము ఎట్లనగా ప్రక్కవారి దగ్గర నుంచి నిప్పుతెచ్చుకొని మనపొయ్యిలో వేసుకొన్న తర్వాత దానిని ఊదక యుండిన కొద్దిసేపటికి ఉన్న అగ్ని కూడా ఆరిపోవును. అట్లే గురుబోధ సంపాదించి సాధన చేయకుండినట్లయితే గురువు ఇచ్చిన జ్ఞానమను అగ్ని కొంత కాలమునకు వారియందు ఏమాత్రము లేకుండా పోవును. మొదట గురుబోధ తప్పనిసరి అవసరము, ఆ తర్వాత యోగసాధన కూడ అవసరము.

చెరువులోని నీరు చేనులోకి పోవలయునంటే చెరువుకున్న తూము ద్వారానే పోవలయును. కానీ వేరు మార్గము ఉండదు. అట్లే జ్ఞాన కేంద్రమైన గురువులోని జ్ఞానశక్తి శిష్యునిలోనికి పోవలయునంటే గురుబోధ ద్వారానే పోవలయును కానీ వేరు మార్గము లేదు. చెరువులోని నీరు చేనులోకి వస్తేనే పైరు పెరుగును. అట్లే గురువులోని జ్ఞానశక్తి నీలోనికి వస్తేనే సాధన ఫలించును. అట్లుకాకుండా నీరులేని చేనులో కష్టపడిననూ ఫలములేనట్లు, గురుబోధలేని శరీరములో యోగశక్తి అభివృద్ధి కాదు. అందువలన ప్రపంచములో ప్రతి జీవికి గురుబోధ ఆవశ్యకత ఎంతో ఉన్నది. వాస్తవము తెలుసుకొని మదిలోని అహంకారము విడిచిపెట్టి, గురువును ఆశ్రయించి, జ్ఞానశక్తి పొంది, సరైన సాధన చేసి, మీరు కూడా కడతేరవలయు నని కోరుచున్నాను.

*****

# నేటి కాలములో గురువుల అవస్థ

## (బోధకున్ని గురువని చెప్పినా ఫరవాలేదు.

## గురువును బోధకుడని చెప్పకూడదు.)

గురువు అనువాడు అరుదుగా కొన్నివేల సంవత్సరములకొకమారు భూమిమీదకు వస్తాడు. అందువలన అన్నివేళల భూమిమీద గురువుండడు. అన్నివేళల బోధకులు భూమిమీద ఉంటాడు. బోధించు వారందరు గురువులు కారు, బోధకులే అవుతారు. భూమిమీద గురువున్నపుడు గురువు బోధకులలో కలిసిపోయి ఇతను గురువు అని గుర్తించుటకు వీలులేకుండును. మనిషి తనకు బోధించువారిలో ఎవరు గురువు అని గుర్తించలేని పరిస్థితిలో ఉన్నాడు. అటువంటపుడు బోధకులను అందరినీ గురువుగా లెక్కించు కోవడములో తప్పులేదు. కానీ గురువును బోధకునిగా లెక్కించుకోకూడదు. కావున క్రింది వ్యాసములో బోధకులు అని వ్రాయవలసిన చోట గురువులు అని వ్రాశాము.

ప్రపంచములో ఎన్నో విద్యలున్నవి. వాటిని తెలియచేయువారిని గురువులంటాము. అన్ని విద్యలలోకెల్ల గొప్ప విద్య బ్రహ్మవిద్య. ఏదైనా పని సందర్భములో **'ఇదేమి బ్రహ్మవిద్యా'** అను నానుడి ద్వారానే దాని గొప్పతనము అర్థమగుచున్నది. అన్ని విద్యలకున్నట్లే బ్రహ్మవిద్యను నేర్పెడి గురువులు భూమి మీదున్నారు. అన్ని విద్యలు భూమి మీద జీవమున్నంత వరకు మాత్రము మేలు చేసేవైతే బ్రహ్మవిద్య మాత్రము అలాకాక చనిపోయిన తర్వాత కూడా మనకు మేలు కలుగజేస్తూ చివరకు ఈ జననమరణ కూపము నుండి బయటకు పడవేయగలదు. అందువలననే పూర్వము బ్రహ్మవిద్యా గురువులను రాజులు రారాజులు సహితము గౌరవించెడివారు, పూజించెడి

వారు. ఆనాడు అనగా పూర్వము బ్రహ్మవిద్య చాలా పవిత్రమైనదిగా భావించెడివారు. అందువలననే ఆ విద్యను తెలియజేయు గురువులకు రాజులు సహితము బ్రహ్మరథము పట్టెడివారు. ఎప్పుడైన రాజసభా మందిరములోనికి గురువులు ప్రవేశించిన సభికుల అందరి ముందర రాజ్యానికధిపతియైన రాజు లేచి నమస్కరించి వారికి ఉన్నతాసనమును చూపి కూర్చుండ పెట్టెడివారు. ఇంటిలో గురువుల పాదాలను కడిగి ఆ నీరును పవిత్రముగా భావించి వారి తలలపై చల్లుకొనెడివారు. ఇక మామూలు సాధారణ మనుషులైతే మరీ గొప్పగా బ్రహ్మవిద్యను ఆదరిస్తూ గురువులను గౌరవించెడివారు.

ఇట్లు కాలము జరుగగా నేడు బ్రహ్మవిద్య అంటే ఏమిటో తెలియనిస్థితి మానవ సమాజములో ఏర్పడినది. పుట్టింది మొదలు ప్రపంచ చదువులు నేర్వడములోనే 25 సంవత్సరముల వయస్సు చెల్లిపోవుచున్నది. చదివింది మొదలు ఉద్యోగమో వ్యాపారమో లేక ఏదో ఒక పని మీద తమ జీవితమును సాగించుటకు బుద్ధినంతటినీ ఉపయోగిస్తూ ఆయా పనులలోనే డబ్బు సంపాదన ఉపాయములను వెదుకుచున్నారు. కొంత కాలమునకు పుట్టిన సంతతిని తమలాగే తీర్చిదిద్దడములో లగ్నమై జీవితములో చివరిదశైన వృద్ధాప్యమును చేరుకొనుచున్నారు. ఆ వృద్ధాప్యములో మొదటి నుండి ఏ చింత ఉంటుందో అదే మనకు వస్తుంటుంది కానీ వేరురాదు. అందువలన ప్రపంచ యోచనలలోనే జీవితము ముగిసి పోతున్నది. ఇట్లు జరిగిపోవు ఈ నవీన ప్రపంచములో బ్రహ్మవిద్యంటే ఏమిటో, ఆత్మచింత నంటే ఏమిటో, బ్రహ్మవిద్యా గురువులంటే ఏమిటో కూడా తెలియనిస్థితిలో మానవుడు నిలిచిపోయాడు.

ఇటువంటి మానవుల మధ్య బ్రహ్మవిద్యా గురువుల స్థితి ఎంత అయోమయముగా ఉంటుందో  కొన్ని వివరాల ద్వార తెలుసుకొందాము. ఒక గురువు తాను గురువుననే ఏ ఆడంబరము లేకుండా ఒక చిన్న ఆఫీసుకు ఏదో పని ఉందని పోయాడనుకొందాము.  అక్కడున్న చిన్న గుమస్తా కూడా పలుకడు.  జీవిత సారాంశమునే తెలియజేయువారు గురువులని అర్థము తెలియని అక్కడివారు కనీసము కూర్చోమని కూడా చెప్పరు. సామాన్య మానవునికంటే తక్కువ చేసి మాట్లాడి పంపుతారు.  పూర్వకాలము దేశాధినేతలే గౌరవించే గురువులను, నేడు గురుసాంప్రదాయము, దాని అర్థము తెలియకపోవడము వలన చిన్న ప్రభుత్వ కార్యాలయములలో కూడా గురువులకు విలువలేదు.

బ్రహ్మవిద్యను మానవుల మధ్యప్రచారము చేయాలని గురువు ఒక పల్లెటూరికి పోయాడనుకొనుము.  నేను ఆత్మజ్ఞానమును చెబుతున్నాను వినండని కొందరిని కోరినప్పటికీ ముసలివాళ్ళేమో మాకు వయసు అయిపోయినది, జ్ఞానము విని ఏమి చేస్తాము? చచ్చేంత వరకు బాగా జరిగితే చాలు ఏమీవద్దంటారు.  యువకులకు తెలుపాలనుకుంటే మాకు తీరికలేదు పని పాటలేని వారికి చెప్పండని అంటారు.  పూర్వకాలములో రాజ్యాలు ఏలే రాజులు కూడా పని కల్పించుకొని గురువుల వద్దకు పోయి జ్ఞానము వినేవారు, కానీ  ఈ కాలములో కొద్దిపాటి సంసారమునకే తీరికలేదనువారు కలరు.

వినే దానికి తీరికలేకపోతే వీలున్నప్పుడు చదువుకొనే దానికి పుస్తకాలైనా కొని చదవండని ఒక గురువు అన్నాడనుకోండి.  ఆ పుస్తకాలు ఉచితముగా ఇమ్మంటారు కొందరు. పుస్తకాలు ఉచితముగా ఎట్లు

ఇవ్వగలము. మేము కాగితములు కొని ప్రింటింగు ఖర్చుపెట్టుకొని పుస్తకాలు మీ కొరకు శ్రమించి తయారు చేశాము దాని ఖర్చయినా ఇవ్వాలి కదా! అని గురువుగారడిగారనుకోండి. ఆ... మీకేమి ఎందరో భక్తులు ఎక్కువగా డబ్బులిస్తా ఉంటారులే అని అనువారు కలరు. పూర్వకాలములో బ్రహ్మవిద్యా గురువుల ఖర్చంతయూ వారి రాజులే భరించెడివారు. ఏవి కావాలని అడిగినా సమకూర్చేవారు. కానీ ప్రస్తుతము గురువులు డబ్బున్నవారి వద్దకుపోయి వడ్డీకి డబ్బు అడిగినా ఇవ్వని కాలమిది. నేనేమైన ఉచితముగా ఇచ్చానా అని యోచించకనే మాట్లాడువారు పుస్తకాలు కొని చదువగలరా!

ఇకపోతే భక్తులందామా ఒక గురువుకు కొందరు భక్తులమని శిష్యులు ఉన్నారనుకొందాము. అందులో కొందరు గురువుగారి నుండి లాభము పొందాలని చూస్తుంటారు. ఒక కాలములో ముంతలు పెట్టి చెంబులు ఎత్తుకపోయెవారుంటే ఇపుడు ముంతలు చూపి చెంబులు ఎత్తుకపోయేవారున్నారు. ఏదైనా జ్ఞానపరముగ తప్పు చేసితే ఇది తప్పని గురువుగారు దండించితే మేము రాకుండాపోతే నీకే లోటన్నట్లు అక్కడికి రాకుండా పోవుదురు. ఏమయ్యా గురువు గారి దగ్గరకు పోలేదని ఎవరైన అడిగితే గురువులో ఫలానా చెడ్డతనము ఉన్నది, నేను ఇంత మంచివానిని అక్కడకు పోవడము మంచిది కాదు కదా! అని గురువునే చెడ్డచేసి తాను గొప్పని చెప్పుకొందురు.

ఇకపోతే అంతో ఇంతో ఆధ్యాత్మికచింత ఉన్నవారు ఒక గురువు వ్రాసిన పుస్తకములు చదుకొనుచున్నారు. అందులోని విషయములు వారికి అనుకూలముగానే ఉండాలనుకొంటారు. కానీ వ్రాయబడిన విషయములు సత్యములా అసత్యములా అని యోచించరు. వారికి ముందు ఏ విధముగా

తెలిసియుంటే, చదివే పుస్తకాలలోనూ ఆ విధముగా ఉంటేనే సరియైనవని, అలా కాకపోతే సరియైన విషయములు కాదనువారున్నారు. అలాంటపుడు గురువు వ్రాసిన ఎంత సత్యమైన విషయములు కూడా విలువ లేకుండా పోవుచున్నవి. అట్లే ఒక గురువు వేదికనెక్కి ఉపన్యాసము చెప్పుచున్నాడను కొందాము. గురువుగారు కేవలము బ్రహ్మవిద్యను గూర్చి, ఆత్మజ్ఞానమును గూర్చి చెప్పితే ఎవరూ సమ్మతించరు. ఉపన్యాసము మధ్యలో అపుడపుడు, హరికథ మధ్యలో పిట్టకథలున్నట్లు, వినేవారిని నవ్వించే దానికి కొన్ని పిట్టకథలుండాలి. అవి అనవసరము, జ్ఞానాన్నే చెప్పాలని గురువుగారను కొంటే చెప్పే గురువుకు జ్ఞానమేరాదంటారు.

పూర్వము జ్ఞానాన్ని విపులముగా తెలియచేసేవాడిని గురువని తలచెడివారు. ఈనాడు ధరించే దుస్తులను బట్టి, పెంచే గడ్డాలను బట్టి గురువులను భావము చూపుచున్నారే కానీ చెప్పే జ్ఞానాన్ని బట్టి కాదు. ఇటువంటి కాలములో అసలైన గురువులకు సమాజములో విలువే లేకుండా పోయినది. పూర్వపు గురువులను రాజులు మరియు ఇతరులు పోషించెడి వారు. కావున ఆనాడు గురువుల మెదడంతయు జ్ఞానము మీదనే ఉపయోగపడి ఎన్నో సత్యమైన విషయములు కనుగొని ప్రజలకు తెల్పెడివారు. కానీ ఈనాడు గురువుల పరిస్థితి మారిపోయినది. కేవలము జ్ఞానము మీదనే వారి మనో బుద్ధులను కేంద్రీకరించుటకు వీలులేదు. అంతో ఇంతో ప్రపంచ విషయము మీద కేంద్రీకరించి వారి కడుపుకు వారు సంపాదించుకోవలసి వస్తున్నది. ఇటువంటి పరిస్థితులలో తమలో జ్ఞానమున్నా అది పనికిరాదని తెలిసిన గురువులు విధిలేక కొందరు జ్యోతిష్యము చెప్పుకొని కాలము గడుపుచున్నారు, కొందరేమో వైద్యము చేయుచున్నారు, కొందరు అంత్రాలు, మంత్రాలని కాలము గడుపుచున్నారు,

మరి కొందరు చుట్టూ ఉన్న ప్రజలకు అనుగుణముగా వారి దృష్టికి ఏది భక్తిగా కనిపిస్తుందో అదే చేయుచున్నారు. ఏవో కొన్ని పనులు చేయకపోతే స్వామి అనరని, తమకు ఇష్టమున్నా లేకున్న నాగులకట్టలనీ, నవగ్రహ ప్రతిష్టలనీ ప్రజల చేతనే కవ్వించి చేయించు వారున్నారు. అభూతకల్పనలని తెలిసినప్పటికీ ప్రజలకిష్టమైన పురాణములనే చదివి చెప్పి ప్రొద్దుపుచ్చువారు కొందరున్నారు.

ఇలా చాలామంది గురువులు నవసమాజములో అనేక రకములుగా మారిఉన్నారు. అలా మారకపోతే గత్యంతరము లేకున్నది. అలా మారను నేను నేర్పేది ఆత్మజ్ఞాన పాఠాలే అను గురువులు కూడా ఎక్కడో ఒక చోట ఉంటారు. అలాంటి గురువులు అడుగడుగునా అనేక సమస్యలను, అనేక ప్రతిఘటనలను, అనేక విమర్శలను ఎదుర్కోవలసి వస్తున్నది. అటువంటి గురువు ప్రజల దృష్టిలో జ్ఞానమే తెలియని అజ్ఞానికంటే హీనునిగా కనిపిస్తుంటాడు. అటువంటి గురువును మేమొకరిని చూచాము. ఆయన ఎవరిని ఏ విధముగా ఆశించకుండా తానే స్వయముగా కష్టపడి జ్ఞానాన్నే ప్రచారము చేయాలనే ఉద్దేశ్యముతో ఉండేవాడు. జ్ఞానము చెప్పేటప్పుడు గురువుగా శాశ్వత శాస్త్ర ధర్మాలనే బోధించెడివాడు. ఎక్కువ వడ్డీలకు బాకీచేసి, జ్ఞాన ప్రచురణ, ప్రచారమునకు వినియోగించి కష్టపడి బాకీ తీర్చుకొనెడివాడు. తాను గురువుననే భావన కూడా లేకుండా కొన్ని పనులలో కూలివానికంటే ఎక్కువ పని చేసెడివాడు. తనను చూడని క్రొత్త ప్రాంతము లలో తాను గురువునని చెప్పక తాను ఒక భక్తుడననే చెప్పుకొనుచూ జ్ఞానమును గూర్చి ప్రచారము చేసెడివాడు. అలాంటి సమయములో తనను చూడనివారెందరో తన జ్ఞానాన్ని మెచ్చుకొను సమయమున కూడా, తాను గురువునని చెప్పక సామాణ్య మనిషివలె ఉండే నిరహంకారియైన

గురువువద్ద ఎందరో భక్తులు చేరడము, కొంత కాలము ఆయన తెల్పు జ్ఞానాన్ని వినడము, చివరకు దూరముగా పోయి ఆయన మంచితనాన్ని చెడ్డతనముగా, ఆయన జ్ఞానాన్ని అజ్ఞానముగా ప్రచారము చేయువారిని చూచాము. అలా పోయినవారు దొంగలతోను మోసము చేయువారితోను, జూదరులతోను, కలిసిమెలిసి తిరుగుతున్నారు. ఎంతో జ్ఞానము చెప్పిన గురువును దూరము చేసుకొనువారికి, మిగతా చెడుమార్గమున పోవువారు బాగా కనిపించారంటే, ఆ విషయమును గురించి ఆ గురువుగారి అంతరంగ మందు బుద్ధి ప్రశ్నలు, వాటికి జవాబుల రూపములో యోచిస్తున్నది. ఆ ప్రశ్న జవాబులు ఈ విధముగా ఉన్నాయి.

**ప్రశ్న : ఎందరో గురువులు ప్రజలకు అనుకూలముగా వారికి నచ్చిన జ్ఞానము తెలుపుచున్నారు. కానీ మీరు అలాకాక మీధోరణిలో చెప్పుచూ పోవుచున్నారు. అందుకే అందరికి నచ్చడము లేదు. దీనికేమంటారు?**

**జ :** ప్రజలు అజ్ఞానాంధకారముతో సంసారసముద్రములో ఉన్నవారు శక్తి ఉన్నంతసేపు ఈదగలరు. శక్తిలేనపుడు మునిగిపోవుచున్నారు. సంసార సముద్రములో ఈదే వారిని ఇట్లు ఈదండి అట్లు ఈదండని వారు ఈదే దానికి సులభమైన ఉపాయములు చెప్పేదానికంటే, ఈదకుండా సముద్ర నీటి తేమ కూడా కాకుండా ఉండే ఉపాయము చెప్పడమే మంచిదని నా ఉద్ధేశ్యము. ప్రజలను చూచి వారికి అనుకూలముగా గురువు మారకూడదు. గురువును చూచి గురువు పద్ధతి ప్రకారము ఒక్కడు మారినా ఫరవాలేదు. మేము చెప్పు బోధలు అందరికి నచ్చాలని లేదు వేయింటికి ఒకరికి నచ్చినా ఫరవాలేదు. నచ్చడము నచ్చక పోవడమనేది ముఖ్య సమస్య కాదు. చెప్పేది అసలు ధర్మమా కాదా అనునదే మా దృష్టిలో ముఖ్యము. భూమి మీద

అధర్మమునకే ఎక్కువ విలువిచ్చు వారున్నారు కావున మా బోధలు చాలామందికి నచ్చవు.

**ప్రశ్న : వారికి నచ్చదంటున్నారు కదా! వారికి నచ్చేటట్లే చెప్పితే మీకేమి నష్టము?**

**జ :** ధర్మమిది, అధర్మమిది అని తెలిసి ఇంకొకరికి నచ్చడము కొరకు అధర్మ విషయమును చెప్పడము దైవద్రోహము, దైవవిరుద్ధమవుతుంది. దానివలన క్షమించరాని కర్మ ఏర్పడుననీ తెలిసి మేమెలా చెప్పగలము?

**ప్రశ్న : శాస్త్రమంటే ఏమిటని తెలియని వారికి మీరు శాస్త్రమొక్కటే చెప్పుట వలన ఏమి రుచిస్తుంది?**

**జ :** శాస్త్రమంటే ఏమిటని, అవి ఏవను విషయమును కూడా ఎన్నోమార్లు తెలిపాము. అయినప్పటికి గ్రంథములన్నిటినీ శాస్త్రములనుకొను వారున్నారు. అది వారి కర్మ మేమేమి చేయగలము. వివరము చెప్పడమే ఒక గురువుగా నా ధర్మము, అదే నేను చేయుచున్నాను. ఒక వ్యక్తికి విస్తరాకులో భోజనము పెట్టి పప్పుకూర, సాంబారు, గోంగూర పచ్చడి, నిమ్మకాయ ఊరగాయ వేశామనుకోండి. తినే అన్నములోనికి ఒక్కొక్కటి ఒకమారు కలుపుకొని తినినవానికి వాటన్నిటి రుచి వేరువేరుగా తెలియును. అపుడు ఏది ఎక్కువ రుచి, ఏది తక్కువ రుచి అని సులభముగా చెప్పగలడు. అలాకాక అన్నింటినీ ఒకేమారు కలుపుకొని తినువానికి ఏ పదార్థము రుచి ఏదో తెలియకపోవును. విడివిడిగా తిన్నపుడు పప్పుకూర ప్రత్యేకత ఏమిటో, గోంగూర పచ్చడి ప్రత్యేకత ఏమిటో తెలియును. అన్నీ ఒకటేనని కలుపుకొని తినేవానికి ఏ రుచిని గూర్చి చెప్పినా వానికి అర్థముకాదు. వానికి కనిపించు రుచి ఒకటైతే మనము చెప్పు రుచి వేరొకటవుతుంది.

అలాగే నేను శాస్త్రమువేరు, పురాణమువేరు, చరిత్రలువేరని చెప్పితే అన్నీ పుస్తకాలే కదా! అనుకొనువారికి శాస్త్రము యొక్క ప్రత్యేకత ఎలా తెలుస్తుంది. ఏది ఏమైనాకానీ నా పని మాత్రము ధర్మములతో కూడుకొన్న యోగ శాస్త్రమును తెల్పడమే.

**ప్రశ్న : కొందరు మీకు సహకరించి, ఈయన చెప్పునది శాస్త్రబద్ధమైన ధర్మయుక్తమైన జ్ఞానమని తెలిపితే మీకు బాగుండును కదా! అందుకని ప్రస్తుతము జ్ఞానులమని పేరుపొందిన వారితో మీరు పొత్తు పెట్టుకోవడము మంచిది కదా!**

**జ :** ఇది రాజకీయ పార్టీ కాదు కదా! పొత్తు పెట్టుకొనేదానికి. ఈ దినము ప్రపంచ జనాభాలో 70 శాతము ప్రజలు దైవముగా చెప్పుకొను ఏసుప్రభువు కూడా తాను చెప్పునది సత్యమార్గమని చెప్పినప్పటికీ, ఆనాడు ఎంతమంది ఆలకించారు. ఆనాడు జ్ఞానులని పేరుగాంచిన శాస్త్రులందరూ ఆయనను వ్యతిరేకించి, ఆయన చెప్పునది జ్ఞానము కాదు అని దూషించి ఆయన మరణానికే కారణము కాలేదా! ఎందరో ఎన్నో రోగములు ఆయన స్పర్శ చేతనే నయము చేయించుకొని, ఆయన చేతి రొట్టెలు తిన్నవారు కూడా ఆయన మీదికి రాళ్లు విసరలేదా! నేడు హిందూ మతములో గొప్పగా చెప్పుకొను భగవద్గీతను శ్రీకృష్ణుడు అర్జునుని ఒక్కనికే చెప్పాడు. ఆ రోజు అందరు వినాలని ఆయన తాపత్రయపడలేదు. వారి కోవలో నడుస్తున్న మేము వారిలాగే సత్యమును తెలుపాలనుకొన్నాము. కానీ ఎంతమంది మాతో సహకరించుచున్నది విశేషము కాదు.

**ప్రశ్న : మీరు కూడా పూర్వపు ఏసుప్రభువులాగ మరియు ఇతర గొప్ప మహర్షులులాగ కొన్ని సందర్భములలో నోటి మాట ద్వారా మరియు చేతి**

**స్పర్శ ద్వార కొన్ని భయంకర కర్మలను కూడా స్థంభింపజేసి యోగశక్తి గల యోగినని నిరూపించుకొన్నప్పటికీ, చాలామంది నిన్ను గొప్ప జ్ఞానిగా గుర్తించలేకపోయారు. చివరకు కర్మనుండి బయటపడిన వ్యక్తులు సహితము జ్ఞానమును గూర్చి వినడములేదు ఎందుకు?**

**జ :** యోగశక్తి అంటే ఏమిటో, మంత్రశక్తి అంటే ఏమిటో అర్థము వ్యత్యాసము తెలియని మనుజులు కావున వారు నన్ను యోగిగా గుర్తించ లేకపోయారు. చివరకు నా దగ్గర నా తాకిడి ద్వారానో లేక చూపు ద్వారానో బాగుపడినవారు కూడా ఇది ఏదో మంత్రశక్తియనీ, నన్నొక మాంత్రికునిగా లెక్కించుకొని అక్కరతీరింది కదాయని దూరము పోయారు.

**ప్రశ్న : అటువంటి మనుషులకు మీరు సంపాదించుకొన్న యోగశక్తిని ఎందుకు ఖర్చుచేశారు?**

**జ :** జ్ఞానమునకు ఇటువంటి సామర్థ్యముందనీ ఎక్కడో ఒకచోట నిరూపించాలి కదా! అందువలన దగ్గరికి వచ్చిన వారికెవరికో ఒకరికి కర్మను కాల్చి నిరూపించాలను ఉద్దేశ్యముతో అలా చేశాము మరియు ఈ విధానము జ్ఞానశక్తి వలననే జరిగింది. కర్మను కాల్చుశక్తి ఒక్క యోగశక్తి (జ్ఞానాగ్ని) కి తప్ప ఇతరము దేనికిలేదని కూడా తెల్పాము. ఏసుప్రభువు దగ్గర స్వస్థత పొంది, తిరిగి ఆయనపై రాళ్లు విసిరినవారు పూర్వము ఉన్నారు. అలాంటి మానవతే కదా! ఈనాడు కూడా గలదు. అందువలన వారిపని అయిపోయిన వెంటనే రాళ్లు వేయకుండా పోయారు దానికి సంతోషించాలి.

**ప్రశ్న : మీరు ఎన్నో రచనలు సాగిస్తున్నారు. ఇప్పటి కాలములో కొన్ని వేల డబ్బైతే కానీ ఒక పుస్తకమును అచ్చువేయలేము. అలాంటపుడు మీరు కొన్ని లక్షల డబ్బు ఖర్చుపెట్టి, పుస్తకప్రచురణ సాగించి అప్పుల**

**పాలైనారు. మీరు అధిక వడ్డీలకు డబ్బు తీసుకొని అనుకున్నపుడు అనుకున్న పనిని నెరవేర్చుచున్నారు. తిరిగి స్వయంకృషి వలననే అప్పులు తీర్చి వేస్తున్నారు. మీరు చేయనిపనంటూ లేదు. మీరొక గురువై ఇన్ని పనులు స్వయానచేసి డబ్బు ఆర్జించి, మీ ధ్యేయమునకు వినియోగించడము కంటే, మీరు అందరి గురువులలాగ కొన్ని ఊర్లలో ఉపన్యాస కార్యక్రమములు పెట్టి కానుకలు తీసుకోవచ్చును కదా?**

**జ :** అది నాకు నచ్చనిపని. నా ద్వారా జరిగే ప్రతిపనికి సహకరించాలను కొన్నవారు వారి శ్రమదానము చేతనే సహకరించాలని, అలా చేసినపుడే చాలా ఫలితము వారికి దక్కుతుందని నా భావము.

**ప్రశ్న : అలా మీకు శ్రమరూపముగ శ్రమించువారున్నారను తృప్తి మీకుందా?**

**జ :** ఉంది. నన్నూ, నా ఉద్దేశ్యమును అర్థము చేసుకొని శ్రమించుటకు నా కొరకు వారి ప్రాణములను సహితము లెక్కచేయనివారున్నారు. అందు వలననే నేను అందరి కోసము కాదు కొందరి కోసమే అను సమాధానముతో రెట్టింపు ఉత్సాహముతో జ్ఞానము తెల్పుచున్నాము.

**ప్రశ్న : కొంతకాలము మీకు వరుసగా కష్టాలే ఎదురైనాయనుకోండి. అపుడు ఇలాగే జ్ఞానము తెలుపగలరా?**

**జ :** కష్టసుఖాలు కర్మ ఫలితములు, ప్రకృతి సంబంధమైనవి. కావున కర్మ నిర్ణయము ప్రకారమే అవి సంభవిస్తాయి కానీ వాటికి జ్ఞానపరముగా వెనుకంజ వేయకూడదు. వచ్చే కష్టాలు రాకమానవని తెల్పుచున్న మేమే జ్ఞానములో వెనుకంజ వేస్తే దృఢనిర్ణయమను దానికర్థమే ఉండదు.

ఇది ఒక గురువు మదిలో మెదిలిన బుద్ధి యొక్క రెండు వివరములు మీకు తెలిపాము. నేటి కాలములో గురువులుగా భూమి మీద కొనసాగడము చాలాకష్టము. అందువలననే కొందరు పెద్దలన్నారు. ఈ కాలములో వందమంది గురువుల వద్ద శిష్యునిగా ఉండవచ్చును కానీ, ఒక శిష్యునికి గురువుగా ఉండడము కష్టమన్నారు. అంటే గురువు అను పదవి చాలా కష్టతరమైనదిగా వారు చెప్పుచున్నారు. ఇక అసలైన గురువులుగా నడవాలంటే మరీ కష్టము. భూమిమీద గురువులు కరువైతే జ్ఞానమనునదే కనిపించక పోతుంది. అందువలన మీరైనా గురువులకు విలువనివ్వండి.

*****

# భగవంతుని రాక

దేవుడు అనువాడు అన్ని మతముల చేతను పూజింపబడువాడు. అన్ని మతములవారు వారి వారి ప్రవక్తలు బోధించిన పేరు మీద దేవుని వేడుకొనుచుందురు. భిన్న మతములవారు ఎన్నో భిన్న ఆరాధనలచే ఆరాధించినప్పటికీ వారి ఆరాధన అంతయు దేవుని గూర్చియే, విశాల దృష్థితో చూచినపుడు అన్ని మతములవారి హృదయములలో దేవుని గూర్చిన స్మరణ ఉన్నది. ప్రపంచమునకంతా ఆదికర్తయైన దేవుడు ఒకడున్నాడనీ మతములన్నియు చెప్పుకొంటున్నవి. సృష్థికర్తయైన ఆ దేవుని సన్నిధానమును చేరుటకు అన్ని మతముల ప్రజలు ఆరాటపడుచున్నారు.

మానవుడు ఏదో ఒక మతమును ఆధారము చేసుకొని, దేవుని తెలుసుకొనుటకు చేయు ప్రయత్నమే దైవారాధన. కాలము జరుగు కొలది మతము యొక్క ఉద్దేశ్యము దేవున్ని తెలియుటకే అని మరిచి, మతమును

పెంపొందింప చేసుకొనుటయే ముఖ్య ఉద్దేశ్యముగా మనుషులు పెట్టుకోవడము జరిగినది. మతములోని సారాంశమైన దైవచింతన వదలి, దైవము కొరకు ఏమి త్యాగము చేయలేని మానవుడు మతము కొరకు ప్రాణమునైన విడువగల స్థితికి చేరాడు. ఇటువంటి సమయములో మతము గొప్పదా? మతము ద్వార తెలియబడు దైవము గొప్పదా? అను ప్రశ్న కొందరికి ఉద్భవించకమానదు. ఏది గొప్పదో చెప్పవలసిన వాడు దేవుడే. మానవుడు మతోన్మాదుడై దైవమునే మరచి ఆయన చెప్పినట్లు నడువనినాడు, తిరిగి ఆయనే వచ్చి ఇది మీరు ఆచరింపదగినది, ఇది ఆచరింపకూడదని తెలియబరచాలి. ఎంతటి తెల్లని గోడయైన పొగ ఉండుటచే కొంత కాలమునకు కొద్దిగా తన తెల్లదనము కోల్పోయినట్లు, నిష్కల్మష హృదయము గల మానవుడు మాయ (సాతాన్) యొక్క సంబంధముతో అజ్ఞానిగా మారుచున్నాడు. మాసిన గోడకు సున్నము పూసి తిరిగి తెల్లదనమును చేకూర్చినట్లు, దేవుడు మానవున్ని తిరిగి జ్ఞానిగా మార్చుటకు అప్పుడప్పుడు భూమి మీద అవతరించి, తన వాక్కులను (ధర్మములను) తెలియజేసి పోవుచుండును. కానీ ఆయన ఎప్పుడు వస్తాడో, ఎప్పుడు పోతాడో ఎవరికీ తెలియదు.

అధర్మపరుడైన మానవున్ని ధర్మపరునిగా మార్చు నిమిత్తము దేవుడు మానవునిగ పుట్టి వచ్చినపుడు, ఆయనను గుర్తించుటకు ఒకే ఒక అవకాశము గలదు. ఆయన తెల్పు ధర్మములను బట్టి ఈ వ్యక్తి ఎవరని యోచించి తెలుసుకొను అవకాశము ఉండినప్పటికీ, ఆయన అంత సులభముగ దొరుకువాడు కాదు. అట్టి వానినే భగవంతుడని అనుచున్నాము. దైవము మానవునిగ రాకమునుపు, అణువణువున వ్యాపించి ఆకారములేనిదై అంతటా ఉండిన వేళ, ఆ దైవమును ఏ పేరు పెట్టి పిలువలేము.

అందువలననే పురుషులకంటే ఉత్తమమైన పురుషోత్తముడని, ఆత్మకంటే వేరైన పరమాత్మని అర్థములను తెల్పు పదములే వాడాము. పరమాత్మ, పరమ పురుష అనునవి పేర్లు కావు. విశ్వవ్యాపియైన ఆ దైవమే మానవాకృతి ధరించినవేళ ఆయనను భగవంతుడని ఒక పేరుపెట్టి పిలువడము జరుగుచున్నది. అంత గొప్ప దైవమునకు ఆకారము వచ్చిన వేళ భగవంతుడని అనడము ఏదో గొప్ప విశేషమై ఉండును. ఆ భగవాన్ అను పేరును వివరించి తెలుసుకొందాము.

భగము అనగ స్త్రీ యొక్క గర్భము (యోని) అని అర్థము. భగవంతుడనగా స్త్రీ గర్భమునుండి పుట్టినవాడని అర్థము. ఓష్ ఇంతేనా! ఇంత చిన్న అర్థమేనా!! అనుకోవద్దండి ఇది చాలా గొప్ప అర్థము గల పదము. ఇందులో ఏమి గొప్పతనమున్నదనీ కొందరనుకోవచ్చును. మనము కూడ స్త్రీయోని నుండి పుట్టినవారమే కదా! మనము కూడా భగవంతులమే కదా!! భగవాన్ అంటే యోని నుండి పుట్టడమే అయితే ఆ దేవునికి మనకు ఏమిటి తేడా? అనికూడ కొందరికి ప్రశ్న వచ్చి ఉంటుంది. దానికి సమాధానము కూడా తెలియాలి కదా! అణువుకంటే అణువై, అంతటికీ అధిపతియై, అవ్యక్తుడై, అవినాశకుడై అన్ని శరీరములకు శక్తినిచ్చి ఆడించు పరమాత్మ, పరమపిత, పరంధాముడైన ఆ దైవమొక్కడే భగమునుండి పుట్టగలడు. భగవంతుడు కాగలడు. ఆయన తప్ప సకల భూమండలములో ఏ ప్రాణీ భగము నుండి పుట్టలేదు, భగవంతుడు కాలేదు. ఈ మాట చెప్పుచున్న మాకు మెంటల్ ఎఫెక్ట్ వచ్చిందని మీకు అనుమానము కూడ వచ్చి ఉంటుంది. సత్య ప్రకటన చాలా కష్టమైనది. ఇప్పుడీ మాట తిక్కమాటగ ఉండినా దీనికి కొంత విలువ ఇచ్చి యోచించమని కోరుతూ వ్రాయుచున్నాము.

జీవులైన మనముగానీ మరియు ఏ జీవరాసిగానీ యోని నుండి వాస్తవముగా పుట్టలేదు. మనము ధరించిన శరీరములు మాత్రము స్త్రీయోని నుండి పుట్టినవి. అంతేకానీ శరీరమును ధరించిన మనము ఏ సందర్భములో కూడ యోని నుండి పుట్టలేదు. అనగా సజీవముగా మనము గర్భము నుండి రాలేదు. మన శరీరము గర్భము నుండి బయటపడిన తర్వాత అందులోనికి పాతవస్త్రము వదలి క్రొత్తవస్త్రము ధరించినట్లు పాతశరీరమును వదలి క్రొత్తశరీరములో చేరగలుగుచున్నాము. పరిమితమైన జీవాత్మ ఒక శరీరమును వదలి మరియొక శరీరము వరకు పయణించుచున్నది. కానీ దేవుడు అపరిమితమైన వాడు, ఒకచోట చనిపోయి వేరొక చోట పుట్టువాడు కాడు, ఆయన కర్మచేతిలో లేనివాడు. స్త్రీ శరీరములో కూడ చైతన్యమై ఉన్నాడు. ఆయన గర్భము నుండి సజీవముగా పుట్టగలుగుచున్నాడు. గర్భము నుండి ఎవడైతే సజీవముగా పుట్టాడో అతనికే **"భగవాన్"** అను పదము వర్తించగలదు. గర్భమునుండి బయటపడిన, చైతన్యరహితముగా ఉన్న శరీరమును చేరు జీవాత్మలకు ఎప్పటికీ భగవాన్ అను పేరు వర్తించదు. (మీకు ఈ విషయము పూర్తిగా అర్థము కావలయునంటే మా రచనలలోని **"జనన మరణ సిద్ధాంతమను"** గ్రంథము చదవండి.)

మానవునిలో అధర్మములు చెలరేగినపుడు, ధర్మములకు ముప్పు కలిగినపుడు భూమి మీద ఆయన రాక, ఆయన ఉనికి ఎవరికీ తెలియదని కూడా ఉన్నది. గొప్ప రహస్యమైన ఆయన అవతారమును గుర్తించిన వారికి ఏ యోగముతో పనిలేకనే మోక్షము పొందగలరని కూడా గలదు. దైవము యొక్క పుట్టుక ఎక్కడ ఏ కాలములో జరుగునో తెలియనపుడు, భూమి మీద ఒకే కాలములో ఎందరో భగవాన్ అను పేరుగలిగినవారు ఉన్నారు కదా! పరికించి చూస్తే భూమి మీద భగవాన్ అనిపేరు పెట్టుకొన్న

స్వాములు, యోగులు ఇప్పటికీ వందల సంఖ్యలో ఉన్నారే వీరంతా భగవంతులు కారా? ఇందరిలో నిజమైన భగవాన్ ఎవరు? అను సంశయము నాకు మీకు అందరికీ ఉద్భవించునదే. ఈ ప్రశ్నకు జవాబు వెదికితే భూమి మీద ఒక్క సమయములో, ఒక్క భగవంతుడు ఎప్పుడో ఒకప్పుడు ఉండవచ్చును కానీ, అన్ని కాలములలోను ఎందరో భగవాన్‌లు ఉండుట అసంభవము. మరి ఉన్న వారంతా ఉత్త భగవానులే. నిజ భగవంతుడెక్కడైనా ఉండవచ్చునేమో! ఒకవేళ ఉంటే ఆ ఒక్కడు తప్ప మిగతావారంతా మామూలు మానవులే, భగవానులు కారు.

దైవమే శరీరమును ధరించి ఇప్పుడు భూమి మీద ఉన్నాడను కొందాము, ఆయనకు మాత్రము భగవాన్ అనుమాటవర్తించగలదు. కానీ ఆయన భగవాన్ అను గుర్తింపుతో ఏమాత్రము ఉండడు. ఆయన ఉన్నపుడు గ్రహించుట కష్టము. ఆయన పోయిన తర్వాత అర్థమైనపుడు పలానా జన్మ దేవునిది అని గ్రహించగలము. ఒకవేళ శరీరముతో ఉన్నప్పుడే గ్రహించగలిగితే ఏ యోగమాచరించకుండినప్పటికీ భీష్మునివలె మోక్షము పొందవచ్చును. దైవము మానవరూపుగా వచ్చి, మానవ పరిధిలోనే మానవుని వలె నటించి, తాను ఏమాత్రము బయటపడకుండా ధర్మములను తెల్పి పోవుచుండును. ఆ భగవంతుడే “నేను భగవంతుడనని” తెలియకుండా జాగ్రత్తపడి, రహస్యముగనే కాలము గడిపి, తన ధర్మములను మాత్రము ఇక్కడ తెల్పి తానుమాత్రము తప్పించుకొని పోవుచున్నాడు. ‘భగవాన్’ అను పదమునకు అర్థము తెలియక ఎందరో భగవాన్‌లుగా వెలసిన ఈ కాలములో నిజమైన భగవాన్ తప్పక వచ్చి, అధర్మములను ఖండించి ధర్మములను తెలుపుట ఎంతైనా అవసరము. ఆ భగవాన్ ఎప్పుడు వస్తాడో వేయికన్నులతో చూస్తూ, వస్తే తెలియకుండా వచ్చిపోవు ఆ దొంగ భగవంతుని తెలుసుకొనుటకు వేయి తలలతో యోచిస్తూ ఉందాము.

(దయ, కీర్తి, సంపద, జ్ఞాన, వైరాగ్యములుకలవాడు భగవంతుడని కొందరి వాదన. కానీ అది సరియైన సత్యముకాదనీ తెలియవలయును. భగము నుండి పుట్టినవారే భగవంతులని తెలియవలయును. దేవుడొక్కనికే భగము నుండి పుట్టగల అవకాశమున్నదనీ కూడా తెలియవలయును.)

*****

# యోగి అంటే ఎవరు?

మేము చిన్న తనములో ఉన్నపుడు యోగులు, సన్న్యాసులు అంటే అడుక్కు తినేవారని భావించేవారము. ఆనాటి మా పెద్దలలో కూడా ఆ భావనే ఉండి ఆ విధముగనే మాట్లాడుట వలన, వారి వద్ద పెరిగిన మాకు కూడా యోగులంటే అడుక్కునే సాధువులని అనుకొనేవారము. ఈనాడు కూడా చాలామంది అజ్ఞాన జనులలో సన్న్యాసి, యోగి అంటే తక్కువ భావనే ఉన్నది. కొద్దిగా చెడు దారి పట్టేవానిని **'ఏమిరా నీవు సన్న్యాసివి కావాలని ఉన్నావా'** అంటున్నారు. దీనినిబట్టి అన్ని విధాల చెడిపోయిన వారిని సన్న్యాసులని ఈనాటి కొందరి భావము. అయితే కొంత జ్ఞానము తెలిసినవారు యోగులంటే గొప్పవారను భావముకల్గి ఉన్నారు.

నేటి కాలములో కూడా జ్ఞానము తెలిసిన గొప్ప యోగులు కొందరు అక్కడక్కడ ఉన్నారు. అటువంటి యోగులు అరుదుగా ఎక్కడో ఒకచోట కనిపిస్తున్నప్పటికీ కొందరు యోగులుకాని వారు కూడ మేము యోగులము అని ప్రచారము చేసుకొనుచున్నారు. ఇట్లు నిజయోగులు, అపద్దపు యోగులు రెండు రకములుగా భూమిమీద ఉన్నారు. సంపూర్ణ జ్ఞానములేని మనిషి సత్యాసత్యయోగులను గుర్తించలేక అందరినీ యోగులుగానే లెక్కించు

చున్నాడు. తెలియని దానివలన యోగికాని వానిని కూడా యోగియనే అనుకొంటున్నాడు. అందువలన కొందరు జ్ఞానజిజ్ఞాసులు, కొందరు యోగాసక్తులు యోగి కానటువంటి వారిని ఆశ్రయించు అవకాశము కూడా కలదు. ఆ విధముగా ఆశ్రయించినవారు అపద్దపు యోగి చెప్పిన ఏదో ఒక సాధన చేయుచూ దానినే నిజయోగముగా భ్రమించుట కూడా జరుగుచున్నది. అటువంటివారికి నిజమైన యోగి తటస్థపడినా ఆయనను గుర్తించక గుర్తించకపోవుటయేగాక ఆయననే అనుమానించుట, అవమానించుట కూడా జరుగుచున్నది. ఎన్నో అర్థముకాని విషయములను సహితము విపులపరచి సంశయరహితము చేయు గొప్ప యోగులను కూడా లెక్క చేయక మీరు చెప్పు విషయములతో, మీ అర్థములతో మాకేమి అవసరములేదు. మా దారి వేరు మేము ప్రత్యేకమైన యోగము చేయు చున్నాము, మాకు జ్ఞానముతో అవసరము లేదు, పుస్తకములు చదువవలసిన పని అంతకూలేదని అంటున్నారు. గీతలో చెప్పిన యోగములు రెండే రెండు అయితే అవి కాని మార్గములనాశ్రయించి, తాము ఆచరించునదియే నిజ యోగమనుకొనువారున్నారు. ఇంతటి పొరపాటును ఏ విధముగాను సరిచేసుకొను అవకాశము లేకుండునట్లు వారున్నారు. దీనికంతటికీ కారణము వారికి సత్యమైన యోగులు ఎవరని తెలియకపోవడమే. అందువలన ఇపుడు యోగుల గురించి తెలుసుకోవడము ముఖ్యమైన విషయము.

యోగశాస్త్రము ప్రకారము జ్ఞానము తెలిసినవారిని జ్ఞానియనీ, యోగసాధన చేయువానిని యోగసాధకుడుయనీ, ఆత్మశక్తిని పొందిన వానిని యోగియనుట కలదు. యోగి జ్ఞానులకంటే, తపస్వికులకంటే, యోగ సాధకులకంటే గొప్పవాడని గీతలో ఆత్మ సంయమయోగములో 46వ

శ్లోకమునందు దేవుడే ఇట్లు చెప్పాడు. **'తపస్వి భ్యోధికో యోగి జ్ఞాని భ్యోపి మతోధికః కర్మి భ్య శ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున'** ఇక్కడ అందరికంటే యోగియే అధికుడైనపుడు, యోగిని గుర్తించుటకు మార్గములున్నవా అని యోచించవలెను. ఆ విధముగా యోచించిన బాహ్యావిధానముల వలన అనగా వేష భూషణముల వలన ఎవరూ యోగిని గుర్తించలేరు. చూచిన వెంటనే నిజమైన యోగులను మేము గుర్తించగలమని కొందరు అనుకొను చుందురు. వారు అనుకొన్నట్లు ఏమాత్రము కంటిచూపుకు యోగత్వము గుర్తించబడదు. అటువంటపుడు ఫలానావారే నిజయోగులని, వారినే ఆశ్రయించవలెనని, ఎట్లు గ్రహించగలమని అనుమానము వస్తుంది. దీనికి మనకు గీతాశాస్త్రమే జవాబు చెప్పగలదు. ఆత్మసంయమయోగమను అధ్యాయములో 1వ శ్లో. "అనాశ్రితః కర్మ ఫలం కార్యం కర్మ కరోతియః స సన్న్యాసీచ యోగీచ ననిరగ్నిర్న చాక్రియః" **"కర్మఫలములైన పాపపుణ్యములు తనను ఏమాత్రము అంటకుండా కార్యములను కర్మప్రకారము చేయువాడు నిజమైన సన్న్యాసి, నిజమైన యోగి జ్ఞానాగ్ని లేనటువంటివాడు పనులు చేయకుండా మానుకొన్న వాడు యోగికాడు."** భగవంతుని ఈ వాక్యమును బట్టి ఎవరు యోగులో, ఎవరు యోగులు కాదో తెలుసుకొనుటకు అవకాశము గలదు. అయినప్పటికీ పాపపుణ్యములు తమను అంటనట్లు ఎవరు పనులు చేయుచున్నారో, ఎవరివద్ద జ్ఞానాగ్ని కలదో, మన కంటికి కనిపించు విషయము కాదు. అందువలన యోగులను గుర్తించుట కష్టము. యోగులు తమంతట తాము ఇతరులు తమను గుర్తించునట్లు ప్రవర్తించినపుడు మాత్రమే దేవుడు చెప్పిన సూత్రములను అనుసరించి యోగులను గుర్తించు అవకాశము గలదు.

జ్ఞానమను దానిని ఆచరించి యోగము చేసినపుడు యోగశక్తి లభించగలదని, ఆ యోగశక్తికి (జ్ఞానాగ్నికి) ఇంతటి ప్రభావమున్నదని నిరూపించు యోగులు కూడా గలరు. జ్ఞానము, యోగము, దేవుడు అనునది నమ్మకము మాత్రమే కాదు, నిజముగా నిరూపించగలమని హేతువాదులకు సహితము తెలియజేయు నిమిత్తము నిజయోగులు తమలోని జ్ఞానాగ్నిని ఏదో ఒక సందర్భములో బహిర్గతము చేసి నిరూపింతురు. అటువంటి నిరూపణలు ఏ విధముగా ఉండునంటే ఉదాహరణకు ఒక యోగి ఒక గ్రుడ్డివాని కన్నుల మీద చేయి ఉంచి అంధత్వమును పారద్రోలి చూపు తెప్పించాడనుకొందాము. అతడు ఏ వైద్యము చేయకనే స్పర్శ చేతనే చూపువచ్చునట్లు చేయగలిగాడు. తనలోని జ్ఞానాగ్నిని ఎదుటి వాని అంధత్వమునకు కారణమైన పాపము మీదికి వదలి ఆ పాపము కాలిపోవునట్లు చేశాడు. అందువలన వానికి చూపు నయమైనది. అటువంటి సమయములో అతనిని యోగశక్తి గల యోగిగా గుర్తించగల్గు అవకాశము ఇతరులకున్నది. ముఖ్యముగా గమనించవలసిన విషయమేమంటే! "అటువంటి శక్తియే ఉంటే దేశములో ఉండు గ్రుడ్డి వారినందరినీ యోగులు తమ శక్తితో నయము చేయవచ్చును కదా!" అని అడుగువారు కొందరు ఉంటారు. వారికి మా సమాధానమేమంటే! యోగమాచరించినపుడే యోగశక్తి లభించును. యోగమాచరించునపుడు తమకు ఎంత శక్తి లభించినదో ఏ యోగికి తెలియదు. అది ఏదో ఒక సందర్భములో బయటపడినపుడు తప్ప తమలో శక్తియున్నదనీ కూడా ఏ యోగికీ తెలియదు. ఇక్కడ ఇంకొక ప్రశ్నకూడా మనకు రాగలదు. అదేమనగా! తనలో శక్తియున్న విషయము కూడా తనకే తెలియకపోతే ఆ యోగి ఇతరుల కర్మను కాల్చవలెనని ఎలా అనుకుంటాడు? ఎదుటి వాని రోగమును ఎలా నయము

చేయాలనుకొంటాడు? అని అడుగవచ్చును. దానికి జవాబు ఈ విధముగా గలదు. ఏ యోగి ఇతరుని కర్మను తొలగించాలనుకోడు. ఎందుకనగా! వానిలో ఎంత శక్తి ఉన్నదీ వానికే తెలియదు. ఒకవేళ ఇతరుని కర్మను తొలగించాలనుకొనినా, ఒక రోగమును లేకుండా చేయాలనుకొనినా, రోగమునుగానీ, బాధనుగానీ లేకుండా చేయుటకు ప్రయత్నించినా అపుడు ఆ రోగము నయము కాకుండానో, ఆ బాధ పోకుండానో ఉండుట కూడా జరుగుచున్నది. ఒక్కొక్కరి రోగ విషయములోగానీ, నొప్పి విషయములో గానీ అదే యోగి తాకినా నయమైపోవుట గలదు. యోగి ఒకని చిన్న నొప్పిని లేకుండా చేయాలని పెద్ద ప్రయత్నము చేసినా ఆ నొప్పి పోకుండా నిలబడి చివరకు నాలోనే శక్తిలేదేమోనను అనుమానమును యోగికి కల్గునట్లు చేయును. ఒకప్పుడు అదే యోగి చిన్న ప్రయత్నము చేసినా పెద్ద రోగము సహితము పూర్తి నయమైపోవును. అలా జరుగుటకు కారణమేమనిన?

యోగి సంపాదించుకొన్న యోగశక్తి యోగిదే అయినా అది శరీరములో శరీరమునంతటికి యజమాని అయిన ఆత్మ ఆధీనములో ఉండును. ఆత్మ ఆధీనములోనిది కావున దానిని ఆత్మశక్తి అనికూడా అంటున్నాము. ఒక మనిషి రోగముగానీ నొప్పిగానీ పోవాలని యోగి శరీరములోని జీవాత్మ (యోగి) అనుకుంటే ఆ విషయము యోగి శరీరములోని ఆత్మ నచ్చితే తన ఆధీనములోని శక్తిని విడుదల చేసి ఎదుటివాని కర్మను కాల్చివేయును. ఒకవేళ యోగి ఆత్మకు నచ్చకపోతే తన ఆధీనములోని శక్తిని విడుదల చేయదు. అపుడు బయట యోగి ప్రయత్నించినా అది జరుగదు. అందువలన యోగులవద్ద కొందరి కర్మపోయినా కొందరి కర్మమాత్రము పోదు. లోపలి ఆత్మవిషయము తెలిసిన

యోగులు బయటి రోగుల విషయమును ఎక్కువగా పట్టించుకోరు. ఒక్కొక్క సమయములో పైన తాను (యోగి) ఊరకున్ననూ, తనలోని ఆత్మప్రేరేపణ జరిగినపుడు యోగి అపుడు ఏమి చేసినా ఎదుటివాని నొప్పిగాని, రోగము గాని సులభముగా పోగలదు. ప్రపంచములో జ్ఞానమునకు ఇంతటి శక్తియున్నదని నిరూపించు నిమిత్తము ఆత్మ ప్రేరేపణ చేతనే ఏ విధ వైద్యము లేకుండా రోగము పోవుట జరుగుచున్నది. మనుషులు యోగులుగా మారుటకు శక్తిని గురించి తెలియుటకు ఇటువంటి సంఘటనలు జరుగుచుండును. ఒక యోగి అజ్ఞానములోని మనిషిని యోగిగా తయారగుటకు, వాని కర్మను వాడు నిరోధించకల్గు యోగశక్తిని సంపాదించు కొనుటకు జ్ఞానము తెల్పును.

నిజయోగులు ఎదుటి వ్యక్తిని యోగిగా మార్చి, వానికి కూడా ఆ శక్తి చేకూర్చు గురువులుగా ఉన్నారు. కష్ట సుఖములకు కారణమైన కర్మను కాల్చివేయుటకు తగిన జ్ఞానాగ్నిని సమకూర్చుకొనుటకే శిష్యులు గురువులను ఆశ్రయింపవలయును. ఆ శక్తిని సంపాదింపజేసి జ్ఞానాగ్ని ప్రకాశములో తమంతటివానిగా చేయుటయే గురువుల ధ్యేయమై ఉండవలెను. అట్లుకాక ఉపదేశమిచ్చుటే గురువుల కార్యమని, దానిని తీసుకొని సాధన చేయుటే శిష్యుల కార్యమని అనుకొనిన జీవితమే వృథా అగును. జ్ఞానశక్తి లభించని సాధన జీతములేని ఉద్యోగములాంటిది. శక్తి లేని గురువులు దేవుడు చెప్పిన సూత్రము ప్రకారము యోగులేకాదు.

నేటి కాలములో కొందరు శిష్యులు శక్తిని బట్టి గురువులను ఆశ్రయించుటలేదు. ఏ గురువుకైతే విమానములు ఉన్నాయో, ఏ గురువుకైతే గొప్ప ఆస్తులున్నాయో, ఎవరి వద్దయితే కొన్ని కోట్ల డబ్బు ఉందో వారినే

గొప్ప యోగులుగా తలచుచున్నారు. ఉదాహరణకు ఎక్కడ ఏ డాక్టరు వద్ద నయముకాని రోగిని ఒక బీద యోగి తన హస్తము తాకిడి చేతనే నయము చేసినప్పటికీ దానిని మంత్ర ప్రభావముగా, ఆ యోగిని ఒక మాంత్రికునిగా తలుస్తారు. ఏ నిరూపణ చేయకుండినప్పటికీ డబ్బు స్థోమత కల్గి ఉండి, విదేశాలకు పోయి బోధ చెప్పి వచ్చినంతమాత్రమున వాని వద్ద జ్ఞానాగ్ని ఉన్నదా లేదా అని తలచక, అతనినే గొప్ప యోగిగా తలుస్తారు. ఇక్కడ డబ్బు గలవాడు బోధ చెప్పినంతమాత్రమున యోగిగా, గురువుగా లెక్కింపబడుచున్నాడు. డబ్బు లేకుండినా జ్ఞానము గల బోధ ఉండినప్పటికీ, సంపూర్ణశక్తి ఉండినప్పటికీ అటువంటి వారిని మాంత్రికులుగా తలచు చున్నారు.

ముఖ్యముగా దేవునియందైక్యమై జన్మరాహిత్యమును కోరు మోక్షాసక్తులే యోగులని, తమలోని జ్ఞానమును ఉపయోగించి తెలుసు కొనుటకు ప్రయత్నించవలెను. **'యథైథాంసి సమిద్ధోగ్ని ర్భస్మసాత్కురు తేర్జున జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా'** అను భగవానుని వాక్యానుసారము కర్మను కాల్చి యోగులుగా నిరూపణ పొందినవారే నిజయోగులు. యోగసిద్ధాంతము ప్రకారము నేడు కూడా అటువంటి వారే యోగులు. అటువంటి యోగులే నిజగురువులు.

తాము ఆశ్రయించిన గురువువద్ద శక్తి ఉన్నదో లేదో ఏమాత్రము యోచించకనే ఇతర గురువులను తక్కువవారని హేళనగా మాట్లాడకూడదు. ఎక్కువ తక్కువలు యోగశక్తిని బట్టి ఉండును, కనుక ఆ శక్తి యొక్క వివరము తెలియనివారు ఏ గురువులను తక్కువగా అంచనా వేయకూడదు.

*****

# తపస్సు - యోగము

నేటి ప్రపంచములో దేవుడున్నాడు అను నమ్మిక కలవారు చాలా మంది ఉన్నారు. ఆ నమ్మిక ఉన్నవారు అనేక విధముల తమ భక్తిని దేవునికి చూపుచున్నారు. శ్రద్ధను అనుసరించి వారు దేవుని ఎడల భక్తి చూపు విధము కూడా నిర్ణయించబడి ఉండును. ప్రపంచములో మానవులు అనేక రకాల శ్రద్ధాయుతులుగా ఉన్నారు. కావున వారు అనుసరించు భక్తిమార్గము కూడా అనేక రకాలు ఉండును. కొందరు మంత్రయుక్తమైన పూజలు చేయుచుందురు. కొందరు తమతమ ఇష్టదైవములను ఆరాధించు చుందురు. మరికొందరు యజ్ఞములు చేయుచుందురు. ఇంకా కొందరు తపస్సు చేయువారు కూడా ఉన్నారు. కొందరు యోగమును ఆచరించు వారూ ఉన్నారు. ఇంకా ఎన్నో విధానములలో మానవులు దైవము ఎడల భక్తిని చూపుచున్నారు. అందరూ ఒకే మార్గమును అనుసరించక అనేక మార్గములను అనుసరించుటకు వానియొక్క శ్రద్ధ, కర్మలే కారణము. పూర్వ జన్మమున ఎవడు చేసుకొన్న పుణ్యఫలమును మరియు శ్రద్ధలను బట్టి వానికి ఈ జన్మయందు భక్తిమార్గములో అనుసరించు విధానము కూడా నిర్ణయింపబడి ఉండును. సకల మానవులకు దైవము ఒక్కడే అయినా ఆయనను తెలుసుకొనుటకు అనేక మార్గములు ప్రపంచములో ఉన్నవి. నానా విధపూజలు, క్రతువులు, తపస్సులు, యోగములు అనేకము ఆయనను తెలుసుకొను నిమిత్తమై ఉన్నవి. ప్రతి మానవుడు చేయు చిన్నపూజ సహితము ఆయనకే చేరుచున్నది. సకల పూజలకు భోక్త ఒక్క పరమాత్మయే అయినా మానవులు ఆచరించు భక్తి విధానములు ఇన్ని రకములుగా ఉన్నాయి. కావున వాటియందు ఏ విధానము మంచిదో తప్పక తెలుసుకొని ప్రవర్తించవలయును. అట్లుకాక అందరు నడిచే మార్గముననే నేను

పోవుచున్నానంటే దాని గమ్యము దూరమో? లేక దగ్గరో? ఏ విధానమైన మనము ఆచరించు భక్తి పరమాత్మకే చేరును. కానీ దానివలన పొందు ఫలితము అనేక విధములైన స్థాయిలలో ఉండును. ఎవరు ఏ విధముగా ఆచరించుచుందురో వారికి ఆ విధరూపముతోనే పరమాత్మ వారి పూజలు స్వీకరించి ఫలితమునిచ్చును. ఆరాధనలు ఎన్ని అయినా, ఏ రూపమైనా అన్నిటికీ ఆది పురుషుడు ఒక్కడే. కానీ ఆరాధించు వారికి లభించు ఫలితములు వ్యత్యాసములుకల్గి ఉన్నవి అన్నాము కదా! వాటి వ్యత్యాసము లను మొదట రెండు రకములుగా విభజింపవచ్చును. రెండు రకములు ఏవి అనగా! ఒకటి కామ్యార్థ సిద్ధి, రెండు మోక్షసిద్ధి. ప్రపంచములో ఈ రెండు ఫలితములందు మొదటిదైన కామ్యార్థసిద్ధిని కోరువారే నూటికి తొంబైతొమ్మిది పాళ్లు ఉన్నారు. మిగిలిన ఒక్క పాలులో కూడా మోక్షసిద్ధిని కోరువారు మిక్కిలి అరుదుగా ఉందురు. తెలిసిన జ్ఞానులు మోక్షసిద్ధిని గురించి చెప్పినప్పటికీ దానితో మాకు ఏమి పని? ప్రపంచములో అన్ని విధములుగా సుఖ జీవనము గడుపుటకు దేవుని ఆరాధించితే చాలు, అంతకంటే ఇంకేమి కావలయును అనువారు చాలామంది ఉన్నారు. కామ్యార్థసిద్ధిని కోరి చేయు ఆరాధనలు కూడా అనేక రకములై ఉన్నాయి. అందువలన కామ్యార్థసిద్ధిని కూడా మానవులు అనేక విధములుగానే పొందుచున్నారు. కొంతమంది మానవులు తాము కోరుకున్న కోర్కెలు ఈ జన్మలోనే నెరవేరునని అనుకొనుచుందురు. అట్లు ఎప్పటికీ జరుగడము లేదు. ప్రతిజీవుడు కోరుకున్న కోర్కెలు మరుజన్మమున నెరవేరుచున్నవి. కామ్యార్థసిద్ధి శీఘ్రముగా ఫలితమిచ్చును. అనగా మరుజన్మమందే నెరవేరును. మోక్షసిద్ధి అట్లుకాక కొన్ని జన్మల వరకు కూడా లభించక పోవును.

మోక్షసిద్ధిని కోరి పరమాత్మను ఆరాధించువారు కొంతమందే దేశములో ఉన్నారు. కామ్యార్థసిద్ధిని కోరి ఆచరించువారు ఎక్కువమంది ఉండి, మోక్షసిద్ధిని కోరి ఆచరించువారు కొద్దిమందే ఎందుకు ఉన్నారు? మోక్షమును పొందవలయునని అందరూ ఎందుకు అనుకోవడము లేదు? అని కొందరికి అనుమానము రావచ్చును. దానికి సమాధానము ప్రపంచములో భక్తి కలిగిన వారు చాలామంది ఉన్నారు. కానీ వారి భక్తి క్షుద్రదేవతలను మొదలుకొని మహాదేవతల వరకు చూపబడుచున్నది. కొందరు పెద్దమ్మ, సుంకులమ్మ, కాళికా మొదలగు ఆడ దేవతలను ఆరాధించువారు, మరికొందరు ఇంద్రుడు, చంద్రుడు మొదలుకొని విష్ణు, ఈశ్వర, బ్రహ్మవరకు ఆరాధించువారు ఉన్నారు. ఎంతమంది దేవతలు ఉన్నారో ఆ దేవతలకంటెను అనగా దేవతలందు అగ్రగణ్యులైన విష్ణు, ఈశ్వర, బ్రహ్మలకంటెను అతీతుడుగనున్న మరియు అందరి దేవతలందు కూడా అంతర్యామియై ఉన్నవానిని ఎవరూ గ్రహించక ఉన్నారు. పూర్వ జన్మమున భక్తిమార్గములో విశేషమైన జ్ఞానమును ఎవరు సంపాదించుకొని ఉందురో వారికి మాత్రమే దేవతలందరికంటే అతీతుడైన దేవుడు ఉన్నాడను విషయము తెలియుచున్నది. అట్లు తెలిసినవారు మాత్రమే దేవదేవుడైన పరమాత్మను ఆరాధించుచుందురు. పరమాత్మను ఆరాధించువారే మోక్షసిద్ధిని కోరి ఆచరించువారని చెప్పవచ్చును. దేశములో భక్తి మార్గమున పుణ్య ఫలితము తక్కువ ఉన్నవారే ఎక్కువగా ఉన్నారు. కాబట్టి వారివారి పుణ్యఫలితములకు సమానమైన దేవుడినే నమ్మి ఆరాధించుచున్నారు. అందువలన దేశములో దేవతలను ఆరాధించువారు చాలామంది ఉన్నారు. అనగా కామ్యార్థసిద్ధిని పొందువారు అధికముగా ఉన్నారని చెప్పవచ్చును.

అందరికి అతీతుడై, ఎప్పటికీ నాశనము లేనివాడై విష్ణు, ఈశ్వర, బ్రహ్మ మొదలగు దేవతలే ఆరాధించు పరమాత్మ ఒకడున్నాడను విషయము తెలియుటకే ఎన్నో జన్మల పుణ్యఫలితము అవసరము. పుణ్యఫలవిశేషము వలన పరమాత్మ విలువ తెలుసుకొన్న తర్వాత, ఆయనను ఆరాధించి పరమాత్మను పొందుటకు వారియొక్క శ్రద్ధను బట్టి ఉండును. పరమాత్మను ఆరాధించుచుండినను కొందరు అనేక జన్మలకు, కొందరు కొన్ని జన్మలకు, కొందరు ఒకే జన్మలోనే మోక్షమును పొందుచున్నారు. పరమాత్మను ఆరాధించు బుద్ధి పుట్టుటకు అనేక జన్మల పుణ్యఫలము అవసరమన్నాము కదా! దేశములో పుణ్యఫలము ఎక్కువ ఉన్నవారు చాలా అరుదుగా ఉన్నారు. కావున మోక్షమును ఉపేక్షించి పరమాత్మను ఆరాధించువారు కూడా అరుదుగనే ఉందురని చెప్పవచ్చును.

దేశములో ఎవరు ఏ విధానమును భక్తి మార్గములో ఆచరించు చున్నారో వారు ఆ విధానమే గొప్పదని అనుచున్నారు. అన్ని విధముల ఆచారములకు నాయకుడు ఒక్కడేనని గ్రహించలేకున్నారు. కొందరు మతములుగా విభజించుకొని మా మతము, గొప్ప మా మతము గొప్ప అని వాదించుకొనుచున్నారు. అన్ని మతములకు యజమాని ఒక్కడే అని గ్రహించలేక ఉన్నారు. అట్లే పూజలు చేయువారు, హోమములు చేయువారు, తపస్సు చేయువారు మేమే గొప్ప అనుకొనుచున్నారు. ఇవి అన్నియు పరమాత్మ ఎడల సాధనములై ఉన్నవి. కానీ ఏ సాధనముచేత మనము కడతేరవచ్చునో మానవులమైన మనము తప్పక తెలుసుకోవలయును. ఈ విషయము ఉద్దేశించి భగవద్గీతయందు విశ్వరూప సందర్శన యోగములో భగవంతుడు మరియు పరమాత్మ :-

53వ శ్లో. **'నాహం వేదైర్న తపసా నదానేన నచేజ్యయాశక్య ఏవం విధో ద్రష్టుం ధృష్ట వానసి మాం యథా'** అర్జునా? వేదముల చేతనైనా, దానముల చేతనైనా, యజ్ఞములవల్లనైనా, తపస్సులవల్లనైనా ఇపుడు నీవు చూచిన ఈ విశ్వరూపమును చూడవలయునన్న శక్యము కాదు'

***48వ శ్లో. 'నవేద యజ్ఞాధ్యయనైర్న దానైర్న చక్రియాభిర్న తపోభిరుగ్రైః***
***ఏవం రూపశ్యక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర!***

*'అర్జునా! వేదమంత్రముల ఉచ్చాటన వలన గానీ, వివిధ రక యజ్ఞముల వలన గానీ, దానములవలన గానీ, ఉగ్రమైన తపస్సుల వలన గానీ, నన్ను తెలుసుకొనుటకు లోకములో శక్యము గాదు. అటువంటి నా రూపమును నా అనుగ్రహము వలన నీవు చూడగల్గితివి'* అని పరమాత్మ పల్కి ఉన్నాడు. అందువలన దేశములో మనము ఆచరించు వివిధ ఆరాధనలైన, వేదములను కంఠాపాఠము చేసుకొని ఆధ్యయనము చేయుటవలన గానీ, దానములవలన గానీ, యజ్ఞములవలన గానీ, ఉగ్రమమైన తపస్సుల వలన గానీ పరమాత్మను తెలుసుకొనుటకు పొందుటకు ఏమాత్రము వీలుపడదని తెలియుచున్నది. ఈ మాటతోనే చాలామందికి బాధ కలుగవచ్చును. ఎందుకనగా! వారు చేయు ఆరాధనలు చిన్న పూజలు మొదలుకొని హోమములు, తపస్సుల వరకు ఉండును. తపస్సు గొప్పగా చేయువారు కూడా నన్ను తెలుసుకొనుటకు అనర్హులు అని భగవంతుడే పలికితే బాధకాక ఏమి పుట్టును? భగవంతుడు మనలను బాధ పెట్టుటకు ఈ మాట పలికి ఉండలేదు. మనము సరైన మార్గములో నడచి, తనను తెలుసుకొను నిమిత్తమై పరమాత్మ ఆ విధముగా పలికి ఉన్నాడు. "తపస్సుల వలన నన్ను తెలుసుకొనుటకు శక్యము కాదు"

అన్నాడంటే వేరే విధానము ఏదో ఒకటున్నదని తెలుస్తూనే ఉన్నది. ఆ విధానమేదో పరికించి చూచెదము.

దేశములో అన్నిటిని మించినది తపస్సని చాలామందికి అభిప్రాయము ఉండవచ్చును. అటువంటి వారు ఇంకా వేరు విధ అభిప్రాయములు కలవారు దేశములో ఉన్నారను ఉద్దేశ్యముతోనే భగవానుడు గీతాశాస్త్రములో ఆత్మ సంయమయోగమున..

*46వ శ్లో.* *తపస్విభ్యోధికో యోగి జ్ఞానభ్యోపిమతోధికః*
*కర్మభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున!*

అర్జునా! **'యోగి తపస్సు చేయువారికంటే ఉత్తముడు, జ్ఞాన వంతునికంటే ఘనుడు మరియు కర్మలు చేయువారికంటెను అధికుడు అందువలన నీవు కూడా యోగివికమ్ము'** అన్నాడు.

దీనితో అందరికంటే ఉత్తముడు యోగి అని, అన్ని అభ్యాసముల కంటే యోగాభ్యాసమే పరమాత్మను తెలుసుకొనుటకు శ్రేయస్కరమైనదని తెలియుచున్నది. ఎవరు చెప్పినప్పటికీ మానవులు వినరని గీతయందు పై వాక్యమును భగవంతుడే స్వయముగా తెలియజేసినాడు. ఇక్కడ కొందరికి అనుమానమొచ్చి 'తపస్సు చేయువారికంటే యోగి ఉత్తముడని, భగవంతుడు తెలియజేసినాడు కదా! మరియు జ్ఞానియు యోగికంటే తక్కువవాడని తెలియజేసినాడు కదా! జ్ఞాని వేరు యోగి వేరునా? మరియు తపస్వికి యోగికి ఏమి భేదముండును?' అని అడుగవచ్చును. దానికి సమాధానము జ్ఞాని అనగా పరమాత్మ యొక్క సాధన విషయములు తెలుసుకొన్నవాడు అని అర్థము. అజ్ఞానము అనగా తెలియనితనము అని అర్థము. ఒక ఊరికి పోవు దారిని తెలుసుకున్నంత మాత్రమున ఊరు చేరిన దానితో

సమానమెట్లగును? అట్లే పరమాత్మను పొందు విషయములు తెలుసుకున్నంత మాత్రమున పొందినవాడెట్లగును? పాలు పెరుగుగా తర్వాత వెన్నగా ఆ తర్వాత నెయ్యిగా మారును అని తెలుసుకొన్నంత మాత్రముననే నెయ్యి అగునా? కాదు. పాలను కాచి పెరుగుగా పేరపెట్టి, తర్వాత చిలికి వెన్నగా చేసి, ఆ తర్వాత అగ్నిచేత వేడి చేసిన నెయ్యిని చూడవచ్చును. అట్లే ప్రపంచములో పరమాత్మను తెలుసుకొను మార్గములను తెలుసుకున్నంతనే పరమాత్మను పొందినాము అంటే, అద్దమునందు కనిపించు వస్తువును పట్టుకున్నాము అన్నట్లుండును. అందువలన జ్ఞాని అయినంత మాత్రముననే యోగికాలేడని భగవంతుడు తెలిపియున్నాడు. యోగి అనగా ఆత్మయందు కలసినవాడు అని అర్థము. విధానము తెలిసినంత మాత్రముననే ఎవ్వడూ యోగి కాలేడు. తనకు తెలిసిన దైవవిధానములను ఆచరించువాడే చివరకు యోగిగా మారును. కావున యోగి జ్ఞానికంటే ఉత్తముడని చెప్పవచ్చును.

తపస్సు చేయువారికంటే యోగి ఉత్తముడని భగవంతుడు తెలియ జేసినాడు. అట్లు ఎందుకు తెలియచేసినాడనగా! యోగికి తపస్వికి చాలా భేదమున్నది. తపస్సు అనగా తపించడము. ఒక వ్యక్తి తపస్సు చేయు చున్నాడనగా ఆ వ్యక్తి ఏదో ఒక దేవుని ఆకారమును చూడవలయునను నిమిత్తమో లేక ఒక మంత్రమును మనస్సునందు లయము చేసుకొని దానికోసము తపించడమో అయి ఉండును. ఇంకా కొందరు మనస్సు ఒకచోట కేంద్రీకరించి కనపడు దృశ్యముల కోసము తపించుచున్నారు. మొత్తము మీద జీవుడు ఇంద్రియములకు కనుపించు వాటి మీద కానీ, తనకంటే ఇతరములైన వస్తువుల మీద కానీ, దేవుళ్ల మీద కానీ తపించడమును తపస్సు అని అనవచ్చును. అనేకులు పూర్వము తపస్సుచేసి వారి ఇష్టములను దేవతలచేత పొందినారు. జన సమూహములందుండిన

వారి తపమునకు భంగము కలుగునని మానవ సంచారములేని అడవులకు పోయి పూర్వము తపస్సు చేసుకొనెడివారు. పూర్వము చాలామంది కోర్కెలను నెరవేర్చుకొను నిమిత్తము తమ ఇష్ట దైవమును దృష్టియందు పెట్టుకొని తపించి తపించి కొంతకాలమునకు తపస్సు ఫలించగా వారి కోర్కెలను నెరవేర్చుకొనెడివారు. అర్జునుడు పాశుపతాస్త్రము కోసము శివుని తపించినాడు. విశ్వామిత్రుడు కూడా కొంతకాలము బ్రహ్మాస్త్రము కోసము తపించినట్లు చరిత్రలో తెలియుచున్నది. తపస్సు వలన మోక్షసిద్ధిని పొందలేము, కామ్యార్థసిద్ధిని పొందవచ్చును. అందువలననే భగవంతుడు 'తపస్సు వలన నన్ను పొందుటకు శక్యముకాదు' అని తెలియజేసినాడు. తపస్వికంటే పరమాత్మ మార్గమును తెలుసుకొన్న జ్ఞానియే ఉత్తముడని చెప్పవచ్చును. తపస్సు వలన పొందెడి ఫలము అనుభవించిన వెంటనే అయిపోవును. జ్ఞానము అట్లుకాక మరుజన్మమందు కూడా పరమాత్మ మార్గమునే చూచించును. కావున తపస్వికంటే జ్ఞానియే ఉత్తముడని చెప్పవచ్చును. తెలిసిన వానికంటెను పొందినవాడు ఇంకనూ శ్రేయస్కరుడు, కావున జ్ఞానికంటే యోగి అధికుడని చెప్పవచ్చును. ఒక్క యోగి మాత్రము తన దేహమందున్న ఆత్మను యోగముద్వారా తెలుసుకొనుచున్నాడు. మిగతా వారు ఎవ్వరూ తెలుసుకొనుటకు వీలులేదు. అందువలన భగవంతుడు గీతాశాస్త్రమున పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయములో...

*11వ శ్లో.* *యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్య వస్థితమ్,*
*యతన్తోప్యకృతాత్మానో నైనం పశ్యన్త్య చేతసః*

**"ప్రయత్నము చేయు యోగులు మాత్రము దేహమందున్న ఆత్మను తెలుసుకోగలరు. మిగతావారు ఎంత ప్రయత్నించిననూ తెలుసుకోలేరు"**

అని అన్నాడు. అందువలన ప్రపంచములో ఆత్మను తెలుసుకొనుటకు ఉత్తమమైన మార్గము యోగమే అని అన్ని విధములా తెలియుచున్నది. ఏదైనా పరిశోధించి తెలుసుకొనుట మానవుల కర్తవ్యము. మా అనుభవములో తపస్సునే గొప్పగా భావించుకొనువారు చాలామంది తటస్థించినందున తపస్సుకంటే యోగము మించినదని విశదీకరించి తెలియజేయడమైనది. కావున తపస్వికులైన గానీ, జ్ఞానులైనగానీ మమ్ములను కించపరిచినారని అభిప్రాయపడక వాస్తవమును తెలుసుకోవలయునని తెలుపుచున్నాము.

మరియొక మాట 'కర్మి భ్యశ్చాధికో యోగి' అని భగవంతుడు ఆత్మ సంయమయోగములో పలికినాడు కదా! కర్మను ఆచరించుచూ కర్మను సన్న్యసించి వాటివలన వచ్చు పాపపుణ్యములను పొందక పోవచ్చును కదా! అదియు కర్మయోగమే కదా! మరి కర్మలు చేయువారికంటే యోగి అధికుడన్నారు కదా! ఎట్లు? అని కొందరడుగవచ్చును. ఆ మాటను నేను ఒప్పుకొందును. కానీ ఇక్కడ తెలుసుకోవలసిన రహస్యము ఒకటున్నది. అది ఏదనగా కర్మను ఆచరించుచూ, అందువచ్చు పాపపుణ్యమును పొందకపోవుట కూడా యోగమే. అట్టి వానిని కర్మయోగి అందురు. ఆత్మసంయమ యోగములో ఆత్మయోగి గురించి భగవంతుడు తెలియ జేసినాడు. కర్మయోగికంటే ఆత్మయోగి అధికుడు. యోగులందు కూడా చిన్న పెద్ద ఉన్నారని ముందే తెలుసుకున్నాము. సర్వ యోగులందు కూడా ఎన్నో తారతమ్యములు కలిగి ఉన్నారు. కావుననే భగవంతుడు గీతా శాస్త్రములో అక్కడక్కడ **'సర్వ యోగులందు నాకు ఫలానా వారు ఉత్తములు, ఈ విధముగా ఉన్న వారిని నేను శ్రేష్ఠులని తలంచుచుందును'** అని అన్నాడు. మరియు ఆత్మసంయమ యోగములో ఆఖరున **'సర్వ యోగులందు ఎవడు**

**సంపూర్ణముగా అంతరాత్మలో నన్నే ఆశ్రయించి శ్రద్ధ కలిగి నన్నే ఆరాధించు చుండునో వాడే ఉత్తముడని తలంచుచున్నాను'** అని తెలియజేసినాడు. కావున యోగులందు కూడ చిన్న పెద్ద ఉన్నారని చెప్పవచ్చును. కర్మయోగుల కంటే ఆత్మయోగి ఎందుకు అధికుడు అన్న విషయమును తెలుసుకొందాము.

కర్మయోగము ఆచరించి చేయుచున్న కార్యములందలి పాప పుణ్యములు ఆ జీవునకు ఏమాత్రము అంటవు. కానీ పోయిన జన్మలో చేసుకొని ఉన్న పాపపుణ్యములను అనగా ప్రారబ్ధమును తప్పక అనుభవింప వలసి ఉండును. బురదలో దూరిన కుమ్మరి పురుగుకు బురద అంటకుండునట్లు, కర్మయోగి కర్మలు ఆచరించినను ఆ కర్మ యందలి పాపపుణ్యములు ఆ జీవునికి అంటకుండును. ఆ జన్మలో కర్మను కర్మయోగము చేత సంపాదించకుండా ఉండవచ్చును. కానీ పోయిన జన్మములయందు సంపాదించుకొన్న కర్మను కర్మయోగము చేత పోగొట్టుకోలేడు. కర్మయోగము యొక్క శక్తి ఆ జన్మలో వచ్చు కర్మను జయించుటకు మాత్రమే ఉపయోగపడును. వెనుకటి జన్మలందు మనము చేసుకున్న పాపపుణ్యములను పోగొట్టుకోవలయునంటే ఒక్క ఆత్మయోగము చేతనే సాధ్యమగును. ఆత్మయోగము చేత ఆ జన్మ కర్మను అంటకుండా ఉండవచ్చును. మరియు వెనుకటి జన్మలందు సంపాదించుకొన్న కర్మను జ్ఞానాగ్నిచేత కాల్చివేయవచ్చును. వీటన్నిటినీ పరికించి చూచిన కర్మములు చేయువారికంటే యోగి అధికుడని భగవంతుడు ఎందుకు పలికినది అర్థమగును.

పవిత్రమైన మానవ జన్మలోనికి వచ్చిన జీవులారా! మీలో అంటియున్న అహమును విడిచి ఇప్పటి వరకూ నమ్ముకున్న మార్గములను

విడిచి అత్యుత్తమమైన యోగమార్గమున అతివేగముగ ప్రయాణించి పరమ పదమును పొందవలయునని మీకు తెలుపుచున్నాము. నేటి నా మాట నమ్మకుండిన ఆనాటి భగవంతుని మాటైనా నమ్మి సరైన మార్గమును చేరుకొందురని అనుకుంటున్నాను.

*****

## మంత్ర శక్తి

నేడు ప్రపంచములో మాంత్రికులు కూడా ఉన్నారు. మంత్రమునకు ప్రభావమున్నదని నిరూపించుచున్నారు. యోగులను చూచి మీరు చేయు చున్న అభ్యాసము కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లు ఉన్నది. ఎంతో కష్టపడితే కానీ కొద్ది ఫలితము కూడా ఉండదు. అదే అభ్యాసము మేము చేయుచున్న విధానముతో చేసిన మీరు తొందరగా ఫలితమును పొంద వచ్చును. పొందినట్లు ఇతరులకు నిరూపించవచ్చునని యోగమునే కించపరుస్తూ, యోగాభ్యాసకులనే పనికిరాని పని చేయుచున్న వారిగా భావించి పలుకుచున్నారు. దానితో కొందరు యోగాభ్యాసపరులు కూడా వారు చెప్పునది నిజమేనని నమ్మి తొందరగా ఫలితమిచ్చు మంత్ర మార్గమునే అనుసరించుచున్నారు. ఇది అంతయూ గమనించిన ఎడల యోగశక్తికి, మంత్రశక్తికి గల భేదము ఏమిటి? అన్న విషయము తెలియక పోవుట వలన మరియు యోగమంటే ఏమిటి? మంత్రమంటే ఏమిటి? అను విషయము తెలియకపోవుట వలన కొందరు యోగభ్రష్టులగుచున్నారని తెలియుచున్నది. అందువలన మంత్రములను మంత్రశక్తిని గురించి చెప్పదలచుకున్నాను.

కొన్ని ఇటుకలను సేకరించి వరుసగా పేర్చుచూ పోయిన చివరకు ఒక గృహము తయారగును. అట్లే ఒక యంత్రమును తయారు చేసుకొనుటకు కొన్ని ఇనుపముక్కలను సేకరించవలెను. పుస్తకమును తయారు చేయుటకు కొన్ని కాగితములను సేకరించవలెను. కొన్ని ఇటుకల కూడలినే గృహమనుచున్నాము. కొన్ని ఇనుపముక్కల కూడలినే యంత్రమనుచున్నాము. కొన్ని కాగితముల కూడలినే పుస్తకమనుచున్నాము. ఒక్కొక్క వస్తువును తయారుచేయుటకు దానికి సంబంధించిన కొన్ని ముక్కలను కూర్చి పేర్చినట్లు, ఒక్కొక్క కార్యమును సాధించుటకు ఒక్కొక్క విధ మంత్రముల కూర్చి పేర్చవలెను. ఇక్కడ కొందరికి బయట వస్తువులను చేర్చి ఒక రూపమేర్పరచి కార్యముల సాధించవచ్చును, కానీ మంత్రముల వలన కార్యములను చేయుట ఎట్లు? అను సంశయము బయలు దేరవచ్చును. దానికి సమాధానము ఏమనగా!

మంత్రమనగా ఒక నిర్ణీత శక్తి యుక్తమైనది. మంత్రము కొన్ని అక్షరములతో కానీ లేక ఒక్క అక్షరముతో కానీ ఉండునది. అక్షరముల మిశ్రితమును బట్టి లేక అక్షరమును బట్టి ఆ మంత్రమునకు ప్రభావ ముండును. ఉదాహరణకు 'రం' అనునది ఒక మంత్రము 'హ్రీం' అనునది ఒక మంత్రము. అట్లే కొన్ని అక్షరముల కూడలి అయిన 'శ్రీం హ్రీం క్లీం ఐం రం' అనునవి ఒక మంత్రము. ఇట్లు అనేక అక్షర సమ్మేళనములలో ఎన్నియో మంత్రములు ఉన్నవి. ఒక్కొక్క రకమైన మంత్రమునకు ఒక్కొక్క రకమైన శక్తి ఉండును. ఆ శక్తి ఏ విధమైనదో తెలుసుకున్నవారు ఆ శక్తిని సంపాదించుకొని, దానికి సంబంధించిన పనిని పూర్వము నెరవేర్చు కొనెడివారు. మంత్రశక్తిని వారు ఎట్లు సంపాదించుకొన్నారని మనము అనుకోవచ్చును. అదెట్లనగా ఉదాహరణకు కొన్ని అక్షరములతో కూడిన

మంత్రము మారణమంత్రము అనబడును. ఆ మారణమంత్రమును కొన్ని నియమముల ప్రకారము నిర్ణీతమైన సంఖ్యలో మనస్సుతో ఉచ్ఛాటన చేసిన ఆ మంత్రమునందలి శక్తి అంతయూ ఒక కూడలిగా ఏర్పడి అది మారణము చేయు ప్రభావము గలది అగును. ఆ మంత్ర ప్రభావము ఉచ్ఛాటన చేసిన వానియందు నిగూఢమై నిలిచిపోవును. అట్లు మంత్రప్రభావమును సంపాదించుకొనుటనే మంత్రసిద్ధి అని అందురు. ఆ సిద్ధి పొందిన వ్యక్తి తిరిగి ఆ మారణమంత్రమును ఉచ్ఛరించుకొని ఎవనిమీద దాని ప్రభావము చూపవలయునని సంకల్పించుకొనునో, వానిమీద అది ప్రసరించి వానిని మరణము చేయుచున్నది. ఒక్క మారణమునే కాక అనేక విధ కార్యములను మంత్రప్రభావములతో పూర్వము కొందరు చేసినట్లు తెలియుచున్నది. పూర్వము మంత్ర ప్రభావములతో వినియోగించు ఆయుధములను **'అస్త్రములు'** అని అనుచుండిరి. పూర్వము **నాగాస్త్రము, బ్రహ్మాస్త్రము** అను నానావిధ అస్త్రములు ఉండినట్లు తెలియుచున్నది. ఒక్కొక్క అస్త్రము మంత్ర ప్రభావముతో కూడుకొని ఉండును. ఆ ప్రభావమును బట్టి ఫలితముండును. కావున అన్నింటికంటే ఎక్కువ ప్రభావము కలిగినది **'బ్రహ్మాస్త్రము'** అని చరిత్రలో తెలియుచున్నది. రాముడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించినట్లు, కర్ణుడు అర్జునునిపై నాగాస్త్రము ప్రయోగించినట్లు తెలియుచున్నది. వారు ఆనాడు ధనస్సుకు ఒక బాణము సంధించి విడిచి ఇది సహస్రమారణాస్త్రము, ఇది వెయ్యిమందిని చంపునని చెప్పెడివారు. ఒక బాణము వెయ్యిమందిని ఎట్లు చంపునని అనుమానము రావచ్చును. దానికి సమాధానము! విడిచిన ఒక్క బాణము మంత్ర ప్రభావమువలన వెయ్యిమందిని చంపెడిది. అస్త్రము ఒక్కటైన ఫలితము వెయ్యిమందిని చంపుట, వెయ్యిమందిని చంపేశక్తి ఆ సమయములో ఆ పుల్ల (బాణము) నందు నిగూఢమైయున్నది.

పూర్వకాలము నుండి నేటివరకు మంత్రములు నానావిధ ప్రభావములుకలవై ఉన్నవి. పాముకు ఒక విధ మంత్రము, తేలుకు ఒక విధ మంత్రము, దయ్యములకు ఒక విధ మంత్రము, మారణమునకు ఒక విధ మంత్రము ఇట్లు అనేక విధ మంత్రములు నేటికినీ ఉన్నవి. ఒక్కొక్క విధ మంత్రమునకు ఒక్కొక్క విధ ఆచారముండును. ఆ ఆచార ప్రకారము ఉండిననే ఆ మంత్రము ఫలించును. ఆచారము విడిచిన ఆ మంత్రము ఫలించదు. ముఖ్యముగా చెప్పవలెనంటే మంత్రము అక్షరములతో కూడినదై, ఎన్నియో నియమములుకలదియై ఉండును. నియమములను అతిక్రమించని ఎడల ఎంత కాలమైనా మంత్రప్రభావము అట్లే ఉండును.

ఒక కత్తిని కొన్ని కట్టెలు కొట్టుటకు వినియోగించిన ఆ కత్తి పదునుతగ్గి మొద్దుపోవును. అపుడు ఆ కత్తికి తిరిగి పదును పెట్టవలసి యుండును. లేని ఎడల కత్తి కట్టెలను నరుకలేదు. అట్లే మంత్రములను సిద్ధి చేసుకొన్న తర్వాత దానిని ఒక పనికి వినియోగించిన ఆ పని నెరవేరును. కాని రెండవమారు ఆ మంత్రము బలము తగ్గి ఉండును. దానికి బలము చేకూర్చుటకై తిరిగి మంత్రమును కొన్నిమార్లు పఠించవలసి ఉండును. మంత్రమును నియమముల ప్రకారము నిత్యమూ పఠించుచుండిన పని నెరవేర్చుటకు ఆ మంత్రములు సామర్థ్యములు కల్గియుండును. అట్లు పఠించకుండిన కత్తి ఉన్నను మొద్దుపోయి తెగని విధముగా, మంత్రసిద్ధి పొందిననూ ఆ మంత్రము పనిచేయలేక పోవును.

మంత్రముల ప్రభావముతో కొంతమంది దేవతలను వశము చేసుకొని వారిని తమ తమ పనులయందు వినియోగించుట కూడా జరుగుచున్నది. కాళీశక్తిని వశము చేసుకొన్నవారు, భగళాముఖి శక్తిని

వశము చేసుకొన్నవారు, కాటేరిదేవతను వశము చేసుకొన్నవారు, ఆంజనేయుని వశము చేసుకొన్నవారు ఈ కాలములో కూడ ఉన్నారు. అట్లు వశము చేసుకొన్న వారికి కొంతకాలమునకు ఆ దేవతలతోనే అపాయము జరుగుచుండుట కూడా సంభవించుచున్నది. అట్లు ఎందుకు జరుగుచున్నదనగా! ఒక బలవంతుని కారాగారము (జైలు)లో వేసి వాని చేత పనులు చేయించుకొనుచున్నామనుకొనుము. అతడు ఎల్లవేళల ఆ బందిఖాన విడిచి బయటపడవలెనను యోచన చేయుచుండును. ఎప్పుడు సమయము అనుకూలించిన, అప్పుడు ఆ బందిఖానానుంచి తప్పించు కొనును. అట్లే బలవంతులైన దేవతలను వశము చేసుకొనిన, ఆ దేవతలు వాని మంత్రములకు కట్టుబడి వాడు చెప్పిన పనులు చేయుచుందురు, కానీ ఆ దేవతలు వీనినుండి ఎప్పుడెప్పుడు తప్పించుకొందామా? అని ఆలోచించుచునే ఉందురు. ఎప్పుడైనా వీలుకలిగితే, అనగా ఆ మంత్రమున కున్న ఆచారములను మంత్రగాడు తప్పిన సమయములో ఆ దేవతలు మంత్రగానిపై వారి ప్రభావము చూపి, వానిని మరణించునట్లుచేసి, తప్పించుకొని ఇష్టము వచ్చినట్లు పోవుచుందురు. కొన్ని దేవతలు మాంత్రికుని చంపక వాని కాలునో, చేతినో లేక స్వరమునో లేకుండ చేసి పోవుచుందురు. మంత్రగానిని ఊరకవదలక అట్లు ఎందుకు చేసి పోవుచున్నారనగా! వాడు ఇన్ని రోజులు నన్ను తన ఆధీనములో పెట్టుకొని నాతో పనులు చేయించినాడు కదా! అను కోపము కల్గియుండుట వలననూ, మరియు ఊరక వదలిపోయిన తిరిగి నన్ను మంత్రసాధనతో తన స్వాధీనము చేసుకొనునను భయము కలిగి ఉండుట వలననూ, వాడు తిరిగి మంత్ర సాధన చేయకుండునట్లుగా ఆ దేవతలు వానిని మరణించునట్లునో, లేక అవయవలోపము అగునట్లునో చేసి పోవుచున్నారు. కావున దేవతలను

వశము చేసుకొనుట అన్నది చాలా పనికిమాలిన పని. దాని ద్వారా చివరకు నష్టమే సంభవించునని తెలియుచున్నది.

మంత్రములను నేర్చిన దానివలన తాత్కాలితముగా ఫలిత ముండును. కానీ తిరిగి వాటి ద్వారా నష్టములు చాలా ఉండును. మంత్రములతో స్థూలకన్నులకు అగుపించునట్లు తేళ్లను, పాములను, ఇంకా కొన్ని వస్తువులను తయారు చేయవచ్చును. కానీ అవి అన్నియు కొన్ని నిమిషములు లేక కొన్ని గంటల కాలముండునవే, అంతకంటే మించి ఉండవు. తిరిగి అవి అదృశ్యమగును. ఈ కాలములో పెద్ద మంత్రములను సాధించు మంత్రవేత్తలు లేకున్నా చిన్న చిన్న మంత్రములను నేర్చినవారు కొందరు అక్కడక్కడ వున్నారు. ఎంతో చిన్న మంత్రములను బహుకష్టముతో నేర్చి మాకంటే పెద్దవారులేరను వారు కూడా ఉన్నారు. క్షుద్రదేవతలను వశము చేసుకొని వాటిద్వారా మన కంటికగుపడని వస్తువులను ఫలానా చోటనున్నవని చెప్పుచున్నారు. అంతమాత్రమున వారు జ్ఞానేత్రులా? ఏమాత్రము కారు కాలేరు. కర్ణపిశాచినడిగి ఎక్కడో జరిగిన విషయములను దాని ద్వారా తెలుసుకొని, అక్కడ ఇట్లు జరిగినదని చెప్పుచున్నారు. అంతమాత్రమున వారు జ్యోతిష్కులా? ఏమాత్రము కారు, కాలేరు. మంత్ర ప్రయోగము (చేతబడి) చేసి ఒక వ్యక్తిని మరణించునట్లునో, లేక అంగవైకల్య మగునట్లునో చేసి, నేను ఎట్లు చేయవలయునంటే, అట్లు చేయగలనని పెద్ద శాపము పెట్టు మహర్షివలె తనకు తాను గర్వపడుచున్నాడు. అట్లు చేసినంత మాత్రమున ఆ మంత్రగాడు మహర్షియగునా? ఎప్పటికీ కాడు, కాలేడు.

మంత్రముల నేర్చి వాటిని సిద్ధి పొందినవారు వారి ఫలితమును యోగాభ్యాసపరులకు చూపగా, దానిని చూచిన కొంతమంది యోగా

భ్యాసకులు అజ్ఞానవశమున మంత్రముల ప్రభావము తెలుసుకొనలేక, మేము ఎన్ని రోజులు యోగము చేసినను వీరు సృష్ఠించిన మాదిరి ఒక చిన్న తేలునైనా సృష్ఠించలేక పోతిమి కదా! వీడు మాకంటే గొప్పవాడు. మా మార్గముకంటే వీని మార్గమే గొప్పదని వారు మంత్రగానిని ఆశ్రయించు చున్నారు. జ్ఞానదీపకాంతితో యోగమునకు మంత్రములకు గల భేదములు తెలుసుకొన్నవారు అట్లు చేయరు. ఎందుకనగా మంత్రములు వివిధ ఆచారములతోను, జంతుబలులతోను, శోచనీయమైన నైవేద్యములతోను అనేక నియమములతోను కూడుకొని ఉన్నవి. యోగమట్లు ఆచార నియమములులేక, జంతుబలులు, వివిధ నైవేద్యములు లేక, మంత్ర యుక్తమైనదికాక, బయటి వస్తువులకు ఏ దానికి సంబంధము లేక ఉన్నది. మంత్రముల వలన దేవతలు వశమగుదురుకానీ మాంత్రికుని మీదనే ద్వేషముపూని ఉందురు. యోగము వలన దేవతలు వశముకారు కానీ దేవతలు కూడా యోగివద్ద భక్తి భావమును కల్గి వినయ విధేయతలతో నడచుకొందురు. ఎటువంటి మంత్ర ప్రయోగమైనా యోగిని ఏమీ చేయలేదు. మంత్రబలము మంచిదికాదని చెప్పిన యోగుల మీద మాంత్రికులు ద్వేషము పూని, మంత్రప్రయోగము చేసి వారి ప్రయోగములు ఫలించక దిగులు చెందుచున్నారు. మాంత్రికుల మంత్రశక్తిని మించినది యోగశక్తి. కావున మంత్రశక్తి యోగశక్తి ఉన్న యోగులను ఏమీ చేయలేదు. మాంత్రికుల ప్రయోగములు యోగులపట్ల నెరవేరవు. యోగులు సంకల్పించిన ఎడల మాంత్రికులయందున్న మంత్రశక్తి అంతయూ పటా పంచలైపోగలదు. తర్వాత వారు మంత్రములందు నిర్భలులై, ఏ పనిని నెరవేర్చలేక పోవుదురు. మాంత్రికులకు వశమై ఉన్న దేవతలు యోగులను హింసించలేరు. ఒకవేళ యోగులను బాధపెట్టుటకు మాంత్రికుల

ప్రేరణవలన ఆ దేవతలు వచ్చిన ఎడల, అగ్నిగుండము వద్దకు వచ్చిన మిడతలు బూడిదైపోయినట్లు, యోగుల వద్దనున్న జ్ఞానాగ్నికి భస్మమై పోవుదురు. లేకున్న దగ్గరకు వచ్చినంత మాత్రముననే జ్ఞానాగ్ని యొక్క వేడిమికి తట్టుకొనలేక పారిపోవుదురు. పూర్వము మంత్రయుక్తమైన అస్త్రములు కూడా యోగులను ఏమియు చేయలేక పోయినవి. అన్నిటికంటే ఎక్కువ ప్రభావము కల్గిన బ్రహ్మాస్త్రమును వశిష్ఠుని మీదకు ప్రయోగించగా అది యోగి అయిన వశిష్ఠుని ఏమి చేయలేక ఆయనయందే లీనమై పోయినదట. పరస్పరం శ్రీరాముడు ఆంజనేయుడు యయాతిరాజు కొరకు యుద్ధము పూనినపుడు, శ్రీరాముడు ప్రయోగించిన తిరుగులేని అస్త్రము ఆంజనేయుని ఏమీ చేయలేక అతనిలో ఉన్న యోగశక్తికి కట్టుబడినదై, అతని మెడలో పూలహారమైపడినదట. ఒకప్పుడు బోయ వేషధారియై ఉన్న మహాయోగి అయిన ఈశ్వరుని మీదికి అర్జునుడు దివ్యాస్త్రములను ప్రయోగించినా, అవి ఈశ్వరుని ఏమి చేయలేకపోయినవట. అన్ని శక్తులకు మించినది జ్ఞానశక్తి కావున దాని ఎదుట ఏ శక్తి పనిచేయలేదు. జ్ఞానశక్తికంటే పవిత్రమైనది, దానికి సాటియైనది ఏ శక్తియును ప్రపంచమున లేదు. అందువలననే భగవద్గీత యందు జ్ఞానయోగములో భగవంతుడు *'నహి జ్ఞానేన సదృశం, పవిత్రమిహ విద్యతే'* **'జ్ఞానమునకు ఈ జగమున సాటియైనది లేదు అంతకంటే పవిత్రమైనది లేదని'** అన్నాడు. కావున మంత్ర, యంత్ర, తంత్రములు గజకర్ణ, గోకర్ణ, ఇంద్రజాల మహేంద్రజాల విద్యలు, మరియు యక్ష, రాక్షస, కిన్నెర, కింపురుష, గరుడ, గంధర్వ, నాగ, భూత, ప్రేత పిశాచములన్నియూ జ్ఞానమునకంటే హీనము. అన్నింటి కంటే అగ్రస్థానమువహించినది పరమాత్మ జ్ఞానము. ఆత్మ జ్ఞానమును పొందినవాడు లోకమున ఏ శక్తికి భయపడడు. ఇతరులను భయపెట్టడు.

భయము, మనోవ్యాకులములేక నిశ్చలుడై ఉండును. అట్టివాడు పరమాత్మకు చాలా ప్రీతిపాత్రుడై ఉండును. కావున గీతా శాస్త్రములో భక్తి యోగమున భగవంతుడు *"యస్మాన్నో ద్విజతే లోకో లోకాన్నో ద్విజతేచయః హర్షామర్ష భయోద్వేగైర్ముక్తో యస్సచమే ప్రియః"* **'జగతిచే ఎట్టివానికి జడుపు లేదో, జగతికి ఎవనిచే జడుపుకలుగదో వాడు సంతోషమును, కోపమును మనోవ్యాకులమును, భయమును పొందడు. అతడే నాకు ప్రియుడు'** అని అన్నాడు. కావున జ్ఞాని అయినవాడు మంత్రతంత్రములను ఆశ్రయించక యోగశక్తినే సంపాదించుకొనును.

నేడు దేశమున కొందరు మంత్రములనాశ్రయించి, క్షుద్ర దేవతలను ఆరాధించుచూ, నిజమైన భక్తులమనుకొని, మాకంటే జ్ఞానులులేరని భ్రమచెందుచున్నారు. మంత్రములకు యోగమునకు గల వ్యత్యాసమేమో తెలుసుకోగల్గితే, ఏది మంచిదో నిజముగా తెలియగలదు. కొందరు మాంత్రికులు మంత్రప్రభావముతో యోగులమీదికే ద్వేషముపూని వారినే కించపరుస్తున్నారు. యోగులు సామాన్యముగా ఎవరు ఏమనుకొన్నా ఊరకయుందురు. ఒకవేళ యోగులకు కోపము వచ్చినచో, వారు జ్ఞాననేత్రమును ఎర్రగా చేసినచో మాంత్రికుల మంత్రశక్తి భస్మమైపోవును. తర్వాత నష్టము మరియు కష్టము మాంత్రికులకే ఉండును. పూర్వము యోగులపై మంత్రములతో దండయాత్ర చేసినవారు, మంత్రభ్రష్టులై మరుజన్మమున ఎన్నియో కష్టములననుభవించినారు. కావున మాంత్రికులు యోగులను కించపరచక ఉండవలయును. మాంత్రికులు కూడా ఎప్పుడో ఒకప్పుడు తమకే నష్టముతెచ్చు మంత్రములను వదలి, పరమాత్మ నాశ్రయించి, దైవసాధన చేసిన ఎంతో బాగుండునని నేను తెలియజేయు చున్నాను. మంత్రసాధనకంటే యోగసాధన పవిత్రమైనది. మంత్రసాధన

ద్వారా ప్రపంచ కార్యములను, ప్రపంచ గౌరవములను పొందవచ్చును. కానీ మోక్షమును ఏమాత్రము సంపాదించుకొనలేరు. కావున మంత్రముల విషయము తెలిసినవారు మంత్రముల చెంతకు వెళ్లక, మంత్రము నేర్పించు గురువులనాశ్రయించక, యోగమార్గము నన్వేషించుచూ, పరమాత్మ బోధ చేయు గురువులనాశ్రయించి జన్మను సార్థకము చేసుకొనవలెనని కోరుచున్నాము.

*****

# గ్రహాలు - విగ్రహాలు

పుట్టిన ప్రతి జీవి తప్పక మరణించవలసినదే. మరణించుస్థితిని మృత్యువు అంటారు. మృత్యువు కర్మను అనుసరించి రెండు రకములుగా ఉన్నది. అవి 1) కాలమృత్యువు 2) అకాలమృత్యువు. **కాలమృత్యువు అనగా జీవునికి ఉండవలసిన ఆయుష్షు అంతయు అయిపోయిన తర్వాత వచ్చునది. అకాలమృత్యువు అనగా జీవునికి ఉండవలసిన ఆయుష్షు అంతయు అయిపోక మునుపే సంభవించునది.** కాలమృత్యువునందు జీవుడు స్థూల, సూక్ష్మ శరీరములను వదలిపోవును. అకాలమృత్యువునందు జీవుడు స్థూలశరీరము మాత్రము వదలివేసి, సూక్ష్మశరీరమును ధరించి ఉండును. అకాల మృత్యువుతో చనిపోయినవారు కాలమృత్యువు సంభవించు నంతవరకు ఉండి, కాలమృత్యువు సంభవించిన వెంటనే అంతవరకు ఉన్న సూక్ష్మశరీరమును కూడా వదలి వేరే శరీరము ధరించుచున్నారు. అందువలననే భగవద్గీతయందు సాంఖ్యయోగమున **"దేహి దేహమును ధరించి దానియందు వరుసగా బాల్యము, యౌవ్వనము, కౌమారము,**

**వృద్ధాప్యము అట్లే మృత్యువును పొందుచున్నాడు. మృత్యువును పొందిన వెంటనే మరియు క్రొత్త శరీరమును ధరించుచున్నాడు"** అని పరమాత్మ తెలిపియున్నాడు.

చాలామందికి అకాలమృత్యువు ఎందుకు ఉన్నది? అకాల మృత్యువు పొందిన తర్వాత జీవుని రూపము ఎట్లుండును? అకాల మృత్యువు పొందిన తర్వాత కాలమృత్యువు సంభవించునంత వరకు జీవుడు ఏమి చేయుచుండును? అను ఎన్నియో అనుమానములు బయలుదేరవచ్చును. వారు అడుగు ప్రశ్నలకు, అడగలేని ప్రశ్నలకు నా సమాధానము ఏమనగా! జీవుడు పాపపుణ్యములు సంపాదించుకొనుచున్నాడు కదా! వాటినే కదా మనము కర్మ అనుచున్నది. కర్మ రెండు రకములుగా ఉన్నది. ఒకటి మానసిక కర్మ, రెండవది శారీరక కర్మ. మానసిక కర్మ అనగా జీవుడు శరీరముతో కాకుండా మనస్సుతో సంపాదించుకొన్నది. మరియు మనస్సుతోనే అనుభవించునది. శారీరక కర్మ అనగా మనస్సుతోనే కాకుండ జీవుడు శరీరముతో కూడా చేసుకొన్నది, మరియు శరీరముతోనే అనుభవించునది. దీనినే ఇంకనూ వివరముగా తెలుసుకున్న మానసిక కర్మ అనగా జీవుడు సూక్ష్మశరీరము ద్వారా అనుభవించునది అనియు, శారీరక కర్మ అనగా జీవుడు స్థూల శరీరము ద్వారా అనుభవించుచున్న దనియు తెలియుచున్నది. ఈ రెండు కర్మలు దాదాపు సమానముగా ఉన్నవాడు రెండునూ అనుభవించుచూ పోయి ప్రారబ్ధమున అవి అయిపోయిన వెంటనే కాలమృత్యువును పొందుచున్నాడు. అట్లుకాక శారీరక కర్మ తక్కువ ఉండి మానసికకర్మ ఎక్కువ ఉండిన, ప్రారబ్ధమున శారీరకకర్మ ముందుగా అయిపోయి మానసిక కర్మ ఒకటి మాత్రము మిగులును. శారీరకకర్మ ఎపుడు అయిపోవుచున్నదో ఇక స్థూలదేహముతో పనిలేదు

కాబట్టి అకాలమృత్యువు సంభవించుచున్నది. అకాలమృత్యువులో మిగులునది సూక్ష్మశరీరము. దానితోనే మానసికకర్మ అంతయు అనుభవింప బడుచున్నది. పాపపుణ్యములు (కర్మ) శారీరక, మానసిక అని రెండు రకములుగా ఉన్నది. కావున కాలమృత్యువు, అకాలమృత్యువు అని రెండు రకముల మృత్యువులను పరమాత్మ ప్రపంచములో ఉంచాడు.

జీవుడు స్థూల శరీరములో ఉన్నపుడు బ్రతికి ఉన్నాడు అందురు. స్థూలశరీరము వీడిపోయిన వెంటనే చనిపోయినాడు అని అందురు. కాని ఆ మరణము కాలమరణమా? అకాలమరణమా? అని గుర్తించుటకు వీలుకాదు. అట్లే మనము ఎంతో మంది మరణించుట చూస్తున్నాము. జీవుడు కాలమరణము పొందెనా, అకాల మరణము పొందెనా అని గుర్తించలేక పోవుచున్నాము. జీవుడు అకాలమృత్యువుతో చనిపోయిన తర్వాత, సూక్ష్మశరీరము మాత్రము మిగులుచున్నది కదా! దాని రూపు ఎట్లుండుననగా ముందు ఏ స్థూలశరీరముతో కూడుకొని సూక్ష్మశరీరము ఉండునో దానిరూపునే సూక్ష్మశరీరము కూడా పొంది ఉండును. కానీ సూక్ష్మశరీరమునకే మరియొక పేరు కలదు. దానినే **'గ్రహ'** అని అందురు. గ్రహ అను దానినే కొంతమంది **'దయ్యము'** అని కూడా అందురు. ఇంకా కొంతమంది భూతము అని కూడా అందురు. దయ్యము, భూతము, గ్రహ అని సూక్ష్మశరీరమునే అందురు. జీవుడు ఒకమారు అకాలమృత్యువు ద్వారా తనకున్న స్థూలశరీరమును విడిచిన తర్వాత దానియందు ఎప్పటికీ ప్రవేశించలేడు. అట్లే మృతిపొందిన ఏ స్థూల దేహమునందును ప్రవేశించలేడు. కానీ బ్రతికియున్న ఏ జీవ శరీరమందైనా ప్రవేశించగలడు. అందువలననే చచ్చినవారు వచ్చి బ్రతికి ఉన్న వారియందు ప్రవేశించి మాట్లాడుట ప్రత్యక్షముగా అక్కడక్కడ చూచుచునేయున్నాము. ఇక్కడ

కొంతమందికి **"బ్రతికియున్న వారి శరీరములో సూక్ష్మశరీరమున్నది కదా! వేరొక సూక్ష్మశరీరము ఎట్లు ప్రవేశించును? ముందు నుండి ఆ శరీరములో ఉన్న సూక్ష్మశరీరము ఆ సమయములో ఎక్కడ పోవును?"** అను అనుమానము రావచ్చును. దానికి సమాధానము ఏమనగా! సూక్ష్మశరీరము బ్రతికియున్న శరీరములోనికి అవలీలగా ప్రవేశించగలదు. ఎట్లనిన సూర్యకిరణము గాజు అద్దములో దూరినట్లు సూక్ష్మశరీరము కూడా స్థూలదేహములందు దూరును. కానీ జీవ శరీరమునందు సూక్ష్మశరీర ముండును కదా! అనిన అది వేరొక సూక్ష్మశరీరము తన స్థూల శరీరము లోనికి వచ్చినపుడు నిద్రావస్థలోనికి పోవును. అందువలన వేరే గ్రహ (సూక్ష్మశరీరము) తనయందు ప్రవేశించి ఏమి చేసినది జీవునకు తెలియదు. గుఱ్ఱమును ఎక్కి రౌతు తన ఇష్టప్రకారము గుఱ్ఱమును నడుపునట్లు స్థూలదేహములోనికి ఏ సూక్ష్మశరీరము చేరినా, ఆ సూక్ష్మశరీర ప్రకారమే స్థూలము నడుచుకొనును. ఏ విధముగా అనిన, తమలపాకు నములుటకు అలవాటులేని వారియందు వేరే గ్రహ (సూక్ష్మశరీరము) ప్రవేశించిన ఆ గ్రహకు తాంబూలము అలవాటుయున్న, ఆ సమయములో తాంబూలము వేసుకొనును. మరియు తమిళ భాషరాని ఒకనియందు తమిళభాష మాట్లాడు గ్రహ ప్రవేశించిన ఆ సమయములో తమిళభాషనే మాట్లాడును. అట్లే పాటలు రానివానికి పాటలుపాడు గ్రహపట్టిన ఆ సమయమున పాటలు పాడుచున్నాడు. ఈ విధముగా సూక్ష్మశరీరము ఏ అలవాట్లు, ఏ గుణములు కలదియో, అది ప్రవేశించిన స్థూలదేహములో కూడా అవియే కనపడు చుండును.

ప్రపంచములో ఎంతోమంది అకాలమృత్యువు ద్వారా గ్రహాలుగా మారి ఉన్నారు. మారినవారందరూ ఇతరులయందు ప్రవేశించరు. కొంత

మంది మాత్రము ఇతరులయందు ప్రవేశించుచుందురు. కానీ ఇంకొక రహస్యమేమనగా ఎన్నో జాతుల జీవరాసుల స్థూలశరీరములు వేరైన, జీవులు మాత్రము ఒక్కటియే కదా! అందువలన గ్రహాలు (సూక్ష్మ శరీరములు) తమ జాతి శరీరములందే కాక ఇతర జాతి శరీరములందు కూడా ప్రవేశించుచున్నవి. మానవ శరీరములోనికి మానవ గ్రహాలు ప్రవేశించు చున్నవి. మరియు పాముల గ్రహాలు మరియు ఇతరత్రా జాతి జీవుల గ్రహాలు కూడా ప్రవేశించుట సంభవించుచున్నది. మనిషి యందు మనిషి గ్రహా ప్రవేశించిన, మనిషి ప్రవర్తించినట్లే ప్రవర్తించును. మానవుడు మాట్లాడినట్లే మాట్లాడును. మనిషియందు పాముజాతి గ్రహ ప్రవేశించి నపుడు పాము ప్రాకినట్లే ప్రాకును, పాము బుసకొట్టినట్లే బుసకొట్టును, ఏ భాష మాట్లాడలేకపోవును. దీనిని బట్టి చూచినా, ఒక్క మానవ సూక్ష్మ శరీరములే కాక ఎన్నో రకముల జీవరాసుల యొక్క సూక్ష్మశరీరములు ప్రపంచములో ఉన్నట్లు తెలియుచున్నది. సూక్ష్మ దేహములు ధరించియున్న జీవరాసులన్నింటినీ జ్ఞానదృష్ఠితో చూచిన రెండవ ప్రపంచమా అనునట్లు తోచుచున్నది. మానవులకు దీని విషయము తెలిసినా తెలియక పోయినా స్థూలకంటికి కనపడని ప్రపంచము ఉన్ననే ఉన్నది. దానియందు కూడా ఇక్కడ సర్వ జీవరాసులూ, మానవులూ పాపపుణ్యముల ఫలితములైన సుఖదుఃఖములు అనుభవించినట్లే అనుభవించుచున్నారు. ఈ ప్రపంచములో మన మందరము కష్టపడునట్లే గ్రహాలు కూడా కష్టపడుచున్నవి. మన మందరము ఒకరికొకరము పరస్పర సంబంధము కలిగి ఉన్నట్లే అవియు (గ్రహాలు) పరస్పర సంబంధము కలిగియున్నవి. మనము ఒకరికొకరు మాట్లాడుకొనునట్లే అవియు (గ్రహాలు) ఒకరికొకరు మాట్లాడుకొనుచున్నవి. ఏ జాతికి ఏ ప్రవర్తన ఉండునో, ఆ జాతికి ఆ ప్రవర్తనయే ఉండును.

సూక్ష్మశరీరములందు బుద్ధి, మనస్సు, అహంకారము ఉన్నవి. కాబట్టి మానవులకున్న గుణములే మానవగ్రహాలకు కూడా ఉండును. సూక్ష్మ శరీరములమయమైన రెండవ ప్రపంచము మన కన్నులకు కనిపించదు. సూక్ష్మశరీరములు మన కంటికి కనిపించవు కానీ సూక్ష్మ శరీరముల చూపుకు సూక్ష్మశరీరములే కాక స్థూలశరీరములు అన్నియు కనిపించుచూ ఉండును. అనగా వాటిని మనము చూడలేకున్న మనలను గ్రహాలు చూడగలుగుచున్నవి.

కొంతమంది మేము గ్రహాలను చూచినాము అని వాదించు చున్నారు. దానికి నా సమాధానము ఏమనగా! పగటి పూట గ్రహాలు సాధారణముగా ఎవరికి కనిపించవు రాత్రిపూట కనిపించుటకు ఆస్కారము ఉన్నది. అదియు ఎట్లనిన రాత్రిపూట కూడా జాగ్రతావస్థ బాగాయున్న వారికి ఏమాత్రము కనిపించవు. జాగ్రతావస్థ బాగాయుండక జాగ్రత్తలోనే నిద్రావస్థ పొందిన వారికి, అనగా దారిన నడుస్తున్నపుడైన నిద్రమత్తులో ఉన్నవారికి స్థూలశరీరము పూర్తిగా జాగ్రత్తలో ఉండదు. కనుక వాని సూక్ష్మశరీర చూపుకు గ్రహాలు కనిపించవచ్చును. అదియు పూర్తి రూపు కనిపించదు. ఫలానా జాతి అని మాత్రము తెలియును. అందువలననే నిద్ర ఎక్కువగా ఉన్న మనుషులు రాత్రిపూట బయట సంచారము చేసినపుడు వారికి గ్రహాలు కనుపించుచున్నవి. అవియు మానవ గ్రహాలేకాక ఇతర జాతిగ్రహాలు కూడ కనుపించును. అందువలన కొందరు నాకు దయ్యము కుక్కమాదిరి కనిపించినది, నాకు దున్నపోతు మాదిరి కనిపించినది, నాకు పొట్టేలు మాదిరి కనిపించినది అని రక రకములుగా చెప్పుచుందురు. ఎట్లు కనిపించినా స్థూలదృష్టికి ఏమాత్రము ఉండదు. సూక్ష్మశరీర చూపుకు కొద్దిగా కనిపించి ఉండవచ్చు.

జీవుడు అకాలమృత్యువును పొంది సూక్ష్మశరీరముతో ఎంతో కాలము ఉండవలసివచ్చును కదా! అంతవరకు ఎక్కడ నివాసము చేయుచున్నారు. కొంతమంది స్మశానములలోనే నివాసము చేయుచున్నారు. కొంతమంది పాడుపడిన గృహములలో నివాసము చేయుచున్నారు. మరికొంతమంది చింతచెట్లు, జమ్మిచెట్లు, మర్రిచెట్లు, మేడిచెట్లుయందు నివాసము ఉంటున్నారు. కొంతమంది చచ్చిన చోటునే ఉంటున్నారు. మనకు పగలు మెలుకువ, రాత్రి నిద్రయున్నట్లు సూక్ష్మ శరీరములకు రాత్రి మెలుకువై, పగలు నిద్ర ఉన్నది. కావున గ్రహాలు రాత్రిపూట ఎక్కువగా సంచారము చేయుచుండును. మనకు ఆకలియున్నట్లే సూక్ష్మశరీరములకు కూడా ఆకలి ఉన్నది. మనము ఆకలికోసము అనేక పాట్లుపడినట్లు సూక్ష్మశరీరములు కూడా ఆకలి తీర్చుకొనుటకు అనేక పాట్లుపడుచున్నవి. మనము భుజించు ఆహారమే గ్రహాలు భుజించుచున్నవి. మనకు తెలియకనే మన ఆహారమును, ధాన్యమును గ్రహాలు తీసుకుపోవును. అట్లు తీసుకు పోవుటను ఎవరూ గ్రహించలేరు. కానీ పూర్వము జ్ఞానదృష్టి ఉన్న పెద్దలు గ్రహాల యొక్క స్థితిగతులను తెలుసుకొన్నవారై, ధాన్యమును కల్లముగా చేసి కుప్పగా (రాసిగా) పోసిన సమయములో గ్రహాలు భయపడి రాసి దగ్గరకు రాకుండుటకు కత్తినో, బల్లెమునో, కొడవలినో, కొబ్బరికాయనో ఏదో ఒక దానిని ఆ ధాన్యము రాసిమీద ఉంచెడివారు మరియు రాసిచుట్టూ గీత గీచెడివారు. ఆ పనిని కొంతమంది కొన్ని ప్రాంతములలో ఇప్పటికీ కూడా చేయుచున్నారు. కానీ ఎందుకు చేయుచున్నది ఏమాత్రము తెలియదు. ధాన్యము రాసిపోసినపుడే గ్రహాలు ఆ రాసిలోని ధాన్యమును అదృశ్య రూపము చేసుకొని తీసుకపోవుటకు ఎక్కువ ఆస్కారము ఉన్నది. కావున ఎవరైనా కల్లము చేయువేళ ధాన్యము మీద ఏదో ఒకటి ఉంచకపోతే

నూరుబస్తాలు అవుతాయనుకున్న ధాన్యము కొలిచేటప్పటికీ ఎనభై బస్తాలకే దిగును. ఇట్లు అనేక చోట్ల జరుగుచుండును. గ్రహాలు నివాసము చేయు గృహములలో సంసారము వృద్ధి లేకుండా పోవుటకు కూడా కారణము ఇదియే. కొన్ని పొలములలో కూడా కంకులతో ఉన్న గింజలనే గ్రహాలు మాయము చేయగలవు. కావున అవి అట్లు చేయకుండుటకు పూర్వము పెద్దలు పొలములో **'పొలి'** అను పేరుతో కోడినో లేక పొట్టేలునో కోసి గ్రహాలకు విందు చేయుచుండిరి. ఆ విందును ఆరగించిన గ్రహాలు వారిమీద దయతలచి వారి పొలములోనికి రాకుండా పోవుచుండెడివి. ఈ కాలములో కొన్ని స్థలములయందు ఇప్పటికీ పొలిచేయుచున్నారు. కానీ అది ఎందుకో ఎవరికి తెలియదు. పొలి గ్రహాలకు విందని ఏమాత్రము చాలామందికి తెలియదు. తెలిసినా తెలియక పోయినా పొలి మాత్రము గ్రహాలకు విందే. ఈ విషయము తెలియక పొలిచేయని చేలలో, మరియు కల్లములలో దిగుబడి తక్కువ వచ్చుచుండును. ఇంతేకాక అన్నము రాసివద్ద కూడా ఇట్లే జరుగుచుండును. పొట్టేల్లను కోసి మాంసము కుప్పవేయు స్థలములలో కూడ గ్రహాలు దొంగతనము చేయుచుండును. కొన్నిచోట్ల ముందు తూకము చేసిన మాంసమును మరల తూకము చేసిన చాలా బరువుతగ్గి ఉండును. కారణము గ్రహాలు తీసుకపోయి ఉండును. ఈ విధముగా అదృశ్య రూపములో ఉన్న సూక్ష్మశరీరములు తమ ఆహారమును సంపాదించు కొనుచున్నవి.

గ్రహాలు ఒక చోటనుండి ఇంకొక చోటికి పోవలయునంటే మన మాదిరే రైల్లు బస్సులయందు ప్రయాణము చేయుచున్నవి. వాటిని టికెట్లు అడుగువారు ఎవరూ లేరు. ఆడ మగ భేదములు సూక్ష్మ శరీరములు కలిగియున్నవి కదా! అందువలన మన మాదిరే సూక్ష్మ శరీరములు స్త్రీ

పురుష సంయోగములు చేయుచున్నవి. గ్రహాలుగా మారియున్న వారు బ్రతికిన వారిని సంయోగించవలయునని కోర్కె కలిగినవారు బ్రతికిన వారిని సంయోగము చేయుచున్నారు. కానీ ఎట్లు అనునది సామాన్యముగా ఎవరికీ తెలియదు. గ్రహాలుగా ఉన్నవారు వారిలోనే వారు ఒకరికొకరు కొట్టుకొను చున్నారు మరియు తిట్టుకొనుచున్నారు. మొత్తము మీద జీవితమంతయు మనకున్నట్లే ఉండును. ఇది అంతయు మన కంటికి అగుపించదు. కావున కొంతమంది నమ్మకపోవచ్చును. నమ్మని వారికి అకాలమృత్యువు వస్తే అప్పుడైనా చెప్పినదంతయు నిజమని తెలుసుకుంటారు.

గ్రహాలు అనగా ఎవరో కాదు మనలో ఉన్న జీవాత్మలే. గ్రహాలకు అజ్ఞానులు భయపడుదురు. అవియు వారినే పీడించును. జ్ఞానులు మాత్రము భయపడరు అవి వారిని భయపెట్టలేవు, బాధించలేవు. అజ్ఞానుల శరీరములో ప్రవేశించినట్లు జ్ఞానుల శరీరములలోనికి ప్రవేశింపలేవు. ఎందుకనగా మండుచున్న అగ్నిగుండములో మనము నిలబడగలమా? లేక అడుగైనా పెట్టగలమా? అట్లే గ్రహాలు జ్ఞానాగ్ని ఉన్న శరీరములయందు ప్రవేశించలేవు. ఒకవేళ దగ్గరకు వచ్చిన జ్ఞానాగ్ని వేడిమికి నిలువలేక దూరముగ పోవును. మరియు జ్ఞానవంతులైన యోగులకు గ్రహాలు భయపడును. అందువలననే ఏసుప్రభువును చూచి కొన్ని గ్రహాలు పారిపోయినాయి. జ్ఞానవంతులకు గ్రహాలు చాలాచోట్ల లొంగిపోయినవి. జ్ఞానులుకాక అజ్ఞానులైనవారు జ్ఞానము తెలిసిన వారిని హేళన చేసి మేము పెద్ద చదువులు చదివినాము కదా! మా చదువులలో దయ్యాలు ఉన్నట్లు వ్రాయలేదే అని అనుకొనువారు కూడా ఉన్నారు. ప్రాపంచిక చదువు చదివితే కంటికి కనిపించునదే తెలియును. కానీ పరమాత్మ చదువు చదివితే కంటికి కనిపించనిది కూడా తెలియును. అజ్ఞానములో ఉన్నవారిని గ్రహాలు అనేక రకములుగా

బాధించుచున్నవి. కొన్ని బాధలు గ్రహాలవలననే సంభవించుచున్నవని చాలామందికి తెలియదు. ఆ బాధలు ఎట్లుండుననగా, కొంతమందికి శరీరములో గ్రహాలు ప్రవేశించి కడుపులో ఎక్కువ నొప్పి వచ్చునట్లు చేయుచున్నవి. ఈ కడుపునొప్పికి మందులు ఏమాత్రము పనిచేయవు. మందులు పనిచేయకపోగా ఎక్స్‌రే తీయించిన ఆ ఫిల్మునందు ఏ దోషము కనిపించదు. కొంతమందికి గ్రహాలు ప్రవేశించి దొమ్మలయందు నొప్పివచ్చునట్లు చేయుచున్నవి. కొంతమందికి తలనొప్పివచ్చునట్లు చేయుచున్నవి. మరికొంత మందిని చిక్కి శల్యమైపోవునట్లు చేయుచున్నవి. కొంతమంది స్త్రీలకు మైల (రక్తస్రావము) ఎక్కువగునట్లు చేయుచున్నవి. మరియు మూర్ఛలు వచ్చునట్లు అపస్మారకముగా పిలిచిన పలుకనట్లు కొందరిని చేయుచున్నవి. కొందరికి ఒక కాలు, ఒక చెయ్యి చచ్చుపడునట్లు చేయుచున్నవి. ఈ విధముగా గ్రహాలు మానవులను బాధించుచున్నవి. ఒక్క మానవులకే కాక ఇతర జాతులకు కూడా గ్రహా బాధలు ఉండును. **గ్రహా బాధలు తప్పించుకోవలయునంటే ఎవరైనా భక్తి మార్గము అనుసరించ వలసిందే.** అట్లుకాక మంత్ర యంత్రములతో తప్పించుకొందాము అంటే కొంతకాలము తప్పించుకోగలరేమో కానీ ఎప్పటికీ మాత్రము తప్పించు కోలేరు. జ్ఞానశక్తిని మించిన శక్తిలేదు. కావున దాని వలననే తప్పించు కొనుటకు వీలగును.

ఇప్పటికి గ్రహాలు అనగా ఏమిటి? వాటి యొక్క స్థితి గతులు ఏమిటి? అని ఆమూలాగ్రముగా తెలిసినది. ఇక విగ్రహాలను గురించి తెలుసుకొందాము. మానవుని సూక్ష్మశరీరమును **'గ్రహ'** అనుచున్నాము కదా! అట్లే ఒక ప్రతిమలో ఉండబడిన సూక్ష్మశరీరమును **'విగ్రహ'** అని అంటున్నాము. మానవునికి సూక్ష్మశరీరము స్థూలశరీరములో అణగి ఉన్నది.

పైకి మానవుని స్థూలదేహము కనిపించును కానీ సూక్ష్మదేహము కనిపించదు. ఆ విధముగానే గుడిలో ఉన్న దేవునికి స్థూలదేహము ప్రతిమ, సూక్ష్మదేహము విగ్రహ. ప్రతిమయందు విగ్రహ అణిగి ఉన్నది. పైకి ఆ దేవుని ప్రతిమ ఆకారము అగుపించును కానీ సూక్ష్మశరీరము (విగ్రహ) ఆకారము కనిపించదు. పుట్టిన ప్రతి మానవునికి సూక్ష్మశరీరము ఉన్నట్లే ప్రతిష్ఠించిన ప్రతి ప్రతిమకు విగ్రహ ఉండును. మానవునకు సూక్ష్మశరీరము పోయి స్థూలకళేబరము మిగిలినట్లే, ప్రతిమలో విగ్రహ పోయిన స్థూల దేహమైన ప్రతిమ మాత్రము మిగిలియుండును. అనగా చచ్చిన మానవ కళేబరము, విగ్రహాలేని ప్రతిమ రెండూ ఒక్కటేనన్న మాట. మానవుని సూక్ష్మదేహము స్థూలదేహము యొక్క ఆకారమునే పొంది ఉండును. అట్లే ప్రతిమ ఆకారమునే విగ్రహ పొంది ఉండును. కానీ గ్రహాలకు, విగ్రహాలకు కొన్ని విషయములందు చాలా భేదము ఉన్నది. వాటిని గురించి వివరించెదము వినుము.

1) గ్రహా ఒక్కమారు తన స్థూలదేహమును విడిచి బయటికి వచ్చిన తిరిగి అందు ప్రవేశించలేదు. విగ్రహా తన స్థూలశరీరమును విడిచి బయటికి వచ్చి తిరిగి ప్రవేశించగలదు. 2) గ్రహా ఇతరుల పదార్థములను దొంగలించును. విగ్రహా ఆ విధముగా దొంగలించదు. 3) గ్రహా ఇతరులను రోగరూపమున బాధించును. విగ్రహాలు కూడా కొంతమందిని బాధించును, మరియు కొందరిని బాధల నుండి విముక్తులను చేయును. 4) గ్రహాలు కొన్ని జ్ఞానశక్తి కలిగి ఉండును. కొన్ని మాత్రము జ్ఞానశక్తి లేనివై ఉండును. విగ్రహాలు అన్నియు జ్ఞానశక్తి కలవియై ఉండును. కానీ కొద్ది నుంచి గొప్ప వరకు అంచెల వారిగా శక్తి కలవియై ఉండును. 5) గ్రహాలు నీతి నిజాయితి లేకుండా ప్రవర్తించగలవు. విగ్రహాలు ఆ విధముగా ప్రవర్తించవు.

గ్రహాలకు, విగ్రహాలకు కొన్ని భేదములున్నవి కావున గ్రహాలను చిన్న దయ్యములని అనవచ్చును.

చేసిన కర్మ జీవుని కర్మచక్రము ద్వార వచ్చి, వేరే తల్లి గర్భములో జన్మించిన శిశువు శరీరములోనికి చేరి, శిశువు శరీరమునకు ప్రాణము వచ్చినట్లు, శిల్పాచార్యుని చేత తయారైన ప్రతిమలోనికి కర్మ చేత ఒక జీవుడు ప్రవేశించి ప్రతిమకు ప్రాణము వచ్చుచున్నది. అట్లు చేరిన జీవునికి స్థూలశరీరము ప్రతిమ, సూక్ష్మశరీరము విగ్రహా, ఈ విధముగా ప్రతిమ ప్రాణమును పొందిఉండును. మానవ శరీరము మాదిరి ప్రతిమ శరీరము చలించలేదు. మానవుని సూక్ష్మశరీరము సంచరించినట్లు, ప్రతిమ సూక్ష్మశరీరము సంచరించగలదు. సర్వ జీవరాసులయందు, భోగుల యందు, పాపులయందు, జంతువులయందు మరియు గుడిలోని దేవుని యందు అన్ని జీవులయందు సమానముగా ఉన్నది ఆత్మ. దేవ ప్రతిమ యందు జీవుడు చేరుటకు మంచి కర్మ ఎంతో అవసరము. మంచి కర్మ ఉన్నవారు కర్మానుసారముగా దైవప్రతిమలలో జీవులుగా చేరి, అందులో యోగము ఆచరించి దైవశక్తి ఎక్కువగా పొందబడినవారై, వారికున్న కర్మ తొలగగానే పరమాత్మయందు ఐక్యము చెందుచున్నారు. కొంతమంది అట్లుకాక దైవప్రతిమలలో జీవునిగా చేరినప్పటికీ సరిగా యోగమాచరించక ప్రపంచ మాయలో మునుగుచున్నారు. ఇక్కడ గుళ్లో దేవతలు గొప్పవారని నమ్ముకొని ఉన్నవారికి నేను చెప్పునది అర్థము కాకపోవడమే కాక, ఇది అంతయు తెలియపరుచు నన్ను కూడ అపార్థము చేసుకొందురేమో! దయచేసి విగ్రహాలను అర్థము చేసుకొన్నా చేసుకోలేక పోయినా, నన్ను మాత్రము అపార్థము చేసుకోక ముందుకు మీ చూపును నడుపవలయునని కోరు చున్నాను.

భగవద్గీత శాస్త్రమునందు విజ్ఞాన యోగములో **'ప్రకృతి సంబంధములగు పాపములతో కోర్కెలయందు మునిగి అజ్ఞానులగుచూ, నన్ను పూజించక అన్యదేవతారాధన మానవులు చేయుచున్నారు. ఎవడు ఏ విధమైన శ్రద్ధతో దేవతలను పూజించునో, వానికి ఆ దేవత మీదనే నమ్మకముండునట్లు చేసి ఆ దేవతనే శ్రద్ధతో పూజించునట్లు చేయుదును. వాడు ఆ దేవతనే నమ్ముకొని శ్రద్ధగా ఆరాధించుచుండగా, ఆరాధన ఫలితముగా వారికి కోరుకున్న కోర్కెలను నెరవేర్తును'** అని పరమాత్మ తెలిపి ఉన్నాడు. దీనివలన గుళ్లో దేవుళ్ళు ఏమీ చేయలేరు. గుళ్లో దేవుళ్ళ అంతరాత్మ అయిన పరమాత్మయే అంతయూ చేయుచున్నాడు అని తెలియుచున్నది. మనకు ఏమి చేసినను పరమాత్మయే చేయవలయును. ప్రపంచములోని ప్రజలకు, దేవాలయములోని దేవతలకు, అండ, పిండ, బ్రహ్మాండమునకు అధిపతి పరమాత్మయే. పరమాత్మను నమ్మి కొంత జ్ఞానశక్తిని సంపాదించుకొన్నవారు కూడా ప్రతిమలలో విగ్రహాలుగా మారి పుణ్యవశమున అనేక పూజలను, నైవేద్యములను ఆరగించుచున్నారు.

దైవ ప్రతిమలలో ఉండిన జీవులు దయ్యములు ఆవహించినట్లు ఇతర మనుషుల శరీరములను ఆవహించి, మాకు ఫలానా పూజలు చేయండని చెప్పుచున్నారు. మరియు తన ఎదుట ఫలానా వస్తువు మ్రొక్కుబడిగా ఇస్తానని చెప్పి ఇవ్వక పోయిన వానిని కూడా ఇతరులలో ఆవహించి నా మ్రొక్కుబడి ఇవ్వమని అడుగుచున్నారు. ఇంకను నాకు పూజలు సక్రమముగా చేయడము లేదు మిమ్ములను ఏమి చేయుదునో చూడండి అని బెదిరించువారు కూడా ఉన్నారు. వీరు అంతయు ప్రతిమలలో ఉండియు మాయలో పడినారని తెలియుచున్నది. కొంతమంది ప్రతిమలలో జీవులు తమకు పూజలు చేసినా, చేయకపోయినా, తిట్టినా, పొగిడినా ఏమియు అనుకోక మౌనముగా ఉండి యోగము చేయుచున్నారు.

ఒకే పేరు పెట్టబడిన మానవులు ఎంతోమంది ఉండినట్లు, ఒకే పేరు పెట్టబడిన దేవతా ప్రతిమలు ఎన్నియో ఉన్నవి. ఎల్లన్న అను పేరు కలిగిన మనుషులు ఎంతోమంది ఉన్నట్లు, శ్రీరాముడు అను పేరు ఉండిన ప్రతిమలు ఎన్నో ఉన్నవి. ఒకే పేరు అయిన ఎల్లన్నగారు అందరూ ఒకే విధముగా ఉండరు. ఒకే పేరు కలిగిన ఒక ఎల్లన్నకు ఇంకొక ఎల్లన్నకు రూపములోను, గుణములోను తేడా ఉన్నట్లే, ఒకే పేరు ఉంచబడిన రామప్రతిమలన్నియు ఒకే విధముగా ఉండవు. ఒక రామ ప్రతిమకు ఇంకొక రామ ప్రతిమకు పుణ్యములోనూ, ఆకారములోనూ, జ్ఞానశక్తిలోనూ, గుణములలోనూ తేడా ఉండును. అందువలననే దేశములో ఉన్న ఒకే పేరుగల ప్రతిమలకు వేరువేరు రకములుగా పూజలు జరుగుచుండును. ఆంజనేయస్వామి అను పేరు గల ప్రతిమలు దేశములో ఎన్నియో కలవు. కానీ ప్రతిమలలోని జీవులు ఒకే శక్తి కలిగి ఉండరు. మరియు ఒకే పుణ్యము కలిగి ఉండవు. కావున అనేక రక ఆంజనేయులకు అనేక రకములుగా పూజలు జరుగుచుండును. ఒక గుళ్ళో ఆంజనేయునికి నిత్యపూజలు జరుగుచుండును. వేరొక గుళ్ళో ఆంజనేయునికి ఏమియు జరుగక ఉండును. అందరూ ఆంజనేయస్వామి అను పేరు కలిగియున్ననూ, శత్రువులైన గ్రహాలు గుడిలో ప్రవేశించిన కొంతమంది ఆంజనేయస్వాములు వాటిని ఏమీ చేయలేక పోవుచున్నారు. కొంతమంది ఆంజనేయస్వాములు గ్రహాలతో పోట్లాడి తామే ఓడిపోవుచున్నారు. కొంతమంది విశేష బలము కలిగినవారై గ్రహాలను కొట్టి తరిమి వేయుచున్నారు. మానవులయందు గ్రహాలు ఆవహించినవారు బలము ఎక్కువగా ఉన్న ఆంజనేయస్వామి ప్రతిమవద్దకు పోయి శరణు వేడిన ఆ స్వాములు ఆ గ్రహాలను బాధించి ఇక మీద ఎప్పటికీ వారి దగ్గరకు పోకుండా చేయుచున్నారు. ఇవి అన్నియు మనము

కొన్ని స్థలములయందు దృష్ఠాంతముగా చూస్తూనే ఉన్నాము. గ్రహాలు అయిన మానవులకు విగ్రహా అయిన ఆంజనేయస్వామికి ప్రతిరోజు సాయం కాలము ఘర్షణ **అనంతపురము జిల్లా గుంతకల్లువద్దగల కసాపురమునందు** జరుగుచుండును. తెలియని వారు అక్కడికి పోయి గమనించవచ్చును.

యోగశక్తి కలిగిన మనుషులకు విగ్రహాలు కూడా మాట వినును. ఎందుకనగా దైవశక్తి విగ్రహాలకంటే యోగులయందు అధికముగా ఉండును. కనుక విగ్రహాలు అందరి ఎడల ప్రవర్తించినట్లు ప్రవర్తించక యోగులు తమవద్దకు వచ్చినపుడు వినయ విధేయతలతో ఉండును. ఒక దేవాలయములో యోగి పండుకొని ఉండగా ప్రతిరోజు ఒకరిని ఆవహించి మాట్లాడి పూజలు అందుకొను ఆ దేవాలయ దేవత ఆ రోజు ఎన్ని పూజలు చేసినప్పటికీ ఆవహించి మాట్లాడలేదు. ఎందుకనగా తాను చేయు పని యోగి చూచి కోపగించుకొనునేమోనని. ఇక్కడ కూడా యోగికి విగ్రహా భయపడినదని తెలియుచున్నది. అందువలననే తెలిసిన యోగులు కొందరు ఏ దేవాలయమునకు వెళ్ళరు. మరియు దేవర్లు (జాతర్లు) జరుగు స్థలమునకు, పీర్ల పండుగలలో పీర్ల దగ్గరకు, దేవతలు వళ్ళునిండి మాట్లాడు చున్నారను స్థలమునకు వెళ్ళరు. ఒకవేళ వెళ్ళినా జ్ఞానాగ్ని వేడిమికి ఆ గ్రహాలు బాధపడవలసి ఉండును.

ఓ మానవులారా! దేవాలయములోని దేవతలయందు కూడా అంతర్యామియైవున్న పరమాత్మను తెలుసుకొనుటకు యోగి అయిన గురువును ఆశ్రయించి, ఆయన ఇచ్చు బోధలను అమృతము త్రాగి మృత్యుంజయుడవుకమ్ము. అట్లు లేకున్న చచ్చుట పుట్టుట, కష్టసుఖములు అనుభవించుట తప్పదు. ఘోరమైన బాధలు వచ్చినపుడు పరమాత్మను

తలంచిన పరమాత్మ దయతలచువాడు కాడు. కర్మనుండి తప్పించు కోవలయునంటే జ్ఞానము ముఖ్యము. అందువలననే గీతాశాస్త్రములో జ్ఞానయోగములో **"కర్మను కాల్చుటకు జ్ఞానమను అగ్ని కావలయును"** జ్ఞానము కావలయునన్న జ్ఞానధనము ఉన్నవారి వద్దకు పోయి అడుగు కోవలయును అని భగవంతుడన్నాడు. కావున ప్రతి ఒక్కరూ జ్ఞానమును సంపాదించుకొనుటకు మొదలు పెట్టవలెను. మొదట దేవాలయములందు పూజలు చేయుచు, కోర్కెలు కోరక, దేవాలయముల బాహ్యార్థములన్నిటినీ తెలుసుకొని, దాని తర్వాత గురువు దగ్గర ఉపదేశము పొంది యోగసాధన చేయుచూ యోగశక్తి సంపాదించుకొని, యోగశక్తి పరిపూర్ణ స్థితి పొందుతూనే ఆత్మయందు ఐక్యము కావలయును.

దేవాలయములలోని దేవతా ప్రతిమలయందు కూడా పరమాత్మ ఉన్నాడని యదార్థము తెలుసుకొన్న జ్ఞానులు కానీ, అజ్ఞానులు కానీ చేయు పూజలయందు భోక్త పరమాత్మయే, అన్ని పూజలు ఆయనకే చేరునని తెలుసుకోవలెను. అందువలనే గీతాశాస్త్రమున రాజవిద్యా రాజగుహ్యా యోగములో పరమాత్మ **'శ్రద్ధ కలిగి ఎవడు అన్యదేవతలను ఆరాధించునో అతడు కూడా తనకు తెలియకనే నన్నే ఆరాధించిన వాడగుచున్నాడు'** అని అన్నాడు.

ఎవడైతే పరమాత్మ అన్ని జీవులందున్నట్లు అన్ని దేవతాప్రతిమల యందు కూడా ఉన్నదని, మన పూజలన్నియూ పరమాత్మకే చేరుననుచూ యదార్థము తెలుసుకొన్నాడో వానికి పరమాత్మప్రాప్తి కలుగును. అట్లుకాక దైవ ప్రతిమలందుగల అంతర్యామి అయిన పరమాత్మను తెలుసుకోలేని వారు పూజలు చేయుచున్ననూ, దానివలన పుణ్యము కలిగి ఆ పుణ్యము వలన సుఖము కలుగును. ఆ పుణ్యము అయిపోయిన వెంటనే సుఖము

కూడా అయిపోవును. అందువలన ప్రతిమలందు గల అంతర్యామి అయిన పరమాత్మను గుర్తించలేనివారు సుఖమును పొందుదురు కానీ ఆ సుఖము అయిపోయిన తర్వాత వారికి కష్టములు కూడా సంభవించును. కావున గీతయందు రాజవిద్యా రాజగుహ్య యోగమున పరమాత్మ **'సర్వ దేవతలకు సల్పు యజ్ఞములందు భోక్తను నేను మరియు ప్రభువును నేను'** నన్ను యదార్థరీతిగనని వారికెల్ల సుఖము కలిగి పిదప ఆ సుఖముల నుండి తప్పిపోవుట కూడా సంభవించును అని అన్నాడు. అందువలన ఎవడైన గ్రహాలు అంటే ఏమిటి? విగ్రహాలు అంటే ఏమిటి? అని విశధీకరించి తెలుసుకొనినా, గ్రహాలయందును విగ్రహాలయందును ఉన్న పరమాత్మ ఉనికిని తెలుసుకొన్నా అతనికంటే జ్ఞాని ఇంకొకడులేడని చెప్పవచ్చును. అటువంటి జ్ఞాని యొక్క భావము అంతయు పరమాత్మనే ఆశ్రయించి ఉండును. కావున వాడు పరమాత్మనే చేరగలడు.

*****

# మహర్షి - ఆనంద

భూమి మీద ఎందరో మనుజులున్నారు. వారియందు మాన్యులు కొందరైతే సామాన్యులు లెక్కలేనంతమంది ఉన్నారు. పుట్టినపుడు అందరూ సామాన్యులైతే పెరిగి పెద్దవారయ్యే కొద్దీ ఎందరో సామాన్యులుగా మిగిలిపోగా, కొందరు మాత్రము మాన్యులుగా (పూజింపదగినవారుగా) తయారగుచున్నారు. కేవలము జ్ఞానమార్గములో ఉన్నవారు మాత్రమే మాన్యులుగా తయారవడము గుర్తింపదగిన విషయము. డబ్బున్నవాడే మాన్యుడని కొందరి ఉద్దేశ్యములో ఉండినప్పటికీ కేవలమది భ్రమమాత్రమే

అగును. పూర్తిగా మాన్యులు జ్ఞానమార్గమున ఉన్నవారు కొంత జ్ఞానశక్తి పరులై ఉండుట వలన వారిని మాన్యులుగా గుర్తించుట జరుగుచున్నది.

ఆత్మ ధర్మములను తెలిసినవారై వాటిని ఆచరించు వారియందు జ్ఞానాగ్ని అను శక్తి ఒకటి ఉద్భవించి ఉండును. అటువంటి జ్ఞానాగ్ని ఉద్భవించిన వారిని యోగులని అందుము. ఆత్మ ధర్మములను ఆచరించడమునే యోగమనుచున్నాము. అలా ఆచరించు వానిని యోగి అంటున్నాము. అలాంటి ఆత్మధర్మ ఆచరణ కల్గినవారు కొందరు భూమి మీద ఉండవచ్చును. అలాంటపుడు వారిలో ఎవరు పెద్ద, ఎవరు చిన్న, ఎవరు ఎంతటివారన్నది కూడ మనము తప్పక తెలుసుకోవాలి. ఉదాహరణకు బడికి పోవువారందరు విద్యార్థులే, విద్యార్థులన్న పేరు కలిగి ఉన్నంత మాత్రమున చదువులో వారందరూ ఒకే తరగతికి చెందినవారు కాదు కదా! అలాగే ఆత్మ ధర్మములు తెలిసి ఆచరించిన వారందరు యోగులే అయినంత మాత్రమున యోగులందరు సమానము కాదు. యోగులందు కూడ చిన్న గొప్ప యోగులుండుట సహజము. అందువలన పూర్వము తెలిసిన పెద్దలు యోగులందు కూడా తరగతులు నిర్ణయించినట్లు వారి స్థోమతలను గుర్తించి పేర్లు పెట్టి ఉన్నారు.

యోగులందు నాలుగు తరగతులను పూర్వము పెద్దలు విభజించి పేర్లు పెట్టినట్లు తెలియుచున్నది. దేవునియందైక్యమగుటకు ప్రయత్నించు వారు యోగులందు గల నాల్గు తరగతులు దాటవలసి ఉంటుంది. నాల్గి తరగతులు దాటిన తర్వాతనే మోక్షమను దానిని పొందగలరు. ఆ నాల్గి తరగతులలో ఉన్నవారి పేర్లు ఇలా ఉన్నవి. 1) మహర్షి 2) రాజర్షి 3) దేవర్షి 4) బ్రహ్మర్షి. పరమాత్మయందు ఐక్యమగుటకు ఒక సంపూర్ణ

శక్తి అవసరము. ఆ సంపూర్ణశక్తి యందు ఫాతిక (పావు) (1/4) భాగము శక్తిని సంపాదించుకొన్న యోగిని మహర్షి అని పిలిచెదము. అర్ధ (1/2) భాగము శక్తిని సంపాదించుకొన్న యోగిని రాజర్షి అని పిలిచెదము. ముప్పావు (3/4) భాగము శక్తిని సంపాదించుకొన్న యోగిని దేవర్షి అని పిలిచెదము. ఆ విధముగనే ముఫ్పాతిక నుండి పూర్తి వరకు శక్తిని సంపాదించుకొన్న యోగిని బ్రహ్మర్షి అని కూడా పిలుచుచున్నాము.

ఇపుడు కొన్ని సంశయములు కొందరికి రావచ్చును. అవి ఏవనగా! ఒకటి సంపాదించుకొను శక్తి కంటికి కనిపించునదియా? రెండు ఆ సంపాదించబడిన శక్తి ఫాతిక, అర్థము అని ఎట్లు తెలియును? ఇట్లు ఎన్నో సంశయములకు సమాధానములు కూడ వెతుకవలసి ఉంటుంది. వాటికి మా జవాబు ఏమనగా! యోగి సంపాదించుకొను యోగశక్తి కంటికి కనిపించునది కాదు. అందువలన ఇది ఇంత ఉందని తెలియదు. అందువలన ఎంతటి యోగికైన తన హోదా తనకు తెలియదు. దానివలననే గత కాలములో బ్రహ్మర్షి కావాలనుకొన్న విశ్వామిత్రునికి నీవు బ్రహ్మర్షివైనావు అని ఎదుటి వ్యక్తి చెప్పేవరకు తన హోదా తనకు తెలియలేదు. ఒక యోగియొక్క శక్తి గొప్పతనము ఎదుటి యోగికి మాత్రము తెలియును. అదియు కేవలము ఒక బ్రహ్మర్షి హోదాలో ఉన్న యోగి మాత్రము ఎదుటి యోగి ఎంత శక్తిగలవాడన్నది గుర్తించగలడు. అందువలన విశ్వామిత్రుడు బ్రహ్మర్షియైన విషయము మరొక బ్రహ్మర్షి అయిన వశిష్ఠుడు మాత్రము గుర్తించగలిగాడు. దీనినిబట్టి ఒక యోగి తనయందు ఏ హోదాకు తగిన శక్తి ఉందను విషయమును (తను మహర్షియా లేక రాజర్షియా లేక దేవర్షియా అట్లే బ్రహ్మర్షియా అన్న విషయమును) తనకు తానే గుర్తించుకోలేదని తెలియుచున్నది. ఒక బ్రహ్మర్షి మాత్రము ఎదుటి యోగిశక్తిని గ్రహించి ఇంత ఉంది! ఈ హోదాకు తగినవాడని చెప్పగలడు.

పూర్వకాలములో మనుషులు మహర్షుల తరగతులు ఇవి ఉన్నాయనీ, వీరు పలానా మహర్షి అనీ బాగా తెలిసి ఉండెడివారు. నేటి ప్రపంచములోని మనుషులకు మహర్షులను మాటకు అర్థమేమి అని కూడా తెలియకుండా పోయినది. వాటితో మాకేమి పని అనువారు తయారై ఉన్నారు. ప్రజలను జ్ఞానపరులుగా మార్చవలసిన స్వాములు, పీఠాధిపతులు కూడా కథలు చెప్పుచూ కాలమును గడుపజొచ్చారు. అందువలన పూర్వమున్న భావములు ఇపుడు తెలియకుండా పోయాయి. ఇపుడు మనము మహర్షి అను మాటకు పూర్వమున్న అర్థమేమో తెలుసుకుందాము. **'హర్షము'** అనగా సంతోషము. **'హర్షి'** అనగా సంతోషించువాడని అర్థము. మహ అనగ గొప్పయనీ, మహర్షియనగా గొప్ప సంతోషి అని అర్థము. ఒక యోగిని గొప్ప సంతోషి (మహర్షి) అనడమెందుకు? అని అంటే దానికి జవాబుగా యోగి ఆత్మానుభూతిని అనుభవించువాడని చెప్పెదము. ఆత్మానుభూతి ఎలాంటిదని అడిగిన అది మాటలకందని అనుభవము. దానిని గూర్చి బయటివారికి చెప్పాలంటే అది ఒక ఆనందమని వర్ణించారు. అనుభవములలో గొప్పది ఆనందమే కదా! అందువలన ఆత్మానుభూతిని ఆనందముగా వర్ణించారు. కానీ అది ఆనందము కూడా కాదు. అయినప్పటికీ దానిని వర్ణించుటకు చేతకాక ఆనందమని, బ్రహ్మానందమని పెద్దలు చెప్పారు. యోగమను దానిని ఆనందమని వర్ణించినవారు యోగమును అనుభవించు వానిని 'ఆనంద' అని కూడా వర్ణించారు. ఈ కాలములో కూడా బహుశ స్వాములన్న వారందరు ఆనంద అను పేరుతోనే ఉన్నారనుకొందాము అయినప్పటికీ ఎవరు ఎంత ఆనందో ఫాతిక ఆనందో, ముఫ్పాతిక ఆనందో ఎవరికీ తెలియదు. ఈ కాలము ఆనందలు పరంపరగా పేరు పెట్టుకొన్న ఆనందలై ఉన్నారు, కానీ పూర్వకాలము మాదిరిగా ఫాతిక,

ముఖ్యాతిక తరగతులున్నాయని తెలిసి పెట్టుకొన్న పేర్లు కాదు. అలా తెలిసి ఉంటే వీరందరూ ఉత్త ఆనందలు కాక రాజానంద, దేవానంద, బ్రహ్మానందలుగా మారి ఉండేవారు. ఇపుడు మేము చెప్పేవన్నీ కొందరికి క్రొత్తగా కనిపించినప్పటికీ పూర్వకాలము ఉన్నవేనని గ్రహించవలయును. 'ఆనంద' అను పదమును మహర్షియని కూడా అనవచ్చును. వాటి రెండు అర్థములు ఒకటే. అందువలన యోగి అయిన వానిని మహర్షి అని అనవచ్చును. మహర్షి శక్తికంటే ఎక్కువ శక్తికల్గిన వానిని రాజర్షి అనుటలో ఒక అర్థము కలదు. అన్నిటికంటే పెద్దదానిని రాజ అనుట సహజము. అందువలన మహర్షి తర్వాత గొప్ప దానిని రాజర్షి అన్నారు. మానవులలో రాజుకంటే గొప్ప దేవతలు అందువలన రాజర్షి తర్వాత దేవర్షి అన్నారు. దేవతలకంటే కూడా గొప్ప పరమాత్మ (దేవుడు). దానిని బ్రహ్మ అనుట సహజము కావున అన్నిటికంటే చివరి దానిని బ్రహ్మర్షి అన్నారు. మహర్షి, రాజర్షి, దేవర్షి, బ్రహ్మర్షి అను వరుస ప్రకారమే ఆనంద, రాజానంద, దేవానంద, బ్రహ్మానంద అను పదవులు గలవు.

ఈ కాలములో కూడా యోగులలో గొప్ప శక్తి గలవారు మహర్షుల వద్దనుండి రాజర్షి దేవర్షి బ్రహ్మర్షుల వరకు భూమి మీద ఉండవచ్చును. కానీ వారికి ఎదుటివాడు చెప్పేంతవరకు వారి అర్హత వారికే తెలియదు, కావున మేము ఇంతటివారమని తెలియని స్థితిలో ఉన్నవారు కూడా గలరు. కొందరు ఇదంతా నీకెట్లు తెలుసును? ఈ విషయములు ఎవరు ఎక్కడ చెప్పలేదు కదా! అలాంటపుడు నీవు చెప్పు మాటలు సత్యమని ఎలా నమ్మాలని ప్రశ్నించువారు కూడా కలరు. దానికి మా సమాధానము, మీరన్నట్లు చాలామంది ఎవరో ఎక్కడో చెప్పిన విషయములే తిరిగి తిరిగి త్రిప్పి త్రిప్పి వ్రాస్తుండడము వలన అటువంటి విషయములే చదువుచుండుట

వలన, ఈ విషయములు అలా లేవే అని అడగడములో తప్పులేదు. ఒక చెట్టు తియ్యని కాయలు కాచునట్లు పేరు పొందినదనుకొనుము. అప్పుడు కాయలమ్మే వాడు తన గంపలో కాయలు ఏ చెట్టువైనా ఫలానా చెట్టువేనని ఆ తియ్యని చెట్టు పేరు చెప్పి కాయలమ్ముకొనుచుండును. అలాగే కొందరు గత కాలములో ప్రజలందరిలో పేరు గలిగిన స్వాముల పేర్లు చెప్పుకొని ఇవి వారిమాటలే, ఇవి వారి రచనలేనని చెప్పుకొనుచుందురు. అలాగే పుస్తకములలో వ్రాయుచుందురు. ఉదాహరణకు మన దేశములో కాళికాదేవిని పూజించిన ఒక గురువు గొప్ప పేరుగాంచి ఉన్నాడు. ఆయన శిష్యుడు కూడా పేరుగాంచినవాడే. వారు వ్రాసినవి, వారు చెప్పినవి అంటే బాగా వినేవారు చదివేవారు గలరు. అటువంటి విషయము తెలిసి ఈ కాలము ఉపన్యాసకులు, రచయితలు వారి పేరు లేకుండ ఏవి చెప్పలేరు వ్రాయనూ లేరు. ఆ గురువుగానీ శిష్యుడుగానీ భగవద్గీతను వ్రాయకుండి నప్పటికి ఫలానా వారు వ్రాసిన భగవద్గీత అని వారి పేరుపెట్టి వ్రాసిన వారు కూడా కలరు. ఈ విధముగానే శంకరాచార్యులు చెప్పారని, రామక్రిష్ణ పరమహంస చెప్పాడని, వివేకానంద చెప్పాడని, రమణమహర్షి చెప్పాడని మొదలగు గొప్పవారి పేర్లు చెప్పి వారు చెప్పిన విషయములే ప్రస్తావించు వారు కూడా కలరు. కాని ఇక్కడ మేము ఎవరి పేరును ఉపయోగించు కోకుండా, వారు చెప్పిన విషయములు కాకుండా, ఈ కాలములో తెలియకుండా పోయినవి, పూర్వ కాలములో ఉన్న విషయములు చెప్పు చున్నాము. అంతమాత్రమున సత్యముకాదని చెప్పుటకు అవకాశము లేదు. ఎందుకనగా మేము చెప్పు విషయములు నేటికిని అర్థములేని ఆచారములుగా మిగిలి ఉన్నాయి. కావున అవియే మామాటలకు ప్రత్యక్ష ప్రమాణములుగ నిలుస్తున్నవి. పూర్వకాలములో మహర్షి, రాజర్షి, దేవర్షి,

బ్రహ్మర్షులు ఉన్నారను విషయము అందరికి తెలిసిన విషయమే అది ఈనాడు తెలియని విషయములుగా ఉండి వారి పేర్లు అర్థము తెలియనివిగా మిగిలి ఉన్నాయని కూడా అందరికి తెలుసు. అందువలన మేము చెప్పిన మాటలలో సత్యముందని కొందరైన గ్రహించగలరని నమ్ముచున్నాము. మా పేరు కూడా ప్రబోధానంద అని గురువు పెట్టాడు. ఆనంద అనునది మా పేరునందు కూడా ఉన్నది. కానీ తరగతుల ప్రకారము నేను ఏ ఆనందనో నాకు తెలియదు. అందువలన బ్రహ్మర్షులెవరైనా ఉండి నీవు ఇంత ఆనందవేనని తెల్పితే మేము సంతోషముగా వినగలము. ప్రబోధానందయే కాక యోగీశ్వరులను హోదా కలిగిన మేము ఏ తరగతివారమో మీ అనుభవముతో చెప్పండి.

*****

# శివము

ప్రపంచములో ప్రతి జీవి నిర్ణయింపబడిన వాయువు (ఆయువు) ప్రకారము జీవయాత్ర సాగించి మరణించుట సహజము. ఈ జీవయాత్ర నిర్ణీత వాయువు ప్రకారము ఒక శరీరమందు సాగుచున్నది. శరీరమను బండిలో **'వాయువు కొలత'** ఎచట అయిపోవుచున్నదో అక్కడ శరీరము నుండి జీవుడు దిగిపోవలసిందే. ఇది ప్రతి యొక్క జీవికి జరుగుచున్న విషయమే.

మనము ఒక ఊరికి బయలుదేరినపుడు ఆ ఊరు ఎంత దూరము ఉన్నది, మనము ఎక్కడ దిగవలయును అన్నియూ జ్ఞప్తిలో పెట్టుకొని ప్రయాణిస్తూ ఉంటాము. గమ్యము దూరమైతే దానికి తగిన ఖర్చు నిమిత్తము

ఎంత డబ్బుకావాలో అంతే దగ్గర పెట్టుకుంటాము. అట్లే ఆ ప్రయాణములో ఎవరితో స్నేహము చేసినప్పటికీ, దిగిపోవునంత వరకే ఆ స్నేహముండునని తెలిసి అంతవరకే పరిచయమేర్పరుచుకొంటాము. ఇది గమ్యము తెలిసిన ప్రయాణము కనుక ఈ ప్రయాణములో బంధాలు అనుబంధాలు ఏమీ పెట్టుకోము.

జీవనప్రయాణములో మరణమను 'గమ్యము' అందరికీ ఉందని తెలుసు. కానీ ఆ గమ్యము ఎంత దూరమున్నది ఎవరికీ తెలియదు. అది ఎపుడొచ్చునది కూడా తెలియదు. 50 కి.మీ వేగము గల వాహనముపై ప్రయాణించిన ఢిల్లీ వెళ్ళాలంటే 8 దినములు, అమెరికా వెళ్ళాలంటే నెలరోజులు ప్రయాణకాలమని తెలిసినపుడు సాటి ప్రయాణికులతో అంటీ అంటని స్నేహమే చేస్తాము. కానీ మన శరీర వాహన ప్రయాణము **'ఇంత కాలమని'** తెలియనప్పటికీ మన సాటి ప్రయాణీకులతో పూర్తి బంధాలు ఏర్పర్చుకోవడము జరుగుచున్నది. మన ప్రయాణము దినమో, అర్ధదినమో తెలియకున్నపుడు బంధాలు ఏర్పరచుకోవడములో అర్థములేదు. ఢిల్లీ ప్రయాణము తప్పనిసరి వారముదినములనీ తెలిసినప్పటికీ సాటి ప్రయాణికులతో బంధము పెట్టుకోము. మన దేహప్రయాణము వారము రోజులని కూడా నమ్మకములేనపుడు బంధాలు ఏర్పరుచుకోవడము జ్ఞాన రహితమని తెలియాలి. జ్ఞానసహితముగా యోచిస్తే సాటి ప్రయాణికులుగా ఎందరో శరీరములందు జీవితము సాగించుచున్నప్పటికీ ఎవరి గమ్యము వారిది. ఎవరిది ఏ గమ్యము వరకు ప్రయాణమో అంతవరకే సాగి నిలిచిపోవును. నీ వెంట ఖచ్చితముగా నీ గమ్యము వరకు ప్రయాణించువారు ఎవరూ ఉండరు. ఆ విషయము అందరూ ఒప్పు కోవలసినదే. కానీ ఇది కొంత వరకు వాస్తవమే. అయితే మనకు తెలియని వాస్తవము మరి

యొకటున్నది. అది ఏమనగా సహజముగా బయట కనిపించు నీ సాటి నీ తోటి ప్రయాణికులు నీ గమ్యము వరకు రాకున్ననూ నీకు కనుపించకుండా నీతో ప్రయాణము చేయువారు మరి **'ఇద్దరున్నారు'** వారిలో ఒకడు పేరున్నవాడు మరియొకడు పేరు లేనివాడు. ఒకనికి **'ఆత్మ'** అని పేరుగలదు. రెండవవానికి పేరేలేదు గనుక, 'ఆత్మ'కు పరముగా ఉన్నవాడు కనుక, అతనినే **'పరమాత్మ'** అనియు, అతనినే **'ఈశ్వరుడు'** (అధిపతి) అనియు, **'శివుడు'** అనియు, **'దేవుడు'** అనియు అనేక విధముల హోదాలతో పిలుచుచున్నాము.

నీవు **'జీవాత్మ'**వని నీకు కూడా తెలుసు. కానీ నీవు శరీరము అను బండిలో ప్రయాణిస్తూ ఉన్నావని మరచినావు. మరియు నీతో కూడా ఎల్లకాలము మరి **'ఇద్దరు'** ఉన్నారని కూడా తెలియదు. కొంత జ్ఞానచూపుతో గమనించి చూచితే నీ శరీరములో **'ముగ్గురు'** ప్రయాణిస్తున్నారు.

ఈ విధముగా అన్ని జీవరాసుల శరీరములలోను 'ప్రయాణము' జరుగుచున్నది. శరీరములో 'ఆత్మ, పరమాత్మ'ల తోటి నీకు (జీవాత్మకు) ఉన్న బంధమేమిటి? వారితో ఎంత స్నేహముగా ఉన్నావని యోచిస్తే జీవాత్మ ఏమాత్రము వారితో సంబంధాలు పెట్టుకోవడము లేదు. ఇపుడు ఇది చదివేవానికి నీకున్నాయా! అంటే ఏమాత్రము లేవనియే చెప్పవచ్చును. ఉన్నదంతా మన ముందర పోయే వారితోనో, మన తర్వాత పోయే వారితోనో బంధాలు పెట్టుకొని, వారితోనే కాలమంతా గడచిపోతుంటే, లోపలి ఆత్మ పరమాత్మను వారితో బంధాలు ఏర్పరుచుకొనే తీరిక ఓపిక ఎవ్వరికి లేవు. కాని నీవు లోపల ఉన్న వారివైపు చూడకున్ననూ వారు నీవైపు చూస్తున్నారు. వారితో బంధము పెట్టుకోకున్ననూ వారి బంధము ఎల్లవేళలా నీతో ఉన్నది.

వారి సంబంధములేకపోతే శరీరములో మనమొక నిమిషము కూడా ఉండలేము. శరీర వాహనములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మలు ప్రయాణిస్తూ 'గమ్యము' చేరుకోగానే శరీర వాహనము నుండి జీవాత్మ దిగిపోవును. అతనొక్కడే కాదు అతనితో పాటు ఆత్మ కూడా దిగిపోవును. నీతో పాటు జీవయాత్ర మొదలిడి, నీతో పాటు గమ్యములో దిగిపోవువాడు ఆత్మ ఒక్కడే. ఈ విషయమును భగవద్గీత పురుషోత్తమప్రాప్తి యోగము అను అధ్యాయమున 8వ శ్లోకములో చెప్పబడినది.

నీ గమ్యములో నీతో ప్రయాణించు ఇద్దరిలో ఒకరు మాత్రము దిగిపోవుదురు. పరమాత్మ ఆత్మకంటే వేరుగా ఉన్నాడు కనుక పరమాత్మ అట్లే శరీరములో ఉండును.

సజీవయాత్రలో జీవుడు సుఖదుఃఖములను అనుభవించుచుండును. ఆ సుఖదుఃఖముల అనుభవములకు కావలసిన కార్యాచరణలకు చైతన్యము నిచ్చి శరీరమును కదలించువాడు రెండవవాడైన ఆత్మ. మూడవ వాడైన పరమాత్మ సాక్షిగా అన్నింటినీ చూస్తూ ఏమీ చేయక మౌనముగా ఉన్నాడు. జీవుడు శరీరములో ఉన్నప్పుడుగానీ మరియు లేనపుడుగానీ స్తబ్ధతగ ఉండువాడు శివుడు లేక ఈశ్వరుడు లేక పరమాత్మ. ఏమియూ కానీ ఈ మూడవ వానిని పరమాత్మ అనడములో అంతరార్థము తెలుసుకొన్నాము కదా! అట్లే ఈశ్వరుడని ఎందుకంటున్నామో వివరముగా తెలుసుకుందాము.

అధిపతి అనగా మించినవాడు, పెద్దవాడు అని గొప్పవాడని అర్థమగుచున్నది. అట్లే లక్షాధిపతి అనగా లక్షకు అధిపతి అనియు, లక్షకు మించినవాడని, లక్ష కలవాడని అర్థమగును. ఆ విధముగా లక్షాధీశ్వరుడు,

కోటీశ్వరుడు అనడములో లక్షకు కోటికి, అధిపతియని వాటికంటే గొప్పవాడని తెలియుచున్నది. ఈ ప్రపంచములో లక్ష, కోటి, అది, ఇది అనకుండా అన్నింటికీ, సమస్తమునకూ అధిపతియైనవాడు 'పరమాత్మ' ఒక్కడే. కావున ఫలానా దానికి ఈశ్వరుడనకుండా మొత్తము మీద ఏకైక పదముగా ఈశ్వరుడు అనడము జరిగినది. ఎక్కడా గుర్తించలేని దానిని, అంతటా ఉన్నదానిని, దేనికీ తెలియని దానిని, బ్రతికి ఉన్నవానికి, జ్ఞానులకు, యోగులకు కూడా తెలియనిది, అగమ్యగోచరమైనది కావున దానికి **'శివము'** అని పేరుపెట్టబడినది. **"శివం"** అనగా తెలియనిదని అర్థము. జ్ఞానులకు యోగులకు 'శివము' అన్నది ఒకటున్నదని తెలుసు. అది ఏది అని మాత్రము తెలియదు. జీవుడు జ్ఞానయోగము చేత శరీరమందున్న ఆత్మను తెలియవచ్చును కాని 'శివము'ను మాత్రము తెలియలేడు. కర్మ అయిపోయిన తర్వాత జన్మలేని స్థితిని చేరు యోగులు శివమునందు ఐక్యమై పోవుదురు. అదేదో అప్పుడే తెలుస్తుంది కానీ ముందు తెలియదు.

శరీరమందు జీవయాత్రలో మరణమను 'గమ్యము' లో ఆత్మ, జీవాత్మలు శరీరము నుండి నిష్క్రమించగా చివరకు శరీరములో మిగిలి పోవునది 'శివము'. బ్రతికి ఉన్నపుడు నీచమైన గుణములతో సంబంధమున్న 'జీవుడు' శరీరములో లేడు. ఏ నీచ భావాలు అందులో లేవు. అప్పుడది శుద్ధ 'శివ' నిలయము. అందులో పరమాత్మ తప్ప మరెవ్వరూలేరు. కనుక ఆ విషయము తెలిసిన జ్ఞానులు, యోగులు ఒక వ్యక్తి మరణిస్తే ఆ మృత శరీరములకు అంత్యక్రియలకు మునుపు మృతదేహమును పూర్తి భక్తిగా పూజించెడివారు. దైవసంబంధములైన విభూతి నామములతో అలంకరించి గోవిందనామస్మరణతో పూజించి అందరినీ మ్రొక్కమనెడివారు. అటువంటి సాంప్రదాయము ఇప్పటికీ ఉన్నప్పటికి అది అర్థము తెలియని ఆచారమైనది.

ఇపుడు మ్రొక్కెడివారు భక్తితోకాక భయముతో మ్రొక్కుచున్నారు. ఒకవేళ మ్రొక్కని ఎడల చనిపోయిన వారు తిరిగి దయ్యముగా వస్తారని, వారి పీడ ఇంటి చుట్టూ ఉంటుందని, మ్రొక్కితే వారి పీడ అంతటితో పోతుందని మ్రొక్కుచున్నారు.

పూర్వము అలాచేయలేదు. వారు ప్రతిపని అర్థము తెలిసి చేసెడివారు. జీవుడు పోయిన తర్వాత చివరగా మిగిలినది 'శివము' అని వారికి తెలుసు. అందువలన మరణించబడిన శరీరమును (మృత దేహమును) శివము అని పిలిచెడి వారు. కాలక్రమేపి భావము పోయినది. చివరకు **'శివము'** అను పదము **'శవము'** అయినది. 'శివము' శవము అయినప్పటికీ పూర్వము నుండి ఉండు పూజలు మొదలగు ఆచరణలు అలాగే ఉన్నవి. కావున దాని నిజమైన అర్థము నేడు మాసిపోయినదని తెలియుచున్నది.

కర్మ సశేషముగా అయిపోయిన యోగులు మరుజన్మకు పోక మూడవ పురుషుడైన పరమాత్మలోనికి ఐక్యమై పోవుదురు. అట్టివారు మరణించు సమయములో తమ శరీరమును వదలిపోరు. శరీరమందే గల శివములోనికి ఐక్యమైపోవుదురు. అట్టి వారి శరీరమును చివరి దినములో పూజచేయడమే కాక సమాధిలో ఉంచి చిరకాలము పూజలు చేయడము కూడా పెద్దల నిర్ణయమే. అలా చేయడము వలన సాక్షాత్తు పరమాత్మనే ఆరాధించినంత ఫలితము ఉండునని వారికి తెలుసు.

శవము విషయములో ఇపుడు మనము కొంత తెలుసుకొన్నాము. అది శవము కాదు శివము అని నిజముగా తెలిసినది. కావున శవమును శుభ సూచకముగా భావించవలయును. అందరివలె పీడ, పిశాచి,

అనుకోకూడదు. ఏ పూజ విధానములో పాల్గొనలేక పోయిననూ ఫరవా లేదు. శవమును 'శివము'గా చూడండి. అంత్యక్రియలు చేయలేని వారికి సహాయపడండి. ముస్లీమ్‌మతములో ఏమి తెలియనివారైనా శవమును చూస్తూనే పనులన్నీ వదలిపెట్టి పోయి పోటీపడి శవపేటికను మోయుట చూచియే ఉందురు. అదే క్రిస్టియన్ మతములో అయితే మత గురువు బైబిలు చదువుచూ భక్తిగా అంత్యక్రియలు చేయుట చూస్తూనే ఉన్నాము. అన్నిటికంటే ముందు పుట్టిన హిందూమతములో నామమాత్రపు ఆచారములతో ఇంటిలోనివారే ఇష్టము లేక పోయినా మృతదేహమునకు స్నానము చేయించి బొట్టు పెట్టి పంపిస్తూ ఉన్నారు. భక్తి జ్ఞానము సమిసిపోవుచున్నది. అర్థము తెలియని ఆచారముతో పూజ చేస్తూ 'శివము'ను శవము అంటున్నవారందరూ, శవమును శివముగా చూచి నిజమైన భక్తితో చనిపోయిన వానికి కాదు, వానిలో ఉన్న దేవునికి అను భావముతో పూజ చేసి అంత్యక్రియలు చేయాలి. చనిపోయిన వారు యోగి అయితే అటువంటి శరీరము దొరకడమే అదృష్టమనుకొని, ప్రత్యేకమైన చోట సమాధి చేసి, నిత్య పూజలు చేయడము చాలా మంచిది. అటువంటి శరీర సమాధి దైవశక్తి నిలయమై ఉండును. ఆ సమాధికి పూజించుకొను వారి కర్మలు కాలిపోవుచుండును.

*****

# ప్రాణాయామము

జీవుల శరీరములందు ఐదు వాయువులున్నవి. వాటిని పంచ ప్రాణములని అందురు. ఈ ఐదు వాయువులకు ఐదు ఉపవాయువులు

ఉన్నవి. అవి ఈ ఐదు వాయువులయందే ఇమిడి ఉండును. పంచ ప్రాణములని పేరుగాంచిన ఈ ఐదు వాయువులు ఒక్కటి కావడమును **"ప్రాణాయామము"** అని అందురు. ప్రాణాయామము రెండు రకములుగా ఉన్నది. ఆ రెండు రకములు ఎట్లు ఉన్నవనగా! జీవులు శ్వాసను పీల్చడమును పూరకము (ఉశ్ఛ్వాసము) అనియు, శ్వాసను బయటికి వదలడమును రేచకము (నిశ్ఛ్వాసము) అనియు, లోపలకు పీల్చిన శ్వాసను బయటికి వదలకుండా లోపలనే బిగించి ఉంచడమును కుంభకము అనియు అందురు. కుంభకము ద్వారా శ్వాసను బిగించి లోపల ఉన్న వాయువు లన్నిటినీ ఏకము చేయడము ఒక విధ ప్రాణాయామము. జీవుడు కుంభించి శ్వాసను నిలుపకనే యోగము వలన శ్వాస తనంతట తాను నిలిచిపోయి లోపల ఉన్న వాయువులన్నియు ఏకము కావడము వేరొక విధ ప్రాణాయామము. ఈ రెండు విధములయందు ఏది జరిగినా దానిని ప్రాణాయామము అనియే అందురు. రెండు రకముల ప్రాణాయామములలో కుంభించి శ్వాసను నిలుపు పద్ధతి చాలా కష్టమైనది, మరియు ప్రాణా పాయకరమైనది. రెండవ పద్ధతి కష్టము లేనిది, మరియు ప్రాణా పాయకరము లేనిది. రెండు పద్ధతులను ఆమూలాగ్రముగా తెలుసు కొందాము.

ప్రతి మానవుని శరీరమందు బ్రహ్మనాడి ఉన్నది. దానినే వెన్నుపాము అని అందురు. బ్రహ్మనాడి మెదడు నుండి ప్రారంభమై వీపునవున్న వెన్నెముక ద్వారా గుదస్థానము వరకు వ్యాపించి ఉన్నది. మెదడునుండి క్రిందివరకు వ్యాపించియున్న బ్రహ్మనాడియందు ముఖ్యమైన నరాశయ కేంద్రములు ఏడు ఉన్నవి. ఈ నరాశయ కేంద్రములనే సప్తస్థానములనియు, సప్తచక్రములనియు, సప్త కమలములనియు యోగులు

అంటున్నారు. ఈ నరాశయ కేంద్రములే మానవున్ని చలించునట్లు అన్ని పనులు చేయునట్లు చేయుచున్నవి. మరియు శరీరము లోపలయున్న అవయవములను, బయటనున్న అవయవములను పని చేయునట్లు చేయుచున్నవి. ఈ నరాశయ కేంద్రములనుండి బయల్పడిన నరములే ఊపిరితిత్తులను ముడుచుకొనునట్లు వికసించుకొనునట్లు చేయుచున్నవి. ఊపిరితిత్తులు ముడుచుకొన్నపుడు శ్వాస బయటికి పోవుచున్నది దానినే నిశ్వాసము అని అందురు. ఊపిరితిత్తులు తెరచుకున్నపుడు శ్వాస లోపలికి ప్రవేశించుచున్నది దానినే ఉశ్వాసము అని అనుచున్నారు. బ్రహ్మనాడి యందుగల నరాశయ కేంద్రములే తమనుండి బయలుదేరి వచ్చిన నరములతో ఊపిరితిత్తులను ఆడించుచూ, జీవునికి ఉశ్వాస నిశ్వాసలు జరుగునట్లు చేయుచున్నవి. జీవునికి శ్వాస లోపలికిపోయి బయటికి వచ్చిన ఒక్క శ్వాస గడచినట్లగుచున్నది. శ్వాసనే హంస అని కూడా అందురు. ఇట్లు దినమునకు 21,600 శ్వాసలు జీవునికి గడుచుచుండును. ఈ 21,600 శ్వాసలు గడుచునట్లు బ్రహ్మనాడియందుగల కేంద్రములే చేయుచున్నవి. ఆ కేంద్రములు శ్వాసను ఎట్లు నడుపుచున్నవనగా! బ్రహ్మనాడియందు ఏడు కేంద్రములు కలవుకదా! అందు అన్నిటికంటే క్రిందయున్న కేంద్రమును ఆధారకమలము అని అనుచున్నారు. ఈ కేంద్రము గుదస్థానమునకు సమానగముగా ఉన్న వెన్నెముకలోని బ్రహ్మనాడిలో ఉన్నది. కావున ఆధారకమలము (ఆధారచక్రము) గుదస్థానమువద్ద ఉన్నదని పెద్దలు అనుచున్నారు. ఈ ఆధారచక్రమనబడు నరాశయ కేంద్రము నుండి బయల్పడిన కొన్ని నరములు ప్రక్కన ఉన్న సూర్యచంద్రనాడులతో కలసి ఊపిరితిత్తులకు పోయి ఉండును. సూర్యచంద్ర నాడులనునవి బ్రహ్మనాడికి రెండు ప్రక్కల రెండు ఉన్నవి. బ్రహ్మనాడికి

కుడిప్రక్కయున్న నాడిని సూర్యనాడి అనియు, ఎడమప్రక్కన ఉన్న నాడిని చంద్రనాడి అనియు, పెద్దలు చెప్పుచుందురు. వీటినే ఇడ, పింగళ నాడులు అనికూడ అనుచున్నారు. వీటినే డాక్టర్లు సింపతెటిక్ దండలు (Sympathetic Chains) అని కూడా అనుచున్నారు. చివరగాయున్న ఆధార నరాశయ కేంద్రము తన నరముల ద్వారా ఊపిరితిత్తులను సూర్యోదయము మొదలుకొని 600 శ్వాసలు గడుచు వరకు నడుపును. 600 శ్వాసలు గడిచిన వెంటనే తన పనిని విరమించుకొనును. ఆ తర్వాత రెండవ నరాశయ కేంద్రమున్నది కదా! ఆ రెండవ దాని పేరు **స్వాధిష్ఠాన పద్మము (స్వాధిష్ఠాన చక్రము)** అని అంటున్నారు. ఈ కేంద్రము స్త్రీలకు యోని స్థానమునకు సరిగ, పురుషులకు లింగస్థానమునకు సమానముగాయున్న వెన్నెముకలోని బ్రహ్మనాడియందు కలదు. కావున స్వాధిష్ఠానచక్రము లింగస్థానము వద్ద ఉన్నది అనుచున్నారు. ఈ స్వాధిష్ఠానచక్రమనబడు నరాశయ కేంద్రము నుండి బయల్పడిన కొన్ని నరములు ప్రక్కనున్న సూర్యచంద్ర నాడులతో కలిసి ఊపిరితిత్తులకు పోయి ఉండును. రెండవ కేంద్రమైన ఈ స్వాధిష్ఠాన కేంద్రము తన నరముల ద్వారా ఊపిరితిత్తులను మొదటి కేంద్రము పని చాలించుకొన్నది మొదలు 6000 శ్వాసలు గడుచునంత వరకు నడుపుచుండును. 6000 శ్వాసలు అయిపోయిన వెంటనే తన పనిని విరమించుకొనును. ఆ తర్వాత మూడవ నరాశయ కేంద్రము ఉన్నది కదా! ఆ కేంద్రము పేరు **మణిపూరక పద్మము (మణిపూరక చక్రము)** అని అనుచున్నారు. ఈ కేంద్రము నాభి (బొడ్డు)కు సమానముగా ఉన్న వెన్నెముకలోని బ్రహ్మనాడియందు ఉన్నది. కావున మణిపూరక చక్రము నాభి స్థానము వద్ద ఉన్నది అని అనుచున్నారు. ఈ మణిపూరక పద్మమనబడు నరాశయ కేంద్రమునుండి ప్రారంభమైన నరములు కొన్ని

ప్రక్కనున్న సూర్యచంద్రనాడులతో కలిసి ఊపిరితిత్తులకు పోయివుండును. మణిపూరక నరకేంద్రము తన నరముల ద్వారా ఊపిరితిత్తులను రెండవ కేంద్రము తన పనిని చాలించుకొన్నది మొదలు 6000 శ్వాసలు అయిపోవు వరకు నడుపుచుండును. 6000 శ్వాసలు అయిపోయిన వెంటనే తన పనిని విరమించుకొనును. ఆ తర్వాత నాల్గవ నరాశయ కేంద్రమున్నది కదా! ఆ నాల్గవ నరాశయ కేంద్రము పేరు **అనాహత నరాశయ కేంద్రము లేక అనాహత పద్మము (అనాహత చక్రము)** అని అనుచున్నారు. ఈ కేంద్రము హృదయమునకు సరిగయుండు వెన్నెముకలోని బ్రహ్మనాడియందు ఉన్నదని అనుచున్నారు. నాల్గవ చక్రమయిన అనాహత కేంద్రము నుండి బయలుదేరిన కొన్ని నరములు ప్రక్కన ఉన్న సూర్యచంద్రనాడులతో కలిసి ఊపిరితిత్తులకు పోయి ఉండును. అనాహత నరకేంద్రము తన నరముల ద్వారా ఊపిరితిత్తులను మూడవ కేంద్రము తన పనిని చాలించుకొన్నది మొదలు 6000 శ్వాసలు అయిపోవు వరకు నడుపుచుండును. 6000 శ్వాసలు అయిపోయిన వెంటనే తన పనిని విరమించుకొనును. ఆ తర్వాత ఐదవ నరాశయ కేంద్రమున్నది కదా! ఆ ఐదవ నరాశయ కేంద్రము పేరు **విశుద్ధపద్మము (విశుద్ధచక్రము)** అని అనుచున్నారు. ఈ కేంద్రము కంఠ స్థానమునకు సరిగా ఉన్న వెన్నెముకలోని బ్రహ్మనాడియందు ఉన్నది. విశుద్ధ చక్రము నుండి బయలుదేరిన కొన్ని నరములు ప్రక్కనున్న సూర్య చంద్ర నాడులతో కలిసి ఊపిరితిత్తులకు పోయివుండును. విశుద్ధ నరకేంద్రము తన నరములతో ఊపిరితిత్తులను నాల్గవకేంద్రము పనిని చాలించుకొన్నది మొదలు 1000 శ్వాసలు అయిపోవువరకు నడుపుచుండును. 1000 శ్వాసలు అయిపోయిన వెంటనే తన పనిని విరమించుకొనును. ఆ తర్వాత ఆరవ నరాశయ కేంద్రమున్నది కదా! ఆ ఆరవ నరాశయ కేంద్రము పేరు

**ఆగ్నేయ పద్మము (ఆగ్నేయచక్రము)** అని అనుచున్నారు. ఈ కేంద్రము కనుబొమల మధ్యకు సరిగా (భూమధ్య స్థానముకు సరిగా) తలలో ఉన్న బ్రహ్మనాడియందు ఉన్నది కనుక ఆగ్నేయచక్రము భూమధ్య స్థానము వద్ద ఉన్నదని అనుచున్నారు. ఆరవ నరకేంద్రమైన ఆగ్నేయచక్రము నుండి బయలుదేరిన కొన్ని నరములు ప్రక్కనున్న సూర్యచంద్రనాడులతో కలిసి ఊపిరితిత్తులను చేరియుండును. ఆగ్నేయ నరకేంద్రము తన నరముల ద్వారా ఊపిరి తిత్తులను ఐదవచక్రము పని చాలించుకొన్నది మొదలు 1000 శ్వాసలు అయిపోవువరకు నడుపుచుండును. 1000 శ్వాసలు అయిపోయిన వెంటనే తనపనిని విరమించుకొనును. ఆ తర్వాత ఏడవ నరకేంద్రమున్నది కదా! ఆ ఏడవ నరకేంద్రము పేరు సహస్రార పద్మము (సహస్రారచక్రము) అనుచున్నారు. ఈ కేంద్రము శిరస్సు మధ్య భాగముననున్నది. ఈ కేంద్రము నుండి బయలుదేరిన కొన్ని నరములు ప్రక్కనున్న సూర్య చంద్రనాడులతో కలిసి ఊపిరితిత్తులను చేరియుండును. ఏడవ నర కేంద్రమైన సహస్రారపద్మము తన నరముల ద్వారా ఊపిరితిత్తులను ఆరవ కేంద్రము పనిని చాలించుకొన్నది మొదలు 1000 శ్వాసలు జరుగునంత వరకు నడుపుచుండును. 1000 శ్వాసలు అయిపోయిన వెంటనే తిరిగి మొదటి కేంద్రమైన ఆధారచక్రము ఊపిరి తిత్తులను నడుపుటకు ప్రారంభించును. దాని తర్వాత రెండవ కేంద్రము ఊపిరితిత్తులను నడుపుచుండును. ఏడవ కేంద్రమైన వెంటనే మొదటి కేంద్రము పని ప్రారంభించును. కనుక అన్ని వేళలయందు శ్వాస నడుస్తూనే ఉన్నది. అన్ని చక్రములు కలిసి మొత్తము 21,600 శ్వాసలను నడుపు చున్నవి. సూర్యోదయము మొదలుకొని అన్ని చక్రములు పనిచేయుటకు తిరిగి సూర్యోదయము వచ్చుచున్నది. కావున ఒక్క దినమునకు 21,600 శ్వాసలు జరుగుచున్నవని తెలియుచున్నది.

కొన్ని గ్రంథములయందు లోపలనున్న చక్రములకు శ్వాస ప్రదక్షిణలు చేసి వస్తున్నదని వ్రాసినారు. శ్వాస చక్రముల వరకు పోయి ప్రదక్షిణలు చేసి రావడము అనుమాట శుద్ధ అబద్ధము. శ్వాస చక్రములకు ప్రదక్షిణలు చేసి వస్తున్నదని డాక్టర్లు విినినంతనే ఈ మాట అబద్ధము అని అనుచున్నారు. దానితో శరీర పరిశోధకులైన డాక్టర్లు బ్రహ్మ విద్యయంతటినీ అబద్ధము అనుకొను పరిస్థితి ఏర్పడినది. ఈ విషయములో బ్రహ్మవిద్యలో పూర్తి పరిశోధనలు జరుపనివారు, మొదట ఒకరు చెప్పగా పరంపరగా అదే మాటను అందరూ చెప్పుచూ పోయినారు, కావున శ్వాస ఎక్కడికో పోయివస్తున్నదని తెలిపినారు. ఎక్కడికో పోయి వచ్చు మాట అబద్ధము. శ్వాస ఊపిరితిత్తుల వరకే పోయివచ్చుచున్నదని తెలుసుకోవలయును. బ్రహ్మవిద్యలో ఏమాత్రము పరిశోధన చేయక, ఫలితమును కనిపెట్టలేక పోయినా, ఎవడో ఒకడు చెప్పిన మాటను పట్టుకొని అందరు అదే మాటను చెప్పుచూ పోవుచుందురు. ఇది నిజమెంత? అబద్ధమెంత అని ఏమాత్రము విశదీకరించుకొని సాధన ద్వారా తెలుసుకోవడము లేదు. అటువంటివారు కుండలీశక్తి పాము మాదిరి ఉందని, అది నిద్రపోవుచున్నదని, స్ప్రింగుచుట్ట ఆకారముతో నాభిస్థానము వద్ద ఉన్నదని నానావిధములుగా చెప్పుచున్నారు. వారు చెప్పుచున్నది నిజమేనా అని వారికే తెలియక పోయినా తెలిసినవారు చెప్పితే వారిమాట వినక నిజముగా చూచిన వారిమాదిరి వాదించు చున్నారు. మాటలు బహునేర్చి వాదనలలో గట్టివారు అని అనిపించు కొనినా, ఎంతోమందితో అభినందనలు పొందినా, నిజము తెలియనిది ఏమీ ప్రయోజనము లేదు. పరమాత్మ మన వాదనలను ఒప్పుకోడు. కావున ప్రతి విషయమును మీరు స్వయముగా తెలుసుకుంటే ఎంతో బాగుండును. వారు చెప్పినారు, వీరు చెప్పినారని వారి మాదిరే మనము చెప్పుచూ పోయిన,

ఒక గొర్రె బావిలోనికి దూకితే మిగతా గొర్రెలు కూడా అట్లే దూకినట్లుండును. కావున కుండలీశక్తి అంటే ఏమిటి? దానికి ఆకారమున్నదా? దానికి నిదుర మెలుకువలు మనకున్నట్లున్నవా? అను ప్రశ్నలకు సరైన సమాధానములు తెలుసుకోవలయునని కోరుచున్నాను.

బ్రహ్మనాడియందు మొత్తము ఏడు కేంద్రములున్నవికదా! అందు ఏడు కేంద్రములు ఒక్కొక్కటి ఒక్కొక్క శక్తి కలిగి ఉన్నవి. ఆ శక్తులు కొంతమంది దేవతా శక్తులకు సమానమైయున్నవి. కావున పెద్దలు ఆయాచక్రములలో ఆయా దేవతలున్నారని తెలిపినారు. ఏడు కేంద్రముల శక్తి కూడలినే **"కుండలీశక్తి"** అని కొందరు పెద్దలు చెప్పుచున్నారు. కొందరు అజ్ఞాన వశమున కుండలీశక్తి నిదురించుచున్నది, దానిని నిదురలేపవలెను అని అనుచున్నారు. ఏడు కేంద్రముల చైతన్యమునే కుండలి అనబడు చున్నది. ఆ కుండలీశక్తి ఎల్లవేళలా ఊపిరితిత్తులను ఆడించు పనియందు నిమగ్నమై, మరియు శరీరమున కొన్ని పనులు వర్తించుటయందు లగ్నమై, ఎల్లవేళల పనిచేయుచుండగా ఎలా నిదురించుచున్నదని చెప్పనగును. ఏడు కేంద్రముల చైతన్యము (కుండలీ) ఎరుక యందులేక మరుపుకు (నిద్రకు) పోయిన జీవుడు చనిపోవును. స్వానుభవముతో పరిశోధించని భక్తులు కొందరు పొరపాటుతో కుండలీ శక్తి అనుదానిని వేరొక విధముగా పోల్చుకొని తికమకపడుచున్నారు. కుండలీశక్తి అనునదియే బ్రహ్మనాడియందలి చైతన్యశక్తి, అదియే ఆత్మశక్తి బ్రహ్మనాడి ఏడు భాగములుగా యోగవిద్య యందు విభజింపబడి ఉన్నది. అందు ఏడు భాగముల వరకు ఉండు చైతన్యశక్తిని కుండలీశక్తి అని పిలుచుచున్నాము. ఏడవ కేంద్రములో శక్తి లేకున్న ఆరు కేంద్రములలో శక్తి లేకుండా పోవును. ఏడవ కేంద్రములో ఉన్న శక్తి ఏ దేవతాశక్తికి సమానమైనది కాదు. ఏడవ కేంద్రములో ఉన్న శక్తిని తెలుసుకొన్నవారే యోగులు.

బ్రహ్మనాడియందు బయలుదేరిన కొన్ని నరములు ప్రక్కనున్న సూర్యచంద్రనాడులలోనికి పోయి, అక్కడినుండి ఊపిరితిత్తులకు పోయి ఊపిరితిత్తులను ఆడునట్లు చేయుచున్నవి. ఈ విధముగా ఆడు శ్వాసలను మనిషి రెండు పద్ధతుల ద్వారా నిలుపుచున్నాడు. అనగా అనిచ్ఛాధీనముగా ఉన్న అవయవములను ఇచ్ఛాధీన అవయవములుగా మార్చుశక్తి ఒక్క యోగులకు మాత్రమే ఉండును. యోగికి శ్వాస రెండు పద్ధతుల ద్వారా ఎట్లు నిలుచుచున్నదో తెలుపుదును.

శ్వాసను కుంభించి నిలిపి మనస్సును బ్రహ్మనాడియందు చేర్చ వలయునని అనుకొన్న యోగి, ఒక స్థలమునందు కదలక కూర్చొని మొదట శ్వాసను ఊపిరితిత్తుల నిండా ఏమాత్రము ఖాళీ లేకుండా పీల్చును. పీల్చిన శ్వాసను ఏమాత్రము బయటికి వదలకుండా మూడు లేక నాలుగు నిమిషములుండును. ఇట్లున్న తర్వాత మరిము బయటి గాలినే లోపలికి పీల్చును. ఇక్కడ గమనింపవలసిన విషయము మొదట ఊపిరితిత్తులు ఏమాత్రము ఖాళీ లేకుండా గాలి పీల్చినాడు కదా ఖాళీలేని ఊపిరితిత్తు లందు తిరిగి గాలి ఎట్లు ప్రవేశించినదనీ అనుమానము కలుగవచ్చును. దానికి సమాధానము మొదట ఖాళీలేని ఊపిరితిత్తులందు మూడు నాలుగు నిమిషములు తర్వాత కొద్దిగా ఖాళీ ఏర్పడియుండును. ఆ ఖాళీస్థలము ఎట్లేర్పడినదనగా ఊపిరితిత్తులయందున్న గాలి మూడు నాలుగు నిమిషములకు బయటికి రావలయునని ప్రయత్నించును. కానీ బయటికి రాకుండా నిరోధించి ఉన్నందువలన కంఠమార్గము గుండా కొద్దిగా ఉదరము చేరియుండును, ఊపిరితిత్తులలోని మూలలకు కూడా గాలి చేరుట వలన ఊపిరితిత్తులు కొద్దిగా ఖాళీ ఏర్పడియుండును. ఆ ఖాళీ పూర్తి అగునట్లు రెండవసారి యోగి బయటి గాలిని పీల్చి పూరించుచున్నాడు. ఇట్లు రెండవ

మారు గాలిని పీల్చిన యోగి మూడు లేక నాలుగు నిమిషముల వరకు శ్వాసను బయటికి వదలక ఉండి, తర్వాత ఇంకా తనయందు గాలి ప్రవేశించునేమోనని మూడవమారు పీల్చి చూచును. అపుడు కూడా గాలి కొద్దిగ లోపలికి పోవును. ఇట్లు రెండు మూడుమార్లు శ్వాసను పీల్చి ఉదరమునందు ఊపిరితిత్తులందును గాలిని భర్తీగా చేసుకొని బయటికి వదలక ప్రయత్న పూర్వకముగా బిగించి యుండును. దీనినే **"కుంభకము"** అని అందురు. ఈ విధముగా కుంభింపబడిన గాలి బంతియందు బంధింపబడి ఉన్నట్లుండును.

1) గాలిని ఆధారము చేసుకొని ఆడుచున్న ఊపిరితిత్తులు గాలి కదలక నిలిచిన వెంటనే నిలిచిపోవుచున్నవి.

2) ఊపిరితిత్తులు నిలిచిన వెంటనే ఊపిరితిత్తులను నడుపుచున్న నరములందు చైతన్యము కూడా నిలిచిపోవును.

3) నరములందు చైతన్యము నిలిచిన వెంటనే ఆ నరములతో సంబంధమున్న సూర్యచంద్రనాడులందుండు చైతన్యము నిలిచిపోవును.

4) సూర్య చంద్రనాడులందు చైతన్యము నిలిచిన వెంటనే సూర్యచంద్ర నాడులను ఆధారముగా చేసుకొని చలించుచున్న మనస్సు కదలక నిలిచిపోవును.

5) మనస్సు నిలిచిపోయిన వెంటనే మనస్సును ఆధారముగా చేసుకొని జీవుల శరీరములను నడుపుచున్న ఆరు కేంద్రములందలి చైతన్యశక్తి నిలిచిపోవును. అనగా కుండలీశక్తి ఆటకట్టబడినదన్న మాట. నర

కేంద్రముల చైతన్యమునకు ఆధారమై ఉన్న ఏడవ కేంద్రము ఒక్కటి తన శక్తిని కోల్పోక ఉండును. ఆరు కేంద్రముల చైతన్యశక్తి నిలిచిపోయిననూ ఏడవ కేంద్రమందున్న చైతన్యశక్తి నిలిచిపోక ఉండును. ఏడవ కేంద్రమందలి శక్తి అపారమైనది, ఊహించరానిది, చెప్పుటకు శక్యము కానిది, దానినే ఆత్మ అని యోగులు అంటున్నారు. ఈ ఏడవ కేంద్రమునందలి చైతన్యము జీవుని నిదుర, మెలుకువ, స్వప్నములందు సమానముగా ఉండును. అందువలన ఏడవ కేంద్రమందున్న చైతన్యమునే మూడవస్థలయందు సాక్షిగా ఉన్నదని చెప్పవచ్చును. కుంభకము ద్వారా నిలిచిన మనస్సు బ్రహ్మనాడి యందు ఏడవ కేంద్రము చేరి దానిలో ఇమిడి పోవుచున్నది. మనస్సుతో పాటు అంతఃకరణములైన జీవుడు కూడా ఏడవ కేంద్రములో ఉన్న ఆత్మయందే లీనమై పోవుచున్నాడు. జీవుడు ఆత్మయందు లీనముకావడమునే “యోగము” అంటున్నారు.

కుంభకమునే పూర్వము యోగి అయిన శ్రీ వీరబ్రహ్మంగారు పాటరూపములో ఒక తత్త్వముగా చెప్పియున్నారు. కుండలీశక్తిని వేరుగా పోల్చుకొన్నవారు, కుండలీశక్తి నిదురపోతున్నదన్న వారు ఉండుటవలన ఆ తత్త్వమునకు అర్థమే తెలియకపోయి, ఆఖరుకు బిక్షగాళ్లు పాడుకొనుటకు ఉపయోగపడుచున్నది. గ్రుడ్డివానికి రత్నము ఇచ్చినా వ్యర్థమైనట్లు శ్రీ వీరబ్రహ్మముగారు ఎంతో జ్ఞానమును ఉపయోగించి చెప్పిన మాటను తెలియని మనము వ్యర్థము చేయుచున్నాము. కుండలీనే పెద్దగా పెట్టుకొన్న వారు మరియు విన్నవారు, శ్రీ పోతులూరి వీరబ్రహ్మము గారు చెప్పిన క్రింది తత్త్వమును గ్రహించవలయునని తెలుపుచున్నాము.

**ఆహా బ్రహ్మాండమైనది ఆదిమంత్రము మన బ్రహ్మంగారు చెప్పినది పెద్దమంత్రము.**

1) రెక్క ముక్కులేని పక్షి రేయి పగలు తపస్సు చేసి ఒక్క చెరువు చేపలన్నీ ఒకటే మ్రింగెను. "ఆహా"

2) ఇంటి వెనుక తుట్టెపురుగు ఇంటిలోని అందరిని మ్రింగె, చూడవచ్చిన జనులనెల్ల చూచిమ్రింగెను."ఆహా"

3) కాళ్లు చేతులు లేనివాడు కడవ ముంత చేత పట్టి నిండుబావి నీళ్లన్ని ఒకడే ముంచెను "ఆహా"

4) ఏటిమీద స్వాతికొంగ వేటలాడుచురాగ చాటునున్న మీనుపిల్ల అట్టే మ్రింగెను "ఆహా"

5) చెప్పినాడు వీరదాసు చోద్యముగాను ఆత్మతత్త్వము, గొప్పవారు దీని భావము విప్పిచెప్పితే చాలు "ఆహా"

**దీని అర్థమేమనగా :-** గొప్ప మంత్రము బ్రహ్మముగారు చెప్పినది. ఆ మంత్రము మన శ్వాసయే. శ్వాస లోపలికి ప్రవేశించినపుడు **"సో"** అను శబ్దముతో, బయటికి వచ్చునపుడు **"హం"** అను శబ్దముతో చలించుచున్నది. ఈ రెండు శబ్దములు కలసి "సోహం" అను శబ్దము ఏర్పడినది. ఈ శబ్దము మహిమకలది కావున దీనిని 'మంత్రము' అని చెప్పాడు. మరియు అక్షర సమ్మేళనములతో కూడుకొన్నది కావున మంత్రము అని చెప్పబడినది. **"సోహం"** అను మంత్రము ఆది మంత్రముగా మారుచున్నది. అది ఎట్లున్నదనగా! **"సో"** అను శబ్దమునందు చివరిగా **"ఓ"** అను శబ్దమున్నది. **"హం"** అను శబ్దమునందు చివరిగా **"మ్"** అను శబ్దమున్నది. ఒక్కమారు

శ్వాస లోపలికి పోయి బయటికి వస్తే “సోహం” అను మంత్రము ఏర్పడుచున్నది. ఆ సోహం మంత్రమునందే “ఓమ్” అను శబ్దము ఇమిడి ఉన్నది. కావున “సోహం” తల్లి “ఓమ్” శిశువు. “ఓం” ప్రపంచ పుట్టుకలో మొదట పుట్టిన శబ్దము కావున దీనిని ఆది మంత్రము అనుట సంభవించినది.

**1) రెక్క ముక్కులేని పక్షి రేయి పగలు తపస్సు చేసి**
**ఒక్క చెరువు చేపలన్ని ఒకటే మ్రింగెను.**

1) ముక్కు పుటములందు ప్రవేశించు శ్వాసకు ఆకారము లేదు కావున రెక్క ముక్కులేని పక్షి అని చెప్పారు. శ్వాస రేయి పగలు విడువక సోహం అను మంత్రమును జపించుచున్నది. కావున పక్షి రేయి పగలు తపస్సు చేసె అని చెప్పారు. ఈ శ్వాసయే శరీరములోనికి ప్రవేశించి కుంభకము ద్వారా నిలిచి శరీరములోనున్న కదలికలను (చైతన్యముల) అన్నిటినీ నిలిపివేయుచున్నది. కావున “చెరువులో అనేక విధములుగా చలించు చేపలన్నిటినీ మ్రింగెను” అని చెప్పారు.

**2) ఇంటి వెనుక తుట్టెపురుగు ఇంటిలోని అందరినీ మ్రింగె,**
**చూడవచ్చిన జనులనెల్ల చూచిమ్రింగెను.**

2) శ్వాస ఎల్లవేళల “సోహం” అను శబ్దము చేయుచున్నది కావున ‘గీ’ మని అరచు తుట్టెపురుగుగా చెప్పినారు. శ్వాసకు ఆధారము శరీరములో కనపడక ఉన్న బ్రహ్మనాడిలోని చైతన్యము. కావున ఇంటి వెనుక తుట్టెపురుగు అని చెప్పినారు. ఇల్లు అనగా శరీరము. శ్వాస కుంభకము ద్వారా శరీరములోనున్న వ్యాన, సమాన, ఉదాన, ప్రాణ, అపాన

వాయువులన్నియూ బంధింపబడుచున్నవి. కావున ఇంటిలోనందరిని మ్రింగెను అని చెప్పియున్నారు. శ్వాస కుంభించిన తర్వాత ఊపిరితిత్తులు ఖాళీవల్ల రెండు లేక మూడుసార్లు కొద్దికొద్దిగా బయటి గాలి లోపలికి ప్రవేశించి, ప్రవేశించిన గాలి తిరిగి బయటికి రాక నిలుచుట వలన "చూడవచ్చిన జనులనెల్ల చూచి మ్రింగెను" అని చెప్పినారు.

**3) కాళ్లు చేతులు లేనివాడు కడవ ముంత చేత పట్టి**
**నిండుబావి నీళ్లన్నీ ఒకడే ముంచెను.**

3) శ్వాసకు రూపములేదు కావున కాళ్లు చేతులు లేనివాడని చెప్పినారు. శ్వాస ముక్కురంధ్రములలో ఒక దానియందు ఎక్కువ ఒక దానియందు తక్కువ లోపలికి బయటికి చలించుచున్నది, ఎక్కువ శ్వాసను కడవ అని, తక్కువ శ్వాసను ముంతని పోల్చి చెప్పారు. కావున కడవ ముంత చేతపట్టి అని చెప్పారు. శరీరములోని తలంపులన్ని శ్వాస ఒక్కటి నిలుపడము వల్ల నిలిచిపోవుచున్నవి. కావున "బావినీళ్లన్ని ఒక్కడేముంచెను" అని చెప్పడమైనది. శరీరమును బావిగా పోల్చడమైనది.

**4) ఏటిమీద స్వాతికొంగ వేటలాడుచురాగ**
**చాటునున్న మీనుపిల్ల అట్టే మ్రింగెను.**

4) శ్వాస శరీరములో నిలిచిపోయిన దాని వలన ఊపిరితిత్తులు తర్వాత నరములు, ఆ తర్వాత సూర్యచంద్రనాడులు, షట్చక్రములు ఒక దాని తర్వాత ఒకటి తమ తమ చైతన్యమును కోల్పోవుచున్నవి. కావున "ఏటి మీద స్వాతికొంగ వేటలాడుచురాగ" అని చెప్పడమైనది. ఒక దాని తర్వాత ఒకటి తమ చైతన్యములను కోల్పోయినను, ఆఖరున గల

ఏడవ కేంద్రము శ్వాస నిరోధమువల్ల తన శక్తిని కోల్పోక నిలిచిన దానివలన, అన్నిటి యొక్క చైతన్యములను నిలిపి వేసిన శ్వాస ఏడవ కేంద్రము వద్దకు వచ్చి తనశక్తి చాలక నిలిచిపోయిన దానివలన, చాటునున్న చేపపిల్ల కొంగను మ్రింగెను అని చెప్పడమైనది. ఇటువంటి తత్త్వములు ప్రాణాయామమును గురించి ఎన్నియో పెద్దలు చెప్పి ఉన్నారు. కానీ నేటి ప్రజలు వాటికి సరియైన అర్థము తెలుసుకొనలేక జన్మను వ్యర్థము చేసుకొనుచున్నారు.

గాలి తత్త్వముతో ఆకాశతత్త్వము కలిసి మనస్సు పుట్టియున్నది. కావున మనస్సుకు శ్వాసకు అవినాభావ సంబంధము కలదు. శ్వాస నిలిచిన మనస్సు నిలచును, లేక మనస్సు నిలిచిన శ్వాస నిలుచును. శ్వాస నిలిచిన తర్వాత మనస్సు నిలువడమును కుంభకము అని అందురు. కుంభకపద్ధతి తారక యోగమునకు సంబంధించినది. మనస్సు నిలిచిన తర్వాత శ్వాస నిలువడమును ప్రాణాయామమే అనవచ్చును. కానీ ఈ పద్ధతి అమనస్క యోగమునకు చెందినది. అమనస్క పద్ధతి ద్వారా యోగులు ప్రాణాయామము ఎట్లు చేయుచున్నారనగా :-

యోగి కదలక కూర్చొని మనస్సును ప్రయత్నము ద్వారా సంకల్పములు లేకుండా చేయును. బ్రహ్మనాడియందలి నరకేంద్రముల చైతన్యము మనస్సును చలించునట్లు చేయుచుండును. మనస్సు చలించక నిలిచిన వెంటనే మనస్సుకు స్థానమైన సూర్యచంద్రనాడులు తమ చైతన్యమును కోల్పోవును. సూర్య చంద్రనాడుల మధ్యనున్న బ్రహ్మనాడి యందు మనస్సు ప్రవేశించుచున్నది. మనస్సు బ్రహ్మనాడియందు ప్రవేశించిన వెంటనే బ్రహ్మనాడియందు గల నరకేంద్రములు తమ

చైతన్యమును కోల్పోవుచున్నవి.  ఇట్లు మనస్సు నిలువడము ద్వారా సూర్యచంద్రనాడులు, బ్రహ్మనాడి ఆరు కేంద్రములు తమ తమ శక్తిని కోల్పోవుచున్నవి.  శ్వాసను నడుపుశక్తి  సూర్య చంద్రనాడుల మీదుగా బ్రహ్మనాడి ఆరు కేంద్రములకు ఉన్నది.  అందువలన ఈ కేంద్రములన్నియు నిలిచిన వెంటనే శ్వాసయు నిలిచిపోవును. ఈ విధముగా కొందరుయోగులు మనస్సు ద్వారా శ్వాసలు నిలుపుచున్నారు.  దీనినిబట్టి ప్రాణాయామము రెండు విధములుగా ఉన్నదని, **ఒకటి తారక పద్ధతి, రెండవది అమనస్క పద్ధతి** అని చెప్పవచ్చును.

శ్వాసకు మనస్సుకు సూర్యచంద్రనాడుల ద్వారా సంబంధ మున్నది. అందువలననే మనస్సు నిలుచుకొద్దీ శ్వాస నిలుచును అని చెప్పుచున్నాము ఇక్కడ కొందరికి ఒక అనుమానము రావచ్చును.  నిద్రయందు మనస్సు నిలుచుచున్నది కదా!  అపుడు శ్వాసకూడ నిలువ వలయును కదా!  అట్లుకాక శ్వాస మామూలుకంటే నిద్రలో ఎక్కువగుచున్నది.  దీనిని బట్టి మనస్సు నిలిచిన శ్వాస నిలుచును అని ఎట్లు చెప్పనగును? అని అడుగవచ్చును. దానికి మా సమాధానము నిద్ర యందు మనస్సు తనకు తాను బ్రహ్మనాడిలో నిలుచుచున్నది. కావున సూర్య చంద్రనాడులు తమ చైతన్యమును కోల్పోక యుండి, మనస్సు ఆనాడుల మీద లేకుండుట వలన స్వతంత్రించినవై తమ ఇష్టానుసారముగా శ్వాసను నడుపును.  మనస్సు సూర్యచంద్రనాడుల మీద ఉన్నపుడు శ్వాస మనస్సును అనుసరించి చలించుచుండును.  ఎపుడైతే జీవునికి తెలియకనే మనస్సు తనకు తానుగా బ్రహ్మనాడియందు కలయునో అపుడు శ్వాస మనస్సును అనుసరించి తిరుగక తన ఇష్టానుసారముగా చలించుటకు మొదలు పెట్టును.  అందువలననే కొందరికి నిద్ర వచ్చిన వెంటనే శ్వాస అధికముగా చలించుచుండును.  యోగమందు అట్లుకాక

మనస్సు జీవుని ప్రయత్నముతో బ్రహ్మనాడియందు లయమగుచున్నది. యోగమందు షట్చక్రములు తమ చైతన్యమును కోల్పోవుచున్నవి, సూర్యచంద్రనాడులు కూడా తమ చైతన్యమును కోల్పోయి తమ ద్వారా ఆడు శ్వాసకు బలములేక పోవుచున్నది. యోగమునకు నిద్రకు చాలా భేదమున్నది. నిద్ర అజ్ఞాన స్వరూపమైనది. యోగము జ్ఞాన స్వరూపమైనది. నిద్రయందు జీవుడు తన్నుతాను మరచిపోవును. యోగమందు జీవుడు తన్ను తాను తెలుసుకొనును. నిద్రలో జ్ఞానశక్తి శరీరములోనికి ప్రవేశించ లేదు. యోగములో జ్ఞానశక్తి శరీరములోనికి ప్రవేశించును. నిద్రకు యోగమునకు ఒక్క శ్వాసలోనే కాక శరీరములో అనేక కార్యములందు భేదమున్నది.

ప్రతి మానవునికి శ్వాస ముక్కురంధ్రముల నుంచి సాధారణముగా 12 ఇంచులు బయటికి వచ్చిపోవుచుండును. యోగ సాధన ద్వార మనస్సు కొద్దిగ నిలుచువారికి శ్వాస 12 అంగుళములు పొడవు బయటికిరాక కొన్ని ఇంచులు మాత్రము వచ్చిపోవుచుండును. మనస్సు నిలుచుకొద్ది శ్వాస వేగము నిలిచిపోవును. మనస్సు పూర్తి నిలిచిన శ్వాస ఏమాత్రము బయటికి రాక నిలిచిపోవును. అట్లే మనస్సు చలించుకొద్ది శ్వాస వేగము ఎక్కువగును మనస్సు ఎక్కువ ఉద్రిక్తమైనపుడు శ్వాస 12 అంగుళములే కాక 18 అంగుళముల వరకు వచ్చి పోవుచుండును. మానవుని ఆయుస్సు శ్వాస మీదనే నిర్ణయంపబడి ఉండును. శ్వాసమీదనే కాల,కర్మ చక్రముల గమనములు ఆధారపడి ఉన్నవి. మనము సెకండ్ల ద్వారా నిమిషములను, గంటలను గుర్తించునట్లు, పరమాత్మ శ్వాస ద్వారా జీవునికి కాలమును, కర్మమును గుర్తించును. మనము ఒక నిర్ణీత పొడవు గలిగిన శ్వాసను ఒక శ్వాస (ఒక హంస) అని గుర్తించవచ్చును. పరమాత్మ దృష్ఠియందు

జీవుని నాశిక (ముక్కు) రంధ్రముల వెడల్పుకు 24 అంతలు ఎక్కువ పొడవు గలిగిన ఊపిరిని ఒక శ్వాస అని చెప్పుచున్నాము. అందువలన మానవునకు సాధారణంగా 12 అంగుళముల శ్వాస ఆడుచున్నదని చెప్పవచ్చును. ఇక్కడ కొందరికి **"మనిషి నాశికా రంధ్రముల వెడల్పుకు 24 అంతలు ఎక్కువ అని ఏ ఆధారముతో చెప్పనగును"** అని అనుమానము రావచ్చును. దానికి సమాధానము, మన కపాలమందు గల కాల కర్మ చక్రముల భాగములకు మనిషి ముక్కుపుటములకు సంబంధమున్నది. కావున అట్లు చెప్పనగును. మానవుని ముక్కుపుటముల ననుసరించి 12 ఇంచులు అని చెప్పవచ్చును. ఏనుగు ముక్కు పుటములననుసరించి ఆరు అడుగల పొడవు గలిగిన శ్వాసను ఒక్క శ్వాసగా లెక్కించవచ్చును, అట్లే ఈగ ముక్కుపుటముల ననుసరించి దానికి ఒక శ్వాస ఉండునని చెప్పవచ్చును. ఈ సూత్రము ప్రకారము ఏ శరీరమునందుగల జీవునికైనా శ్వాస నిర్ణయించి చెప్పవచ్చును.

యోగ సాధన ద్వారా శ్వాస పొడవును 12 ఇంచుల నుంచి 1 ఇంచు వరకు తగ్గించవచ్చును మరియు నిలిపివేయవచ్చును. మానవునికి 12 ఇంచులు శ్వాస 21,600 సార్లు బయటికి వచ్చిపోయిన పరమాత్మ దృష్టియందు ఒక దినముగా జీవునికి లెక్కింపబడుచున్నది. యోగసాధన ద్వార 1 ఇంచు శ్వాస ఆడిన 11 ఇంచులు శ్వాస మిగులుచున్నది కదా! 1 ఇంచు శ్వాస 21.600 సార్లు బయటికి వచ్చిపోయినను పరమాత్మ దృష్టియందు ఒక దినముగా లెక్కింపబడదు. కాల, కర్మ, చక్రముల భ్రమణము కూడా 11 వంతులు తగ్గిపోయి ఉండును. మామూలు మానవునికి 12 ఇంచులు శ్వాస 21,600 సార్లు ఆడిన ఒక దినము అని లెక్కించబడిన, యోగసాధన గల మానవునికి 1 ఇంచు శ్వాస 21,600 సార్లు ఆడిననూ ఒక దినముగా లెక్కింపబడక 12 దినములకు ఒక దినము

అయినట్లు లెక్కింపబడును. కావున మానవుని ఆయుష్షు ఎక్కుటకు, తగ్గుటకు శ్వాస మీద ఆధారపడియున్నది. కొంతమంది యోగులు శ్వాసను పూర్తి బంధించి ఆయుష్షును అభివృద్ధి చేసుకొన్నవారు పూర్వము చాలామంది ఉండెడివారు.

ప్రారబ్ధముననుసరించి జీవునికి (మానవునికి) కొన్ని శ్వాసలు పరమాత్మ నిర్ణయించి ఉండును. నిర్ణయింపబడిన శ్వాసలందు ప్రతి దినము 21,600 శ్వాసలు ఖర్చుయిపోవుచుండును. ఇట్లు ఖర్చవుతూ పోయి నిర్ణయింపబడిన శ్వాసలు అన్నియు అయిపోయిన వెంటనే జీవుడు శరీరము వదలిపోవుట సంభవించును. కొంతమంది జ్ఞానులు ప్రాణాయామము వలన శ్వాసలను దినమునకు తక్కువ ఖర్చగునట్లు చేసుకొని, దానివలన ఆయుష్షును అభివృద్ధి చేసుకొనుచున్నారు. అది ఎట్లనగా ఒక చిన్న ఉదాహరణ చెప్పుదును. మానవునికి ప్రారబ్ధము ననుసరించి 31,53, 60,000 శ్వాసలు గడుచునంత వరకు జీవుడు శరీరమున ఉండునట్లు కర్మ నిర్ణయము ఉండెను. దినమునకు 21,600 శ్వాసలు గడిచిన 31,53,60,000 శ్వాసలు అయిపోవుటకు 40 సంవత్సరముల కాలము పట్టును. అందువలన వాని ఆయుష్షు 40 సంవత్సరములు అని చెప్ప వచ్చును. కానీ ఆ మానవుడు 20 సంవత్సరముల వయస్సునుండి ప్రాణాయామము చేయ మొదలుపెట్టెను. ప్రతి దినము 2 గంటల కాలము ప్రాణాయామము చేయుచుండెను. ఆ రెండు గంటల కాలము శ్వాస ఆడక రెండు గంటలకు 1800 శ్వాసలు జీవునికి మిగిలిపోయెను. ఆ జీవునికి ఒక దినమునకు 1800 శ్వాసలు మిగులుచు 19,800 శ్వాసలు ఖర్చవుచుండెను ఈ ప్రకారము ఆ జీవునికి నిర్ణయింపబడిన శ్వాసలు

అయిపోవుటకు 41 సంవత్సరముల, 8 నెలల, 3 దినముల కాలము పట్టును. అప్పటికి ఆ జీవుని అయుష్షు 1 సంవత్సరము, 8 నెలల, 3 దినముల కాలము పెరిగెను. ఈ విధముగా యోగులు కొందరు ప్రాణాయామము వలన ఆయుష్షును అభివృద్ధి చేసుకొని ఎక్కువ కాలము బ్రతుకుటకు ఆస్కారమున్నది. పూర్వము కొంతమంది ఆయుష్షను అభివృద్ధి చేసుకొని కొన్ని వందల సంవత్సరములు బ్రతికినట్లు చరిత్రలో తెలియు చున్నది.

*****

## బ్రహ్మా, కాల, కర్మ, గుణచక్రములు

జీవుని చావు పుట్టుకలకు కారణము కర్మ. కర్మను జీవుడు అనుభవించుచూనే ఉండును. మరియు సంపాదించుచునే ఉండును. పోయిన జన్మ కర్మ ఈ జన్మలో, ఈ జన్మ కర్మ వచ్చే జన్మలో అనుభ వించుచూ కర్మచక్రములో నుండి బయటపడలేక అనేక బాధలు సుఖములు జీవుడు అనుభవించుచునే ఉన్నాడు. కర్మచక్రములో నుంచి తప్పించుకోవలయునంటే, కర్మ అంటే ఏమిటి? ఎక్కడ నుండి మన మీదపడి బాధించుచున్నది? దాని నుండి విముక్తి ఎట్లు? అని విశదీ కరించుకొనినా, కర్మ చక్రమునుండి జీవుడు తప్పించుకొనుటకు కొంత ఆస్కారము ఏర్పడవచ్చును. కనుక కర్మచక్రమును గురించి కొద్దిగా తెలియజేతును.

కర్మ అనగా పాపము పుణ్యముకదా! ఈ పాపపుణ్యములు రెండూ చుట్టు ఆవహించుకొని ఒక చక్రముగా తయారై జీవున్ని ఆ చక్రములోనే

గిర గిర త్రిప్పుచూ పాపము, పుణ్యములను అనుభవించునట్లు చేయుచున్నవి. మనము సంపాదించుకొను పాపము, పుణ్యము కర్మ చక్రములోనికి చేరి నిలువయుండి కాలానుగుణముగా తిరిగి మన మీదికే ప్రసారమగును. ఎవని కర్మ వాని కర్మచక్రమునందే పోయిచేరును, తిరిగి వానికే ప్రసారమగును. కర్మచక్రము ప్రతి జీవుని మెదడునందు ఉన్నది. పాప, పుణ్యములు కంటికి కనిపించవు, కావున పాపపుణ్య మిశ్రమమైన ఈ చక్రము మెదడునందు కంటికి ఎవరికీ కనిపించదు. చూడవలయునన్న నాల్గవకన్ను అయిన జ్ఞాననేత్రముతో చూడవచ్చును. మెదడునందు ఈ చక్రము పన్నెండు భాగములుగా విభజింపబడి ఉన్నది. కర్మచక్రమును క్రిందగల 1వ పటములో చూడవచ్చును.




1వ పటము

మెదడునందలి కర్మచక్రము యొక్క భాగములు

ఈ విధముగా పన్నెండు భాగములుగా ఉన్న కర్మచక్రములో జీవుని యొక్క పాపపుణ్యములు నిర్ణీతమైన భాగములలోనికి పోయి చేరుచుండును. అది ఎట్లనిన కర్మచక్రములో ఉన్న ఒకటి, ఐదు, తొమ్మిది భాగములలో జీవుని పుణ్యము చేరును. అట్లే మూడు, ఏడు, పదకొండు భాగములలో జీవుని పాపము చేరును. మిగతా ఆరు భాగములందు పాపపుణ్యములు రెండునూ చేరును. కొన్ని భాగములలో పాపము, కొన్ని భాగములలో పుణ్యము, కొన్ని భాగములలో పాపపుణ్యములు రెండునూ ఎందుకు చేరుచున్నవని కొందరికి అనుమానము రావచ్చును. దానిని గురించి పెద్దలు ఏమి చెప్పుచున్నారనగా మానవుడు తన జీవితకాలములో ఒకే రక పుణ్యము, ఒకే రక పాపము సంపాదించుకొనడు. అనేక రకముల పనులు చేయుచూ అనేక రకముల పాపపుణ్యములు సంపాదించు కొనుచుండును. ఒక్కొక్క రకము పుణ్యము కర్మచక్రమునందు ఒక్కొక్క నిర్ణీత భాగమునే చేరును. అట్లే ఒక్కొక్క రకము పాపము కర్మచక్రమునందు ఒక్కొక్క నిర్ణీత భాగమునే చేరును. అందువలననే కొన్ని భాగములయందు పుణ్యము, కొన్ని భాగములయందు పాపము, మరికొన్ని భాగములయందు పాపపుణ్యము రెండునూ చేరి ఉండును. అవి ఎట్లున్నవనగా తర్వాత పేజీలో 2వ పటమును చూడవచ్చును.

ఈ విధముగా అనేక రక పాపపుణ్యములు జీవుడు సంపాదించు కొలది కపాలమందున్న కర్మచక్రమును చేరుచుండును. కర్మచక్రము నందలి కర్మను జీవుల మీదికి ప్రసరింప చేయువారు నవగ్రహములగు సూర్య, చంద్ర, అంగారక, బుధ, గురు, శుక్ర, శని, రాహువు,కేతువులు. గ్రహములు మొత్తము 12 గలవు. ప్రస్తుతము తొమ్మిది గ్రహాలను గురించియే చెప్పుచున్నాము. ద్వాదశ గ్రహముల వివరమును మేము వ్రాసిన




2వ పటము

**"జ్యోతిష్య శాస్త్రము"** గ్రంథములో తెలియజేశాము. ఆ తొమ్మిదిమంది కాలచక్రములో చిక్కుకొని కాలచక్రము భ్రమించినట్లు వీరును తిరుగుచూ కర్మచక్రములోని పాపపుణ్యములను కాలానుగుణముగా జీవుల మీదికి వదలుచున్నారు. కాలచక్రములో నవగ్రహాములు తిరుగుచుండుట వలననే

పాపపుణ్యములు ఒకేసారి ప్రసారముకాక కొంత కొంత మిశ్రమ రూపములో ప్రసారమగుచున్నవి దానినే 'ప్రారబ్ధము' అని అందురు.

కర్మచక్రము మన శిరస్సునందు ఉండుటవలననే ప్రతి ఒక్కరు నాకర్మ అని తలవైపు చేయి చూపుచుందురు. మరియు ఒక పని నెరవేరనపుడు కూడా నా తలవ్రాత అట్లున్నదని అంటున్నారు. వేరొకనికి ఎక్కువ లాభము వచ్చినపుడు వాని పుణ్యము అట్లున్నదని, ఒకనికి నష్టము వచ్చినపుడు వాడు పాపము చేసినాడని మనము అంటూనే ఉన్నాము. జరిగిన పనులకు పుణ్యము, జరుగని పనులకు పాపము అని మనకు తెలియకనే మన నోట వచ్చుచున్నది. మరియు అట్లే నా తలవ్రాత అని, నా కర్మ అని, మనకు తెలియకనే నోట పలుకుచూ మన చేయి తలవైపు చూపుచున్నది. తనకు పూర్తి తెలిసి తలవైపు నా కర్మ అని చూపినాడా అంటే ఏమాత్రము తెలిసియుండదు. ఇక్కడ తెలుసుకోవలసినది ఏమనగా! కర్మచక్రమునందు మనము చేసుకొన్న పాపము, పుణ్యము ఉన్నది. ఆ పాపపుణ్యములనే మనము అనుభవించుచున్నాము. అందువలన మన శిరస్సునందు గల కర్మచక్రమువైపే మనకు తెలియకుండినా విధి పూర్వకముగా చేయి చూపుచున్నాము.

కర్మచక్రములో ఉన్న కర్మకు అధినేతలు నవగ్రహములు కావున కర్మచక్రములో ఉన్న కర్మానుసారము జీవులను నవగ్రహములు త్రిప్పుచుండును. కర్మచక్రమువలె కాలచక్రము పన్నెండు భాగములైనది. పన్నెండు భాగములకు ఆదియందు ఉన్న సప్తగ్రహములు అధినేతలుగా నియమింపబడిరి. కాలచక్రములోని పన్నెండు భాగములకు పన్నెండు పేర్లు పెట్టబడెను. అవి ఏవనగా 1) మేషము 2) వృషభము 3) మిథునము

4) కర్కాటకము 5) సింహము 6) కన్య 7) తుల 8) వృశ్చికము 9) ధనస్సు 10) మకరము 11) కుంభము 12) మీనము. ఈ పన్నెండు భాగములకు సప్తగ్రహములు స్వంత హక్కులుగలిగి ఉండును. ఏ విధముగా అనగా సూర్యుడు సింహరాసికి అధినేత అనగా సింహము అను పేరు కలిగిన భాగము సూర్యుని స్వంతస్థానము అని అర్థము. అట్లే చంద్రునకు కర్కాటక భాగము, అంగారకునికి మేషము మరియు వృశ్చికము అను రెండు భాగములు, బుధునికి మిథునము, కన్య అను రెండు భాగములు, గురువుకు మీనము, ధనస్సు అను రెండు భాగములు శుక్రునకు వృషభ, తుల అను రెండు భాగములు శనికి మకరము, కుంభము అను రెండు భాగములు స్వంత భాగములుగా పరిగణింపబడెను. ఈ విధముగా పన్నెండు భాగములకు ఏడుగురు అధినేతలు ఆదినుంచియున్నారు. మధ్యలో వచ్చిన రాహువు శని స్వంత భాగమైన కుంభమునందు, కేతువు గురువు స్వంత భాగమైన మీనమునందు స్వంత స్థానము ఏర్పరచుకొనిరి. తొమ్మిది గ్రహములు పన్నెండు భాగములకు అధినేతలైరి. ఇంకను మూడు కనిపించని గ్రహముల స్వంతస్థానములను తర్వాత **"జ్యోతిష్య గ్రంథము"** లో తెలియ జేస్తాము. ఈ కాలచక్రము కర్మచక్రమునకు ఆనుకొని పైన తిరుగుచుండును. దానిని తర్వాత పేజీ 3వ పటమునందు చూడవచ్చును.

కర్మచక్రములో కర్మను త్రిప్పువారు నవగ్రహములు. అట్లే కాల చక్రములో నవగ్రహములను త్రిప్పువాడు ఆత్మ. ఆత్మ అనువాడు తన ఆధీనమందున్న నవగ్రహములతో కర్మను జీవుల మీదికి విధించుచున్నాడు. జీవరాసుల శరీరములో ఉన్న కపాల స్థానమున కర్మచక్రము, కాలచక్రములు పరిభ్రమించుచున్నవి. కర్మచక్రము మీద అధికారము నవగ్రహములు కలిగి ఉండును. కాలచక్రము మీద అధికారము ఆత్మకు ఉండును. ఆత్మ ధర్మము

3వ పటము

తప్పక కాలచక్రమును పరిభ్రమింపజేయును. కర్మమును నవగ్రహములు నడుపగా, నవగ్రహములను యముడు (ఆత్మ) నడుపగా, వీటినన్నిటినీ గురువు (పరమాత్మ) మధ్యన ఉండి గురుత్వాకర్షణశక్తితో తనచుట్టూ తిరుగునట్లు చేయుచున్నాడు. మధ్యన ఉన్న గురుత్వాకర్షణ శక్తిని తర్వాత పేజీలో 4వ పటమునందు చూడవచ్చును.

కర్మ, కాల, చక్రములకు ఇరుసుగా పరమాత్మ ఉండి, కాలుడను పేరుకల్గి నవగ్రహములను, కర్మమును తన ఆకర్షణ శక్తి చేత నడుపుచూ సాక్షి మాత్రునిగా ఉన్నాడు. కావుననే గీతాశాస్త్రములో రాజవిద్యా రాజగుహ్య యోగములో ఇట్లన్నాడు. **"భూమి మీదనే ప్రకృతికి అధ్యక్షత వహించి**




4వ పటము

**ఉన్నాను. నా వలన జీవరాసులు పుట్టుచున్నవి మరియు చచ్చుచున్నవి. ఈ కారణముతోనే జగము చక్రమువలె తిరుగుచున్నది."**

సర్వ జీవరాసులకు బ్రహ్మనాడియందు మధ్య పురుషుడైన ఆత్మ ఉన్నాడు. బ్రహ్మనాడి యొక్క సప్తస్థానమున ఆత్మశక్తి కేంద్రీకృతమై ఉన్నది. సప్త స్థానమును కేంద్రముగా చేసుకొని దానిచుట్టు కర్మ, కాల, చక్రములు తిరుగుచున్నవి. కాలచక్రములో రాత్రిపగలు, శుక్లపక్షము, కృష్ణపక్షములు, మాసములు, ఉత్తర దక్షిణాయనములు, సంవత్సరములు జరుగుచునే ఉన్నవి. రాత్రి పగలు మొదలుకొని సంవత్సరకాలము వరకు కర్మను జీవరాసులు అనుభవించుచున్నవి. కాలచక్రములో రాత్రి పగళ్లు ఎలా సంభవించు చున్నవనగా! కర్మచక్రములో ఉన్న భాగములను కాలచక్రములోనున్న

సూర్యుడు దాటుచూ ప్రయాణము చేయుచుండును. ఒక్కొక్క భాగమును దాటుటకు దాదాపు రెండు గంటల కాలము పట్టును. సూర్యోదయము మొదలుకొని ఆరు భాగములు దాటుటకు పన్నెండు గంటలు పట్టును. దీనినే పగలుగా మనము చూస్తూ ఉన్నాము. అట్లే మిగతా ఆరు భాగములు దాటుటకు పన్నెండు గంటల కాలము పట్టును. దీనినే రాత్రి అనుచున్నాము. మన కపాలములోయున్న కర్మచక్రమును దాటుచు సూర్యుడు కాలచక్రములో పయణించుచున్నాడు. ఇట్లు కాలచక్రములో పయణించుచూ కర్మచక్రము లోని పన్నెండు భాగములను దాటుటకు 24 గంటలు కాలము పట్టుచున్నది. 24 గంటలను ఒక దినము అని అనుచున్నాము. కర్మచక్రములో మధ్యరేఖ ఉన్నది. మధ్యరేఖకు ఎడమ ప్రక్క ఆరు భాగములు పగలు, కుడి ప్రక్క ఆరు భాగములు రాత్రిగా సూర్యభ్రమణములో తెలియుచున్నది. క్రిందగల 5వ పటములో రాత్రి, పగలు భాగములను చూడవచ్చును.




(5వ పటము)

సూర్యుడు కాలచక్రములో పరిభ్రమించుచున్నాడు కదా! కాల చక్రము పన్నెండు భాగములు కదా! సూర్యుడు కాలచక్రములోని ఒక్కొక్క భాగమును దాటుటకు ఒక మాసపు కాలము పట్టును. కాలచక్రము యొక్క పన్నెండు భాగములను సూర్యుడు పూర్తి దాటుటకు పన్నెండు మాసములు పట్టును దానినే ఒక సంవత్సరము అని అనుచున్నాము. కాలచక్రములో మధ్యన జీవరేఖ ఉన్నది. జీవరేఖకు ఎడమప్రక్క ఉండు ఆరు భాగములను సూర్యుడు దాటుటకు ఆరుమాసములు పట్టును. ఆ కాలమునే ఉత్తరాయణ మని అనుచున్నాము. అట్లే జీవుని కుడిప్రక్క ఉండు ఆరు భాగములను దాటుటకు ఆరు మాసములు పట్టును ఆ కాలమునే దక్షిణాయణమని అనుచున్నాము. ఉత్తర దక్షిణాయణములను క్రింద ఉన్న 6వ పటములో చూడవచ్చును.




(6 వ పటము)**కాల చక్రము**

కాలచక్రములో చంద్రుడు ఒక్కొక్క భాగమును దాటుటకు రెండున్నర దినము పట్టును. జీవరేఖకు ఒక ప్రక్క ఉన్న ఆరు భాగములను దాటుటకు 15 దినములు, మరియొక ప్రక్క ఉన్న ఆరు భాగములను దాటుటకు 15 దినములు పట్టును. చంద్రుడు పన్నెండు భాగములను దాటుటకు 30 దినముల కాలము పట్టును. చంద్రుడు జీవరేఖకు ఎడమ ప్రక్క ఉన్న భాగములను దాటు కాలమును శుక్లపక్షము అనియు, కుడిప్రక్క ఉన్న భాగములను దాటుకాలమును కృష్ణపక్షము అనియు అందురు. కృష్ణ, శుక్ల పక్షములను క్రింద ఉన్న 7వ పటములో చూడవచ్చును.

ఈ విధముగా కాలచక్రములో రాత్రిపగలు, శుక్ల, కృష్ణ పక్షములు ఆయనములు జరుగుచున్నవి. జీవునకు యోగముచేత లభించిన యోగ శక్తి అంతయు కర్మ, కాలచక్ర మధ్యయందున్న గురుకేంద్రమును చేరు చుండును. ఎవనికి యోగశక్తి పరిపూర్ణస్థితికి వచ్చునో వానికి సూర్యుడు




(7వ పటము) **కాలచక్రము**

జీవరేఖకు ఎడమప్రక్క ఉన్నపుడే, మరియు సూర్యుడు కర్మచక్రము మీద కూడా జీవరేఖకు ఎడమప్రక్క ఉన్నపుడే, చంద్రుడు కూడా కాలచక్రములో జీవరేఖకు ఎడమప్రక్క ఉన్నపుడే మరణము సంభవించును. ఆ విధముగా మరణించిన జీవుడు మధ్యలో ఉన్న కేంద్రములోనికి పోవుచున్నాడు. అనగా ఆత్మయందు లీనమవుచున్నాడు. ఇతర సమయములలో చనిపోయిన జీవుడు కేంద్రములో ఉన్న ఆత్మను చేరలేడు. పగలు, శుక్లపక్షము ఉత్తరాయణము కలసిన కాలములో ఆత్మను చేరుటకు జీవునకు మార్గము ఏర్పడును. అట్లుకాక పోయిన దారి ఉండదు. ఈ మార్గములను క్రింది 8వ పటములో చూడవచ్చును.

రాత్రి, శుక్ల పక్షము, దక్షిణాయనములో మరణించిన జీవుడు ఆత్మను చేరలేడు. ఆ సమయములో మరణించిన జీవునికి కాలచక్రములో ఆత్మను




8వ పటము

చేరు మార్గము లభించదు. రాత్రి, శుక్లపక్షము, దక్షిణాయనములో కాల చక్రములో మార్గములు ఎట్లు ఉన్నది. క్రిందగల 9వ పటములో చూడవచ్చును.



9వ పటము

పగలు, శుక్లపక్షము, దక్షిణాయణములో మరణించిన జీవుడు ఆత్మను చేరలేడు. ఆ సమయములో మరణించిన జీవునికి కాలచక్రములో ఆత్మను చేరు మార్గము ఉండదు. పగలు శుక్లపక్షము, దక్షిణాయనములో కాలచక్రములో మార్గము ఎట్లు ఉన్నది. తర్వాత పేజీలోగల 10వ పటములో చూడవచ్చును.

ఆత్మను చేరుటకు అన్ని ద్వారములు ఒకే ప్రక్క, అనగా ఎడమ వైపే వచ్చి ఉండవలయును. అట్లుకాక కాలచక్రములో ఏ ద్వారము కుడి ప్రక్కకు పోయినా జీవునికి ఎడమవైపు మార్గము లభించక తిరిగి వేరే శరీరమును ఆశ్రయించి పుట్టుచుండును. ఇది యోగులకు మాత్రము నిర్ణయించబడి ఉన్నది.




10వ పటము

యోగి ఉత్తరాయణములో, కృష్ణపక్షములో పగలు మరణించి నప్పటికి ఆత్మను చేరలేడు. ఆ సమయమున మరణించిన యోగికి కాలచక్రములో ఆత్మను చేరు మార్గము ఉండదు. ఆ సమయమున కాలచక్రము ఎట్లుండుననగా తర్వాత పేజీలోగల 11వ పటములో చూడవచ్చును.

ఇట్లు జీవునికి ఆత్మను చేరుటకు మార్గము లభించక తిరిగి జన్మ ఎత్తుట సంభవించుచున్నది. దీనిని గురించి భగవద్గీతాశాస్త్రము నందు అక్షరపరబ్రహ్మ యోగములో శ్రీకృష్ణపరమాత్మ ఈ విధముగా అన్నాడు. **"అర్జునా యోగులు ఎప్పుడు మరణించిన మరల జన్మించరో మరియు ఎట్టి సమయమున మరణించిన వారు తిరిగి భూమిమీద పుట్టుదురో తెలుపుదును వినుము. సూర్యతేజస్సు గలిగిన స్థలములో పగలుయందు, శుక్లపక్షములో, ఉత్తరాయణమున యోగులు మరణించిన వారికి ఆత్మను చేరు భాగ్యము కల్గును. అట్లుకాక మేఘము గల ప్రాంతములో రాత్రి**




11వ పటము

**యందు, కృష్ణపక్షమందు, దక్షిణాయనమున యోగులు మరణించిన, వారు చంద్ర తేజమును పొంది తిరిగి జన్మింతురు"** పూర్తి యోగపరులు మరణించిన ఆ సమయము పగలుగానే, శుక్లపక్షముగానే, ఉత్తరాయణము గానే ఉండును. ప్రపంచములో స్వాములనుపించుకొనినా కర్మ పూర్తి అయిపోకపోతే వారు చనిపోవు సమయము రాత్రిగానో, కృష్ణపక్షముగానో, దక్షిణాయనముగానో ఉండును. కావున 'బ్రతికిన బ్రతుకంతయు చావులోనే తెలుస్తుంది' అని పెద్దలు అన్నారు.

కాలచక్రములో సూర్యుని ద్వారా దినములు, ఆయనములు, సంవత్సరములు, లెక్కించుకొనుచున్నాము. ఈ లెక్క ప్రకారము మనకు యుగములు గడుస్తున్నవి. ఒక యుగములో మనము శతకోటి లేక అంతకంటే ఎక్కువ జన్మలు ఎత్తవలసి ఉంటుంది. ఇటువంటి యుగములు వేయి అయినా పరమాత్మ లెక్కలో ఒక పగలు, అట్లే వేయి యుగములు పరమాత్మ లెక్కలో ఒక రాత్రి. ఈ పగలు రాత్రులు ఎటువంటివనగా,

పరమాత్మకు పగలు అయిన వేయియుగముల కాలమున జీవరాసులకు చావు పుట్టుకలు కల్గుచుండును. పరమాత్మ పగలు (బ్రహ్మ పగలు) వేయియుగములు గడిచిన వెంటనే బ్రహ్మ రాత్రి ప్రారంభమగును. రాత్రి ప్రారంభమైన వెంటనే జీవులన్నియు ప్రళయము చెందును. రాత్రికాలము వేయియుగములు గడచునంతవరకు జీవులుకానీ, ప్రకృతికానీ ఏదియు ఉండదు. అనగా కాలచక్రము, కర్మచక్రములు లేవు. అంతయు ఊహించ రాని శూన్యముగా ఉండిపోవును. బ్రహ్మ రాత్రి కాలము వేయియుగములు గడిచిన తర్వాత పగలు వచ్చిన వెంటనే ప్రకృతి పుట్టును. (భగవద్గీత అక్షర పరబ్రహ్మయోగములో 17, 18, 19, 20 శ్లోకములు చూడుము) బ్రహ్మ పగలు, బ్రహ్మ రాత్రిని క్రిందగల 12వ పటములో చూడవచ్చును.




12వ పటము

ఈ విధముగా బ్రహ్మచక్రము వేయియుగములు పగలుగా, వేయి యుగములు రాత్రిగా పరిభ్రమించుచున్నది. ఓ జీవులారా! ఇంతవరకు తెలుసుకున్న బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములలో చిక్కుకొనక వాటిని దాటి ఆత్మను చేరిన ఏ బాధలు ఉండవు. అందువలన నేటి నుంచి పాప పుణ్యములను కర్మచక్రములోనికి చేరకుండా చేసుకోవలయునని నీకే..... నీకే .... మరీ......మరీ .....తెలుపుచున్నాను.

బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల చిత్రము క్రిందగల 13వ పటమునందు చూడవచ్చును.




బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల చిత్రము (13వ పటము)

*****

# సగుణ - సాకార - నిరాకారములు

సాకారమంటే కంటికి కనిపించునదనీ, నిరాకారమంటే కంటికి తెలియనిదనీ అందరికి తెలిసిన సత్యమే. ఇపుడు సాకారమంటే ఏమిటి, నిరాకారమంటే ఏమిటని తెలుసుకోవడమే ముఖ్యాంశము. నేటి మానవుల అభిప్రాయములో సాకారమంటే కంటికి అగుపించు దేవాలయములోని ప్రతిమలనీ, నిరాకారమంటే కనిపించని ఆత్మ అని భావన ఉండుట గలదు. సాకారమును (ప్రతిమను) పూజించుటను సగుణోపాసనని నిరాకారమును (ఆత్మను) పూజించడము నిర్గుణోపాసనని తలచుట కూడా కలదు. ఈ విషయమును ఏ కొద్దిపాటి జ్ఞానము తెలిసినా, వారందరికి విధితమైన విషయమే. అంతటితో ఆగక సగుణ నిర్గుణ ఉపాసనలు, సాకార నిరాకారముల యొక్క సారాంశమింతేనా? అను ప్రశ్న ఉద్భవించినపుడు ఇంకా ఏదైనా అర్థముందేమోనని యోచించవలసి వస్తుంది.

దేవాలయములోనికి పోయివచ్చువారు నిజమైన భక్తితో పోవాలనీ, పోయినవారు అక్కడున్న కొద్దిసేపు నిశ్చింతగా ఉండవలయునని ఆ విధానమును తెలుపునదే అక్కడి ఆరాధన సారాంశమనీ మా రచనలలోని **'దేవాలయ రహస్యములు'** అను గ్రంథములో కూడా తెలిపియున్నాము. దైవ ప్రతిమ సామీప్యమునకు పోయినపుడు మన తలలోని గుణముల కదలికలను అణచివేసి ఒక్క క్షణమైనా ఏకాగ్రతగా మనస్సునుంచడమే ముఖ్య ఆరాధననీ ఎందరో పెద్దలు కూడా తెలియజేశారు. దైవ ప్రతిమ ముందర కూడా ప్రపంచ విషయములే జ్ఞప్తియుంటే అది ఆరాధనకాదనీ, అటువంటపుడు దేవాలయములకు పోయి ప్రయోజనములేదని కూడా పెద్దలు చెప్పారు. నిజమైన ఆరాధనంటే మనస్సు కొద్దిసేపైనా నిలుప

వలయును. అనగా ఏమాత్రము గుణములు పని చేయని స్థితిలో ఉండ వలయును. అప్పుడు ఏ ఒక్క గుణము పని చేసినా దానికి సంబంధించిన విషయము జ్ఞప్తికి వచ్చును. అందువలన పూర్తిగా గుణములకు దూరముగా ఉండడమే ముఖ్యము.

పద్ధతి ప్రకారము విషయచింతన లేకుండా మనస్సును దైవము మీద లగ్నము చేసినపుడు గుణములు ఏమాత్రము లేవు కదా! అలాంటి ఆరాధనను సగుణోపాసనని ఎందుకన్నారను ప్రశ్న ఉద్భవించకమానదు. గుణరహితమైన మనస్సు దైవము మీద లగ్నము చేసినపుడు గుణరహిత పూజయే (నిర్గుణోపాసనయే) అగును. కానీ సగుణపూజ ఎలా అగును? ఏ పూజైనా గుణములను అణచి నిర్గుణముగనే పూజించవలసి వచ్చినపుడు నిర్గుణ పూజయే అగును. అటువంటి దైవారాధనలలో సగుణ అనుపదము ఎలా వచ్చినది? ఈ సగుణోపాసనకేమైనా అర్థమున్నదా? అని యోచించు వారికి ప్రశ్న ఉద్భవించకమానదు. అలా ప్రశ్న వచ్చినపుడు జవాబు దొరకడము కూడా చాలా కష్టతరమైన పనే.

చాలామంది విమర్శకులకు ఇలాంటి ప్రశ్నలుద్భవించి పద్ధతి ప్రకారము జవాబులు దొరకక చివరకు మా వద్దకు వచ్చి మమ్ములను జవాబుల కోసము అడిగారు మా సంభాషణ క్రింద వ్రాస్తున్నాము.

**వారి ప్రశ్న :** సగుణ పూజ (సగుణోపాసన) దేవాలయములలో ప్రతిమల పూజించడమని చాలామంది పెద్దలు చెప్పారు. ఆ పెద్దలే దేవాలయములోని దైవప్రతిమల ముందుకు పోయినపుడు ఏ గుణము పనిచేయని విధముగా ఏకాగ్రతతో పూజించాలని, ఆ భావమే అక్కడున్న గంట మొదలుకొని ప్రతిమ వరకు ఉన్నాయని, మరియు మనము చేయు పూజలలో దీపము,

తాంబూలము మొదలుకొని అన్ని ఆచరణలు అదే అర్థమును తెలుపుచున్నవని, అందువలన గుడికి పోయినపుడు మనలోని మనస్సు ఏ గుణములవైపు పోకుండా దైవము మీదే లగ్నము చేయాలని తెల్పారు. అట్లే ఏ గుణము లేకుండునట్లు మనస్సును దైవము మీద లగ్నము చేశామనుకోండి అలాంటపుడు అది సగుణపూజ ఎట్లగును? నిర్గుణ (గుణములేని) పూజయే అగును కదా! ఈ విషయమును మీరు వివరించి తెల్పాలని కోరుచున్నాము.

**మా జవాబు :** మీకు వచ్చిన అనుమానము హేతుపద్ధతిగనే ఉన్నది. భూమి మీద ఎందరో దైవభక్తులు ఉపాసకులు గలరు. ఆంజనేయస్వామిని పూజించువారిని ఆంజనేయ ఉపాసకులు అంటున్నాము. దేవిని పూజించు వారిని దేవీ ఉపాసకులు అని అంటున్నాము. అట్లే కాళికాదేవిని పూజించు వారిని కాళీ ఉపాసకులని అంటున్నాము. ఈ విధముగా ఏ దేవుని పూజించితే ఆ దేవుని ఉపాసకులని వారిననడము మనము చూస్తున్నాము. అలాగే నిర్గుణోపాసనయనపుడు గుణములులేని దానిని పూజించడమనీ పద్ధతి ప్రకారము చెప్పవలసి వస్తున్నది. ఆంజనేయోపాసనని ఆంజనేయుని పూజనంటే, సగుణోపాసనని గుణములున్న దానిని పూజించడమనే అనాలి కదా! ఈ సూత్రము ప్రకారము వివరించితే ఎదుట ఉన్న దానిని పూజించడములో దాని ఆరాధన లేక ఉపాసనని పేరు కల్గినది కానీ చేయుచున్న వానిని బట్టి కాదని తెలియవలయును.

చేసెడి పూజ గుణములు గల దానికైతే సగుణ పూజ అనడము, అట్లే గుణములు లేని దానికైతే నిర్గుణపూజ అనడము సరైన పద్ధతి. ఈ సూత్రము ప్రకారము గుడిలోని ప్రతిమకు చేయు పూజను ఏమనాలో మీరే

యోచించండి. ఆ ప్రతిమ గుణములు లేనిది, కదలిక లేనిది కావున ఆ ప్రతిమ పూజను నిర్గుణోపాసననియే అనవలెను. ఎదుట ఏది ఉంటే దాని ఉపాసనని పేరు కల్గినది, కానీ చేయువానిని బట్టి కాదని తెలియవలయును. ఎదుట దేనిని పెట్టుకొని చేస్తే ఆ ఉపాసకుడని పేరు కల్గుతుంది. అందువలన పూజించువాని ఎదుట ఆంజనేయస్వామి ఉన్నాడనుకొనుము. దానిని ఆంజనేయస్వామి ఉపాసనని అంటారు.

దీనిని బట్టి చూస్తే ఎందరో చేయు పూజలను రెండు భాగములుగా విభజించవచ్చును. **1) నిర్గుణోపాసన 2) సగుణోపాసన.** గుణములున్న దానిని పూజించడమును సగుణోపాసనని సూత్రబద్ధముగా చెప్పవచ్చును అలాగైతే దేవాలయములలో ఎన్నో రకముల ప్రతిమలను పూజచేయు వారందరినీ ఒక గ్రూపుగా నిర్గుణోపాసకులనియే చెప్పవచ్చును. ఇంత వరకు దేవాలయములలోని ప్రతిమల ముందర పూజించడము సగుణోపాస నని మీరనుకొనుచుంటిరి. అక్కడే మీరు పొరపడినారు కావున మీకు ఉద్భవించిన ప్రశ్నకు జవాబు దొరక్కపోయింది. దారి ప్రకారము పోవువానికి ఆటంకములుండవు, దారి తప్పితే ఆటంకములు ఏర్పడును. అలాగే ఒక సూత్ర పద్ధతి (శాస్త్ర పద్ధతి) ప్రకారము యోచించు వానికి జవాబులు దొరుకును. ప్రశ్నలనబడు సంశయములు ఏర్పడవు. సూత్రపద్ధతి ప్రకారము యోచించు వారికి తప్పక జవాబులు ఉండును.

ఇపుడు దేవాలయ పూజలను సగుణపూజ అనుకోవడము పొరపాటని అది నిర్గుణ పూజేనని తెలిసింది. ఇప్పుడొక తెలియని సత్యము తెలిసింది. ఈ సత్యాన్ని తెలివిగలవారు అర్థము చేసుకోగలరని కోరుచున్నాము.

**వారు అడిగిన ప్రశ్న :** మీరు చెప్పు సూత్రముప్రకారము దేవాలయములోని పూజలన్నీ నిర్గుణోపాసనలే అగును. అలాంటపుడు సగుణోపాసనని దేనిని చెప్పనగునో సూత్రము ప్రకారము తెలియజేయండి?

**మా జవాబు :** గుణములులేని దానిని పూజించడము నిర్గుణోపాసన అయినపుడు గుణములు ఉన్న దానిని పూజించడము సగుణోపాసనగును. సజీవమై గుణములు కల్గియుండిన ఒక గురువునో, మహర్షినో, ఉన్నతమైన వ్యక్తినో లేక దైవసమానుడైన వానినో పూజించడము సగుణోపాసన అగును. పూర్వము రాజులు సహితము వారివారి గురువులను పాదపూజ చేసినట్లు చరిత్రలు తెల్పుచున్నవి. అటువంటి పూజలు సగుణపూజలు అంటారు. గురువును శిష్యులు పూజించడము సగుణపూజయే అగును. శ్రీరాముని ఆనాటి శబరి పూజించింది. శ్రీకృష్ణుని ఆనాటి రాధ ఆరాధించింది. ఈ విధముగా బ్రతికి గుణములు కలిగి ఉన్న వారిని పూజించడము సగుణపూజ అంటారు. ఎదుట ఉన్న దానిని పూజించడము వలన దానికి ఆ పేరు వస్తున్నది కాని, పూజించు వారిని బట్టి ఆరాధన పేరు రావడములేదని తెలియండి. ఉదాహరణకు కుళ్లాయి అను వ్యక్తి ఆంజనేయస్వామిని పూజిస్తున్నాడనుకొనుము. అపుడు ఎదురుగా ఉన్న ఆంజనేయస్వామిని బట్టి దానిని ఆంజనేయ ఉపాసనని అంటాము కాని, చేయు వానిని బట్టి కుళ్లాయి ఉపాసనని అనము కదా! ఈ విధముగా యోచిస్తే గుణములేని దైవప్రతిమలకు చేయు పూజలన్నియు నిర్గుణ పూజలనీ, గుణములు గల మనుషులను పూజిస్తే సగుణపూజలనీ అనవచ్చును.

**వారు అడిగిన ప్రశ్న :** స్వామిగారు! ఒక వ్యక్తి గుడిలో ప్రతిమలను గాక, మనుషులను గాక, ఆవును దైవముగా భావించి పూజిస్తున్నాడనుకొందాము. ఇటువంటి పూజనేమనాలి?

**మా జవాబు :** ఆవు కూడా జీవము కల్గి గుణములు కల్గి ఉన్నది. కావున దానిని కూడా సగుణపూజయే అనాలి.

**వారు అడిగిన ప్రశ్న :** గురువులూ గొప్ప మహర్షులూ గుణములను జయించినవారని, వారికి ఏ గుణములుండవని అంటారు కదా! అటువంటపుడు వారిని పూజించుట సగుణపూజ ఎలాఅగును?

**మా జవాబు :** గురువులు, మహర్షులు, యోగము చేయునపుడు గుణముల జయించి ఏ గుణమలు లేకుండా ఆ సమయములో మాత్రముందురు. తిరిగి కళ్లు తెరచిన తర్వాత అంటే బ్రహ్మయోగము చేయనపుడు వారియందు కూడా గుణములు పనిచేయుచుండును. గుణములు పని చేస్తేనే ప్రతి ఒక్కరు చలించి పనులు చేసేది. గుణములు లేకపోతే చలనమే ఉండదని తెలియాలి. గురువులు, యోగులు యోగము చేసినపుడు గుణములను అణచివేయుశక్తి వారికి గలదు. అందువలన వారిని గుణముల జయించిన వారని అనవచ్చును. మిగతా మానవులు ఏ సమయములో కూడా గుణములను అణచివేయ లేదు కనుక గుణములను జయించినవారని మిగతవారిని అనలేము.

**వారు అడిగిన ప్రశ్న :** సగుణ నిర్గుణ అనినట్లు సాకార నిరాకార పూజలు కూడా ఉన్నాయి కదా! సాకార పూజంటే కంటికి కనుపించు ఆకారము గల దానిని పూజించడమని, నిరాకార పూజంటే ఆకారము లేకుండా ఉన్న పరమాత్మను ధ్యానించడమని మా భావము. మా భావము సరియైనదో కాదో మీరు తెలియజేయండి.

**మా జవాబు :** దైవమైన పరమాత్మకు రూపములేదు. అట్టి రూపము లేని

పరమాత్మ ధర్మములను తెలియజేయు నిమిత్తము రూపముకల్గిన మానవాకృతిలో మన మధ్యకు వచ్చి తన ధర్మములను తెలియజేసి తిరిగి రూపములేని స్థితిలోనికే పోవును. ఒక రూపము కల్గి వచ్చిన పరమాత్మను సాకారుడనీ, తన అవతారము చాలించి పోయినపుడు నిరాకారుడనీ అనడము సరియైన పద్ధతి. నిరాకారమైన పరమాత్మ ఆకారము ధరించి వచ్చినపుడు ఆ మనిషిని పూజించడము సాకారపూజయని అంటాము. ఆకారములేని పరమాత్మను ధ్యానించడము నిరాకారపూజ అంటాము.

**వారు అడిగిన ప్రశ్న :** ఒక గురువును దైవముగా పూజిస్తున్నామనుకోండి. ఆ గురువు నిజముగా పరమాత్మ అవతారము కాదనుకోండి. మీరన్నట్లు అది సగుణపూజయైన గురువుగారికి ఆకారమున్నది కదా దానిని సాకార పూజయే అనవచ్చును కదా! అట్లే పరమాత్మయే మనిషిగా వచ్చినపుడు ఆయనను పూజిస్తున్నామనుకోండి. అపుడు అది సాకారపూజయే అయినప్పటికీ దానిని సగుణపూజ అని కూడా అనవచ్చును కదా!

**మా జవాబు :** ఆకారమున్నపుడు గుణములు, గుణములున్నపుడు ఆకారము తప్పక ఉంటాయి కావున ఆ పూజలను సగుణ సాకార పూజలనవచ్చును. కాని నిర్గుణ పూజలైన ప్రతిమారాధనలు నిరాకారపూజలు కావు. ఎందువల్లననగా, ప్రతిమలకు ఆకారము ఉన్నది కావున పరమాత్మకు అసలు రూపులేదు కావున.



సగుణ సాకార పూజలొకటి కావచ్చును కాని నిర్గుణ నిరాకార పూజలొకటి కావని తెలియాలి. ఎదుట ఉన్న దానిని బట్టి ఆరాధన పేరు కానీ, చేయు వానిని బట్టి కాదను సూత్రము తెలియాలని మరియొక మారు తెలియజేయుచున్నాము.

*****

# జ్ఞాన యజ్ఞము

యజ్ఞమనగా లేకుండా చేయడమని, కాల్చివేయడమని అర్థము వచ్చునట్లు చెప్పారు. ద్రవ్యయజ్ఞమనగా ద్రవ్యములను కాల్చుట అన్నారు. దీని ప్రకారము జ్ఞానయజ్ఞమనినా జ్ఞానమును కాల్చి వేయడమనియేగా అర్థము. ద్రవ్యయజ్ఞములో ద్రవ్యములు కాలునన్నవారు, జ్ఞానయజ్ఞములో మాత్రము కర్మ కాలుననడము సమంజసమేనా? జ్ఞానయజ్ఞమనగా నిజార్థమేమి? అని కొందరికి సంశయమురావచ్చును. దానికి జవాబు ఏమనగా!

ద్రవ్యయజ్ఞము, జ్ఞానయజ్ఞములనునవి భగవంతుని గీతయందే చెప్పబడినవి. కావున అవి శాస్త్రబద్ధమైనవే కానీ అశాస్త్రీయమైనవి కావు. ఈ రెండిటియందు ద్రవ్యయజ్ఞముకంటే జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనదనీ కూడా భగవంతుడు తన గీతలో జ్ఞానయోగమను అధ్యాయము 33వ శ్లోకమందు కూడా చెప్పాడు. గీత భావము ప్రకారము ద్రవ్యయజ్ఞము ద్రవ్యములను కాల్చునదియే అగును. అదే విధముగా జ్ఞానయజ్ఞము జ్ఞానముల కాల్చునదియే అగును. జగత్తుకే ఆచార్యుడై జగత్తుకు గీతను గీచినవాడు తన బోధలో ఏ పొరపాటు చేయడు. వాస్తవ విషయమును సూచించుటకే

వాటియందు అర్థమిమిడియుండునట్లు ఒక దానిని ద్రవ్యయజ్ఞమనీ, మరొక దానిని జ్ఞానయజ్ఞమనీ పేరు పెట్టి చెప్పాడు. ద్రవ్యయజ్ఞములో నాలుగు రకములుగా విభజించిన అనేకరక ద్రవ్యములు కాలిపోవుచున్నవి. దాని స్థానము ఉదరములో అని చెప్పబడియున్నది. ఇక జ్ఞానయజ్ఞ వివరము దాని నిజార్థము పరిశీలించి చూచెదము.

మానవుని శరీరములో రెండు రకముల అవయవములు గలవు. అవి కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు. కర్మేంద్రియ జ్ఞానేంద్రియ సమిష్ఠి పని వలననే అనేక కార్యములు జరుగుచున్నవి. లోపలి కర్మవలన అనగా నిర్ణయింపబడి ఉన్న ప్రారబ్ధము వలన పనులు జరుగుచుండగా, ఆ కార్యములలోనే క్రొత్తగా వచ్చు ఆగామికర్మ మిలితమై ఉన్నది. జరుగుచున్న కార్యములో వచ్చు ఆగామికర్మను కాల్చివేయడము కర్మ యజ్ఞమగును. కర్మయజ్ఞమునకే గీతయందు భగవంతుడు జ్ఞానయజ్ఞమని కూడా పేరు పెట్టాడు. అలా జ్ఞానయజ్ఞము అనడములో జ్ఞానమును కాల్చి వేయడమనియేగా అర్థము అని కొందరడుగవచ్చును. దానికి సమాధానమేమనగా! జ్ఞానేంద్రియముల జ్ఞానమును కాల్చివేయడము జ్ఞానయజ్ఞమని చెప్పబడినది. అందువలనే కన్ను, ముక్కు, చెవు, నాలుక, చర్మము అను అవయవములను జ్ఞానేంద్రియుములని చెప్పారు. జ్ఞానేంద్రియముల జ్ఞానములను కాల్చి వేయడమను క్రియకు జ్ఞానయజ్ఞము అనుట సమంజసమే అగును. జ్ఞానయజ్ఞములో అగ్నిగా ఉపయోగపడునది ఆత్మజ్ఞానమనబడు అగ్ని. ద్రవ్యయజ్ఞములో ఉపయోగపడు అగ్ని భౌతికముగా తయారైన క్లోమ, పైత్య, లాలాజలముల చేత తయారైన అగ్ని అని తెలియవలెను. స్థూలగ్రంథుల నుండి స్రవింపబడిన స్థూల రసముల రసాయనాగ్ని కడుపులోనికి చేరినపుడు ద్రవ్యములను ద్రవములను జీర్ణింప

చేయుచున్నది. అలాగే శిరస్సులో సూక్ష్మములైన ఆత్మానాత్మల సూక్ష్మ విషయములు తెలియుట వలన ఏర్పడిన సూక్ష్మ అగ్ని జ్ఞానేంద్రియములలో సూక్ష్మముగా ఉన్న జ్ఞానార్థములను కాల్చివేయడమే జ్ఞానయజ్ఞమని తెలియుచున్నది. ద్రవ్యయజ్ఞములో అన్ని స్థూలములే కాగ, జ్ఞానయజ్ఞములో అన్ని సూక్ష్మములే అని గ్రహించవలెను. ద్రవ్యయజ్ఞములో నాలుగు ద్రవ్యములు నశించి వాటినుండి శరీర పోషకములు బయలుపడుచున్నవి. అలాగే జ్ఞానయజ్ఞములో జ్ఞానేంద్రియములలో ఇమిడి ఉన్న ఐదు జ్ఞానములు నశించి వాటినుండి శరీర నాశనములు (జన్మ నాశనములు) బయలు పడుచున్నవి. ద్రవ్యయజ్ఞములో శరీరమును పోషింపజేయు నాల్గు విధముల ఆహారములు బయలుపడుచున్నవి. అలాగే జ్ఞానయజ్ఞములో శరీర రాహిత్యమును కలుగజేయు విధానములు బయలుపడుచున్నవి. ఈ విధముగా జ్ఞానేంద్రియములలోని ప్రపంచ జ్ఞానార్థములను కాల్చి వేయడమును (లేకుండా చేయడమును) జ్ఞానయజ్ఞమని తెలుసుకోవచ్చును. జ్ఞానేంద్రియముల ద్వారా వచ్చు కర్మను ఆత్మానాత్మ వివరముల ద్వారా అనగా ఇది ఆత్మనీ, ఇది ఆత్మగాని అహమనీ తెలియుట వలన లేకుండా చేయవచ్చును. కర్మ లేకుండా పోవుచున్నది కావున కర్మయజ్ఞమనీ, ఏ విధముగా చూచినా జ్ఞానేంద్రియముల ద్వారనే కర్మ మొదలవుచున్నది కావున ఈ విధానమును జ్ఞానయజ్ఞమనియు చెప్పుచున్నాము. దీనిలో జ్ఞానేంద్రియముల బయటి జ్ఞానసమూలము కాలుచున్న దని, లోపలి ఆత్మ సంబంధిత జ్ఞానముకాదనీ ముఖ్యముగా తెలియాలి. జ్ఞానయజ్ఞములో కర్మ పోవుచున్నది, కావున జ్ఞానయజ్ఞమును కర్మయజ్ఞమని కూడా అనవచ్చును.

*****

# జపమాలలో పూసలెన్ని ?

ఇందూ ధర్మములలో ఒక ముఖ్యమైన ధర్మము జపమాల ఉపయోగము. ఇందూ ధర్మములు సృష్టికర్తయైన దేవున్ని తెలుపునవి, కావున వాటిని ముఖ్యముగా తెలుసుకోవడము మన కర్తవ్యము. మొదట ధర్మమంటే ఏమిటో తెలుసుకొందాము. ఒక వస్తువు లేక పదార్థము అనగా జీవమున్నది కానీ, లేక జీవములేనిది కానీ, దానికున్న సూక్ష్మ సహజత్వమును ధర్మమంటాము. ధర్మమనునది పుట్టుకతో వచ్చునది. అందువలన దానిని సహజత్వమన్నాము. **"జ"** అనగా పుట్టుటని అర్థము. సహజ అనగా వెంట పుట్టినదని అర్థము. ఒక జాతికి ఒకే విధముగా పుట్టుకతో వచ్చినదేదో అదే దాని ధర్మమగును. మానవజాతికంతటికీ పుట్టుకతోనే ఆత్మ ధర్మమున్నప్పటికీ అది తెలియకుండాపోవుట వలన ఆత్మ ధర్మములన్నీ అధర్మములుగా మారి పోయినవనియే చెప్పవచ్చును. సిద్ధాంత పరమైన మరియు ఆచరణయోగ్యమైన ఆత్మధర్మములు జీవాత్మగా పుట్టిన వారందరికి సంబంధించినవేయగును. మతభేదములు లేకుండా సమస్త మానవాళికి సంబంధించిన ధర్మములనే ఇందూధర్మములు అంటున్నాము. జ్ఞానపరమైన ఆత్మ సకల శరీరములలో ఉన్నది. అందువలన మానవుని ధర్మములను ఇందూధర్మములనవలసి వచ్చినది. జ్యోతిష్యశాస్త్రము ప్రకారము ఆత్మజ్ఞానమునకు చంద్రుడు అధిపతి మరియు చిహ్నము. చంద్రుని 'ఇందువు' అని కూడ అందుము. ఆత్మజ్ఞాన సంబంధ ధర్మములు కావున చంద్రుని పేరును సూచిస్తూ ఇందూధర్మము అన్నారు. ఇందూ ధర్మములనగా ప్రత్యేకమైన మత ధర్మములనుకోకూడదు. ఆత్మ గల ప్రతి మనిషికి సంబంధించిన ధర్మములని తెలియాలి.

పూర్వము భారతదేశములో ఆత్మజ్ఞానము గలవారు ఎక్కువగా ఉండెడివారు. ప్రపంచ దేశములన్నిటికంటే ఎక్కువ జ్ఞానులున్న భారత దేశమును జ్ఞానుల దేశమనెడి వారు. జ్ఞానమునకధిపతి ఇందువు (చంద్రుడు) కావున జ్ఞానము తెలిసిన వారందరినీ ఇందువులనెడివారు. అందువలన ఈ దేశమును ఇందూ దేశమన్నారు. పూర్వకాలమున్నంత మంది జ్ఞానులు ఇపుడు లేకున్నా ఇందూదేశమను పేరు ఇంకనూ మిగిలివున్నందుకు సంతోషించాలి. ఇందూదేశములోని వారికి ఇందూ ధర్మములంటే ఏమిటో తెలియకపోవడము వలన మా మతములు వేరనీ మాదేవుడు వేరని అనుకొంటున్నారు. 'ఇందూ' అను పదము ప్రతి మనిషికి సంబంధించినదని తెలియకుండాపోయినది. 'ఇందూ' అను పదము ఏ మతమునకు సంబంధించినది కాదు. ఎందుకనగా! ఇందూ ధర్మములు దేవునికి అతి దగ్గరగనున్నవి. కావున జ్ఞానము తెలిసి దేవుని విశ్వసించు ప్రతి ఒక్కడు ఇందువేనని చెప్పాలి. ప్రతి మనిషికి సంబంధించిన పవిత్ర ఇందూ ధర్మములు ఎల్లపుడూ అందరికీ తెలిసియుండేలాగ ఎన్నో ధర్మ ఆచరణలను మన పెద్దలు కల్పించి పెట్టారు. అయినప్పటికీ ధర్మము లన్నియు తెలియకుండాపోయి అవి అధర్మములుగా మారి పోయాయి. కొన్ని ఆచరణలు మన మధ్య మిగిలియున్నప్పటికీ అవి అంతంతమాత్రమై, అర్థరహితమై, అధర్మములనుటకు తార్కాణములై ఉన్నాయి. అటువంటి వాటిలో ఒక ధర్మమును పరిశీలించి చూస్తాము.

ఈ ప్రపంచమునకు కొంత ఆయుష్షు కలదు. అది శాస్త్రబద్ధముగా వేయియుగములు. కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగమను నాల్గు యుగముల వరుస 250 మార్లు జరిగితే ప్రపంచ ఆయుష్షు పూర్తి అగును. "సహస్రయుగ పర్యంత మహర్యద్బ్రహ్మణో విదు"

అన్న దేవుని వాక్యము ప్రకారము వేయియుగములు దేవుని పగలనియు, దానినే జగత్ సృష్టిస్థితి అనియు చెప్పుచున్నాము. జగతిలో కృతయుగము యొక్క పరిమితి కాలము 17, 28, 000 సంవత్సరములు. త్రేతాయుగ కాలపరిమితి 12,96,000 సం॥, ద్వాపరయుగకాలము 8,64,000 సం॥, కలియుగకాలము 4,32,000 స॥. ఈ నాల్గుయుగముల మొత్తము కాలము 43,20,000 సం॥. అనగా కలియుగమునకు పదిరెట్లు ఎక్కువన్న మాట. నాల్గుయుగములు 250 మార్లు జరిగిన 43,20,000 × 250 = 108,00,00,000. అనగా ప్రపంచము యొక్క ఆయువు 108 కోట్ల సంవత్సరములు.

భూమిగానీ, ఆకాశముగానీ, భూమి మీద సామ్రాజ్యములు గానీ, సామ్రాజ్యములలోని మతములు గానీ మనగలిగేది 108 కోట్ల సంవత్సరము లేనన్నమాట. నీకు ప్రపంచములో ఆడే నాటకమునకు చివరిగా తెరపడేది 108 కోట్ల సంవత్సరములకే. జీవాత్మల యొక్క చావు పుట్టుకల కథ జరుగునది 108 కోట్ల సంవత్సరములని తెలియాలి. ఇది దేవుడు జీవుల వెంటపంపిన సహజ ఆయుఃకాలము. ఇది మన ఆయువు యొక్క ధర్మమని అందరికీ తెలిసేలాగా 108 సంఖ్యను మన మధ్యనే ఉండునట్లు పెద్దలు చేశారు. 108 సంఖ్య ఏమిటని తెలియని వారు యోచించునట్లు, తెలిసిన వారు మరచిపోకుండునట్లు దైవారాధనలోను, నామజపములోను, మంత్ర జపములోను దాని ప్రత్యేకతను ఇరికించారు. దైవజపములోను, మంత్ర జపములోను 108 పూసల మాలనే వాడాలని పెద్దలు సూచించారు. చివరకు ప్రదక్షిణలు 108 చేయాలని, విరాళము చేయు సొమ్ముగానీ 108 సంఖ్యగా ఉండునట్లు చేయమని తెలిపారు. అంతేకాక 108 సంఖ్యకు మనకు చాలా ముఖ్యమైన దగ్గర సంబంధ మొకటున్నది అదెట్లని చూచిన.

మన శరీరములో ఆశ, కోపము, లోభము, మోహము, గర్వము, అసూయ అను ఆరు చెడు గుణములు గలవు. వాటికి వ్యతిరేఖమైన దానము, దయ, ఔదార్యము, వైరాగ్యము, వినయ, ప్రేమ అను ఆరు మంచి గుణములు కూడా గలవు. ఇవన్నియు శరీరములో ఉండుట వలన వీటి మీద కర్మ, కర్మ మీద నవగ్రహములు అధికారము కల్గియున్నవి. అందువలన నవగ్రహములను అనుసరించి కర్మ, కర్మను అనుసరించి గుణములు స్పందించుచుండును. నవగ్రహముల ప్రభావము కర్మ ద్వారా గుణముల మీద గలదు. ఆదిత్యాది తొమ్మిది గ్రహములు గుణములను కూడా ఒక్కొక్క దానిని తొమ్మిది రకములుగా విభజించినవి. కోపము తొమ్మిది స్థాయిలుగనున్నది. అందువలనే మనకు వచ్చు కోపములో పెద్ద స్థాయి కోపము, చిన్న స్థాయి కోపము గలదు. అట్లే పెద్ద ఆశ గలదు, చిన్న ఆశ గలదు. మిగతా అన్ని గుణములట్లే ఉన్నవి. ఇది ప్రత్యక్షముగా కనిపించు విషయమే. ఈ విధముగా మన శరీరములోని చెడు గుణములు ఒక్కొక్కటి తొమ్మిదిగ చీలిపోగా, అట్లే వాటికి వ్యతిరేఖమైన ఆరు మంచి గుణములు కూడా ఒక్కొక్కటి తొమ్మిది భాగములుగా చీలిపోయినవి. ఒకవర్గమైన ఆరు గుణముల చీలికలెన్నియని లెక్కించి చూచిన 6×9=54 కాగలవు. అట్లే మరొక వర్గమును గుణించి చూచిన 6×9=54 కాగలవు. ఈ విధముగా వచ్చిన మొత్తము గుణముల సంఖ్య 108 అని తెలియుచున్నది.

ప్రపంచ ఆయుస్సు 108 కోట్ల సంవత్సరములననుసరించియే మానవుల జీవితమును నడుపు గుణముల సంఖ్య 108 ఉండునట్లు దేవుడు సరిచేసి పెట్టాడు. గణితములో అతి పెద్ద సంఖ్య కోటి. గణితములోని 108 కోట్లు జ్ఞప్తికుండునట్లు 108 ఆలోచన వికారములను మన శరీరములో దేవుడు పెట్టాడు. ఆ వికారములు గుణితము వలన వచ్చినవి కావున

గుణితమునకు దగ్గర పదమైనది, గుణితము నుండి ఉద్భవించునదిగా కన్పించునట్లు వాటిని **"గుణము"**లన్నారు. ఈ విధముగా శరీరములో గల యోచనలకు గుణములను పేరు కల్గినది. ఇన్ని విధముల పెద్దలు యోచించి గుణములని ప్రత్యేకమైన పేరుపెట్టి, వాటి యొక్క 108 సంఖ్యను కూడ ప్రత్యేకముగా పెట్టారు. 108 కోట్ల సంవత్సరములు 108 గుణములతో జీవితము గడుపవలెనని గుర్తుండునట్లు మనము జపించు జపమాలలో 108 పూసలనుంచారు. అయినప్పటికీ మన పెద్దలు తెల్పిన విధానము కొంత మాసిపోయింది. దేవుడు జీవుని వెంట పంపిన ఆయువు యొక్క ధర్మము అధర్మముగా మారిపోవుచున్నది. జపమాలలో 108 సంఖ్య ఇంకనూ మిగిలి ఉన్నప్పటికీ దాని అర్థము తెలియకుండా పోయినది. విరాళము చేయుటలోను, ముడుపులు కట్టడములోను, పెళ్ళిల్లలో డబ్బు చదివించడము లోను 108 కి బదులు 116 మరియు 101 సంఖ్య వచ్చి పడుచున్నది. పూర్వము కొన్ని లక్షల సంవత్సరముల ముందు, ఇపుడున్న అనేక మతములు లేక ముందు జపమాల సంఖ్యను నిర్ణయించి పెట్టారు. అయితే కాల గమణములో ఆ సంఖ్య 116 గాను, 101 గాను మారిపోయి అక్కడక్కడ 116,101 కూడా వినిపించుచున్నది. ఇప్పటికీ జపమాలలో 108 సంఖ్య ఉండడము చూస్తే కొంత ధర్మము మిగిలినదని చెప్పవచ్చును. కొందరు 101 మరియు 116 సంఖ్యను మాలలో పెట్టుకొంటే అది పొరపాటని మతములు పుట్టకమునుపే కాలగమణములో మారిపోయిన సంఖ్యను మార్చుకొంటే అర్థముతో కూడుకొన్నదగుననీ, లేకపోతే అర్థహీనమగునని తెలుపుచున్నాము. దేవుని మీద విశ్వాసమున్న వారంతయు ఏ మతము వారైనా ఇందువులే అనగా జ్ఞానులే. 'ఇందు' అను పదము మతమునకు సంబంధించినది కాదు. కావున అన్ని మతములలోను జపమాల

ఉపయోగము కలదు. అన్ని మతములలోనూ జపమాల ఉన్నప్పటికీ దాని విశిష్ఠత తెలియకుండా పోయినది. ఇందూ ధర్మములలో ముఖ్యమైన ఆయుః ధర్మము ఇలా అధర్మముగా మారిపోవుటకు దగ్గర పడుచున్నది. ఇందువులైన వారు ఇలాంటి ఎన్నో ధర్మములను సరైన మార్గములో ఆచరించవలెనని కోరుచున్నాము. ధర్మాన్ని ఆచరించడమనగా స్వధర్మమైన ఆత్మ ధర్మమాచ రించడము. అది నిన్ను కాపాడుతుందనగా ఆచరణలో గల జ్ఞానము నీ కర్మనుండి నిన్ను కాపాడి దేవునివద్దకు పంపుతుంది.

**ధర్మాన్ని ఆచరించు అది నిన్ను కాపాడుతుంది.**

*****

# పండుగలు

కాలము పవిత్రమైనది దైవస్వరూపమైనది. ఒక మాటలో కాలమే నేనని దేవుడు కూడా గీతయందన్నాడు. కాలమెంత గొప్పదైనా మనకు సహజమైనదిగా ఉన్నది. దాని విలువ ఏమాత్రము కనిపించకున్నది. ఎవరు కాలమును గురించి ఆలోచించడము లేదు. కొందరు పెద్దలు కాలము విలువైనదని గ్రహించి టైమ్ ఈజ్ మని (కాలము డబ్బుతో సమానము) అన్నారు. ఆ మాటకంటే కూడా విలువైనదని మేమనుచున్నాము. ఎందుకనగా! పోయిన డబ్బును తిరిగి సంపాదించవచ్చును. జరిగిపోయిన కాలమును తిరిగి సంపాదించలేరు.

ప్రతి జీవరాసి కాలమును అనుభవిస్తూ ఉన్నది. ప్రతి జీవరాసి శరీరముతో ఎన్నో మంచి చెడుపనులయందు కాలమును వినియోగించు

చున్నది. జరిగెడి కాలమందు మంచి పనిజరిగినా, చెడ్డపని జరిగినా చేసెడి జీవరాసికే వాటి ఫలితము అనుభవము. కానీ కాలమునకు మంచి చెడ్డతో ఏమాత్రము సంబంధములేదు. అందువలన కాలము దైవస్వరూపమైన దేననుటలో సందేహము లేదు. కాలము ఒక మనిషికి, ఒక జాతికి, ఒక దేశమునకే పరిమితమైనది కాక యావత్ ప్రపంచమునకే వినియోగింప బడుచున్నది. ఉదాహరణకు ఇండియాలో ఉన్న వ్యక్తికి, అమెరికాలో ఉన్నవ్యక్తికి కాలమొకేవిధముగా ఉన్నది. అందరికీ సమానమైన కాలములో వారివారి పనులు వారి వారి అనుభవములు వేరై ఉండవచ్చును కానీ, కాలమందరికీ ఒక్కటే. అందువలననే కాలము దైవస్వరూపమని చెప్పవచ్చును.

జన్మతో ప్రారంభమైన కాలము మరణముతో అంతమౌచున్నది. జన్మకు మరణమునకు మధ్యనున్న కాలమును జీవితము లేక జీవిత కాలము అంటున్నాము. జీవిత కాలములో కొందరు మంచిగా కొందరు చెడ్డగా జీవితమును సాగించుచున్నారు. అనంతమైన కాలములో ఎవరు ఎన్ని విధముల బ్రతికినా, చివరకు వారు కాలగర్భములో కలసిపోవువారే.

జీవితకాలములో ప్రత్యేకత కల్గిన వారిని చిరంజీవులని అనడము జరుగుచున్నది. వారి జీవితకాలము కొద్దియే అయినప్పటికీ వారి జీవిత ధ్యేయము చాలా గొప్పదిగా ఉండును. వారు అందరిలాగకాక జీవితములో ప్రత్యేకమైనదియే సాధించి ఉందురు. అటువంటి వారిని కారణజన్ములు, చిరంజీవులని అనుచున్నాము.

ఈ కాలములో కాలమంటే ఏమిటి? అని యోచించక వృథాగా కాలము గడిపి పుట్టలోని చెదలు పుట్టదా! గిట్టదా! అనులాగున ఏమిటికి

సార్థకము లేని జీవితమును చాలామంది గడుపుచున్నారు. క్షణ క్షణము మన శరీరములో మార్పు జరుగుచున్నది. క్షణ క్షణ మార్పుల చేతనే బాల్యము నుండి వృద్ధాప్యమునకు శరీరము చేరుకొనుచున్నది. దినదిన కాలము జరుగుకొలది మృత్యువు దగ్గరవుచున్నది. జరుగు కాలములో ఏదో ఒక దినము మృత్యువును చేరవలసిందే. అయినప్పటికీ జరిగిపోవు కాలమును దృష్టిలో పెట్టుకొని మరణము దగ్గరవుతున్నది కదా! అని ఎవరు తలవడము లేదు. మనము తలచినా తలవకుండినా కాలము ఆగునది కాదు, మృత్యువు రాకమానదు.

మానవుని దృష్టిలో విలువ లేని కాలమునకు విలువ కల్పించాలని, జరిగిన కాలము తిరిగిరాదని తెలిపించాలని, నీ జీవిత కాలము కొద్ది పాటియే, ఆ కొద్దిపాటి కాలము కూడా ఖర్చయిపోతున్నదని ఆలోచించాలని, జరిగిన నీ జీవితకాలములో ఏమి సాధించానని యోచించాలని, అసలు కాలమంటే ఏమిటో కనువిప్పు కల్గించాలని పెద్దలు పెట్టినవే పండుగలు. కాయ కొంత కాలమునకు పండుగా మారుచున్నది. కాయ అనుది పండుగా పరివర్తన చెందుట మనకు పూర్తిగా తెలిసిన విషయమే. మార్పు వచ్చిన పండు నుండి పుట్టిన పదమే పండుగ.

సాధారణముగా ప్రకృతి సిద్ధముగా ప్రతి చెట్టు సంవత్సరమున కొకసారిగానీ, ఆరునెలలకొకసారిగానీ, మూడునెలలకొకసారిగానీ పుష్పించి కాయలు కాయడము సహజము. చెట్టునుండి కాయ కాచి పండుగా మారుటకు వ్యవధి సంవత్సర కాలము పట్టుచున్నది. చెట్టును ఉదాహరణగా తీసుకొందాము. చెట్టు నిండు జీవితములో ఒకసారి ఫలములు ఫలించిన ఒక సంవత్సర కాలము గడచిపోవుచున్నది. అట్లే మానవుని జీవితకాలము

ఒక సంవత్సర కాలము గడచిన, కాయ పండుగ మారినంత కాలమని పండుగయని పేరు పెట్టారు. కాయ పక్వమున కొచ్చినంత కాలమని పక్వదిన మనెడివారు. కాలక్రమేణ ఆ పదము ఇప్పుడు పక్వదినముపోయి పర్వదినమైనది.

చెట్టు సంవత్సరము కాలమునకు తన సారమైన ఒక పండు నిచ్చి పరులకు ఉపయోగపడినది. నీవు ఇతరులకు ఏ విధముగా ఉపయోగపడినావు అని గుర్తువచ్చునట్లు, సంవత్సర కాలములో తాను సాధించిన ఫలితమేమి అని యోచించునట్లు ఒక దినమును పండుగ అను పేరుతో ఉంచారు. నిత్య జీవితములో మునిగి పోయిన మనిషి కాలమును మరచిపోయాడు. కావున నీ జీవితములో కొంత కాలము గడచిపోయినదని గుర్తింపు వచ్చునట్లు పండుగనుంచారు. ఉదాహరణకు యుగాది పండుగను తీసుకొందాము. పోయిన సంవత్సరము యుగాది పండుగ చేశాము ఈ సంవత్సరము కూడా చేయుచున్నాము. దీనినే క్రొత్త సంవత్సరము అని కూడా అనుచున్నాము. పూర్వము పెద్దలు జీవితములో ఒక సంవత్సరము గడిచిపోయినది, మరియొక క్రొత్త సంవత్సరము జరుగబోవుచున్నది, జరిగిన సంవత్సరములో నేనేమి జ్ఞానమును సాధించానని వెనుతిరిగి చూచుకొనెడివారట. అందువలన ఆ దినమందు నిత్య జీవిత కార్యములలో లగ్నముకాక అన్నీ వదలి విశ్రాంతి తీసుకొని, వెనుకటి కాలమును గూర్చి కూడా ఆలోచన లేకుండునట్లు, కొంత కాలమునకు ముందే అన్ని ఆహార పదార్థములు అన్ని దినములకంటే మంచిగా ఉండునట్లు, ఆహారమును గూర్చి ఆ దినము చింతరాకుండునట్లు సమకూర్చుకొనెడివారు. ఆహారమందు కానీ, గుడ్డలందు కానీ చింతలేకుండా

సమకూర్చుకొని ప్రక్క పనులు అన్నియు వదలివేసి జరిగిపోయిన కాలమును గూర్చి యోచించడము ఆనాటి కర్తవ్యమై ఉండెడిది. ఆ దినము తన జీవిత కాలమును గూర్చి యోచించునది కావున జ్ఞాన సంబంధమైన దినముగా భావించుకొనెడి వారు. నా జీవితము ఇంతకాలము ఈ విధముగా గడచి పోయినది, జరుగబోవు పండుగ కాలము వరకు సారాంశమైన దైవ సంబంధమైన జ్ఞానజీవితమును గడుపవలయునని కోరుచు ప్రార్థనా మందిరములలోనో, ఇంటిలోనో దేవుని ఆరాధనలు జరిపెడివారు.

నీ జీవితము కొంత కాయనుండి పండుగా మారిపోయినదని, ఎప్పుడు రాలిపోతుందో చెప్పలేమని యోచించుటకు గుర్తింపుగా ఆనాడు పెద్దలు పండుగనుంచారు. నిత్య జీవితములో లగ్నమైయున్న మానవునికి నీ ఆయుష్షు కొంత గడిచిపోయినదని, గడిచిన కాలములో పుట్టి ఏమి సాధించావని తెల్పుటకే పెద్దలు పండుగనుంచారు. ఈ పండుగలు ఒక్క మతములో కాక అన్ని మతములందు ఉండడము గమనింపదగ్గ విషయము. ఒక్కొక్క మతమునకు ఒక్కొక్క పండుగ నిర్ణయించబడి ఉన్నది. పూర్వము అన్ని మతముల పెద్దలు ఒకే భావముతో పండుగలు ఉంచారో లేదో చెప్పలేము. అయినా పండుగ అంటే కాయలాంటి నీ జీవితము కొంత పరిపక్వతకు వచ్చి పండు అయినది తెలుపునదే పండుగ.

ఇప్పటి కాలములో అన్ని మతముల పండుగలు ఒకే పద్ధతి, ఒకే భావముగ ఉన్నవనుకుంటాము. పండుగ అంటే అన్ని మతముల వారు క్రొత్త దుస్తులు ధరించడము, మంచి తిండి తినడము, ఏదో ఒక దేవున్ని ఆరాధించడము, మ్రొక్కడము పరిపాటిగ ఉన్నది. కొందరు మాత్రము తిండి కోసమే పండుగ అన్నట్లు అన్ని దినములకంటే ఆ దినము ఎక్కువ

తిని ఆయాసపడుచున్నారు. కొందరు ఊయల ఊగడమో, ఆటలు ఆడడమో చేయుచూ సంతోషపడుచున్నారు. కొందరు తాగి తందనాలాడుచున్నారు. కొందరు పేకాటయందే అన్యచింత లేక దినమంతా గడుపుచున్నారు. కొందరేమో దేవుని మ్రొక్కుటకు లైసెన్సు దినమన్నట్లు ఆ ఒక్క దినము ఇష్టముండినా లేకున్న మ్రొక్కి చేతులు దులుపుకొంటున్నారు. కొందరు ఉద్యోగస్తులు ఉద్యోగమునకు సెలవు దినముగా ఉండునని పండుగంటే మంచిదేనని సంతోషిస్తున్నారు. కొందరు వ్యాపారస్తులు గడచిన సంవత్సరము ఎంత పాపము, ఎంత పుణ్యము సంపాదించామని లెక్కించక, డబ్బు ఎంత సంపాదించామని లెక్కలు చూచుకొనుచున్నారు.

పూర్వము పెద్దలు పెట్టిన భావమంతయూ మట్టిపాలై పండుగంటే ఏమిటో అసలైన అర్థమే తెలియక పోయినది. పూర్వము సంవత్సరమున కొక పండుగ ఉండెడిది. ఇపుడు సంవత్సరమునకెన్నియో లెక్క లేనన్ని ఉన్నవి. పూర్వమొక్కడే దేవుడను భావముండెడిది. ఇపుడు అనేకమంది దేవుళ్ళైనారు, అనేక పండుగలైనవి. మానవ జీవితమునకు కొలబద్ద పండుగని ఏమాత్రము యోచించని స్థితిలో ఎన్నియో పండుగలు చేసాము, ఇక ఎన్నియో పండుగలు రానున్నవి. ఇప్పటినుండి ఏ విధముగా చేయదలచుకొన్నారో! మీరే బాగా యోచించుకోండి.

*****

# కీర్తనా? - తత్త్వమా?

కీర్తి ప్రతిష్ఠలు అనుమాటలను కొన్నిచోట్ల వినియుందుము. అలాగే తత్త్వజ్ఞానము అనుమాటను కూడా వినియేయుందుము. దీనినిబట్టి కీర్తివేరు, తత్త్వమువేరని సులభముగా తెలియుచున్నది. కీర్తి ప్రపంచ సంబంధమైనది, తత్త్వము పరమాత్మ సంబంధమైనది. ఎందుకనగా! కీర్తి ఎంతగా సంపాదించ బడితే అది అంతగా ప్రపంచములోనే నిలిచి పోతుంది. తత్త్వము ఎంతగా తెలియబడితే అంతగా దేవునికి దగ్గర చేస్తుంది. కీర్తి ప్రపంచములో ప్రతిష్ఠింపబడునది, తత్త్వము పరలోకములో వ్యాపించబడునది. ఉదాహరణకు ప్రపంచకీర్తిని సంపాదించిన మహాత్మాగాంధీ మరుజన్మకు పోయాడు, కానీ మోక్షము పొందలేదు. తత్త్వజ్ఞానమును సంపాదించిన జనకమహారాజు పరలోకమునకు పోయాడు, కానీ జన్మకు పోలేదు. చాలామందికి వీటి వివరము తెలియక కీర్తి, తత్త్వముల భేదములను గుర్తించ లేకపోవుచున్నారు. అలా వాటి వివరముగానీ, వాటి భేదముగానీ తెలియక పోవడము వలన వాటి ఫలితముల భేదము కూడా తెలియకుండా పోయినది. అందువలన వీటి వివరము తెలుసుకోవడము ఎంతైనా మంచిదే.

ఇతరుల ప్రపంచ అవసరాలను ఎవడైతే తీర్చునో, వానిని ఇతరులు పొగడుదురు. అలా వానిని పొగడడమును కీర్తించడము అంటాము. ఒకడు ఇతరులకు ఉపయోగపడడము వలన వాడు కీర్తిని సంపాదించిన వాడౌతాడు. ఇతరుల ఆకలికి అన్నము పెట్టడము వలన, దాహమునకు నీరివ్వడము వలన, కట్టుకోవడానికి గుడ్డలివ్వడము వలన, నివశించుటకు ఇల్లు ఇవ్వడమువలన, మిగతా అవసరాలకు డబ్బు ఇచ్చుట వలన ఎవడైనగానీ కీర్తిని గడించినవాడవుతాడు. ప్రపంచ అవసరాలను గొప్పగా

తలచుచున్న మనిషికి, అటువంటి అవసరాలను తీర్చినవాడు గొప్పవానిగనే కనిపిస్తాడు. ప్రపంచ అవసరాలను గొప్పగా తలువక, వాటికంటే దైవ జ్ఞానము గొప్పదని తలచువాడు, దైవజ్ఞానమును అందించిన వానిని గొప్పగా తలచును. దైవజ్ఞాన జిజ్ఞాసపరునికి ప్రపంచకీర్తి గొప్పగా కనిపించదు. ప్రపంచ అవసరాలను తీర్చినవానిని గొప్పగా తలువదు. అతడు జ్ఞానమును అందించిన వానినే గొప్పగా తలచును. దీనిని బట్టి ప్రపంచకీర్తి, జ్ఞానకీర్తి అని రెండురకములుగా కీర్తిని విభజించుకోవచ్చును. ఉదాహరణకు దైవజ్ఞానకీర్తిని సంపాదించుకొన్న వారిగా ఎంతోమంది బోధకులను చెప్పు కోవచ్చును. దైవజ్ఞానము కూడా కొందరికి అవసరమే కావున ఆ అవసరమును తీర్చిన బోధకున్ని ఎవరైనా కీర్తించుదురు. కీర్తిప్రతిష్ఠవేరు, తత్త్వజ్ఞానమువేరని ముందే చెప్పుకొన్నాము. ఇక్కడ జ్ఞానకీర్తిని పొందిన బోధకునికి ఆత్మజ్ఞానము (తత్త్వజ్ఞానము) తెలియకపోతే అతడు మోక్షమును పొందలేడు. ఈ సూత్రము ప్రకారము దైవజ్ఞానమును చెప్పడములో ఎంతో కీర్తిని సంపాదించిన శంకరాచార్య, రామానుజాచార్య మొదలగు గొప్పవారు సహితము యోగులు కాలేక, మోక్షమును పొందలేక పోయారు. అంత గొప్పవారే మోక్షమును పొందలేకపోతే వారి మార్గమును అనుసరించువారు ఎవరూ మోక్షము పొందలేదనియే చెప్పవచ్చును. ప్రపంచ పనుల కీర్తిగానీ, జ్ఞానకీర్తిగానీ తత్త్వజ్ఞానముకాదు. ఇక్కడ కొందరికొక ప్రశ్నరావచ్చును దైవజ్ఞానమువేరు, తత్త్వజ్ఞానము వేరునా? అని ప్రశ్నించవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! దైవజ్ఞానము తత్త్వజ్ఞానము రెండూ ఒకటే. అయితే ఇక్కడ బోధకుల చేత చెప్పబడునది దైవజ్ఞానమని పేరు పెట్టబడిన ప్రకృతిజ్ఞానము. కావున అది దైవజ్ఞానము కానేరదు.

దాహమైన వాడు మంచినీరును కోరుకుంటాడు. ఎవడైనా నీరు ఇస్తే వాటిని కొద్దిగా త్రాగుతూనే వారు ఇచ్చినవి మంచినీరా లేక ఉప్పునీరా అని తెలుసుకోగలడు. నీటి విషయము అతనికి తెలుసును కనుక ఎవడైనా ఇవి మంచినీరని చెప్పి ఉప్పునీరు ఇస్తే, వెంటనే ఇవి మంచినీరు కాదు ఉప్పునీరని చెప్పగలడు. జ్ఞాన జిజ్ఞాసపరుడు దైవజ్ఞానమునే కోరుకుంటాడు. ఎవడైనా బోధకుడు జ్ఞానమును అందిస్తే దానిని దైవజ్ఞానమే అనుకుంటాడు. కానీ అది దైవజ్ఞానమా! ప్రకృతిజ్ఞానమా! అని గుర్తించలేడు. ఎందుకనగా అతనికి నీటి వివరము తెలిసినట్లు జ్ఞానము యొక్క వివరము తెలియదు. కనుక ప్రకృతి జ్ఞానమును పరమాత్మ జ్ఞానమని నమ్ముచున్నాడు. **ఎక్కడైతే స్త్రీ స్వరూపమును దేవతగా చెప్పుచున్నారో, ఎక్కడైతే మంత్రముల బీజాక్షరములను చెప్పుచున్నారో, ఎక్కడైతే యంత్రముల ప్రతిష్ఠను చెప్పుచున్నారో, ఎక్కడైతే యజ్ఞములను గూర్చి చెప్పుచున్నారో, ఎక్కడైతే బాహ్య ఆరాధనలను బోధించుచున్నారో అక్కడ చెప్పునదంతా ప్రకృతి జ్ఞానమని చాలామంది జ్ఞానజిజ్ఞాసులకు తెలియదు.** ఎంతోమంది బోధకులు గురువులవలె చలామణి అగుచూ, దైవజ్ఞానమను పేరుతో, ప్రకృతి జ్ఞానమును బోధిస్తున్నారు. అటువంటి బోధలను బోధించి కీర్తి పొందినవారు కీర్తి పరులేగానీ తత్త్వజ్ఞానపరులు కారు.

నీటిని, అన్నమును, వస్త్రములను, గృహములను, ధనమును లేని వానికిచ్చి ఆదుకొని పేరు పొందినవారు భూమిమీద ఎందరోగలరు. దానిమిచ్చువాడు తన సొమ్మును అన్యాయముగా సంపాదించి ఆ ధనమును ఇతరులకు ఏ రూపములో ఇచ్చినా అది దానమే అగును. ఏ రూపముగా సంపాదించినప్పటికీ ఇతరుల అవసరములకు ఉచితముగా ఇచ్చునది దానమే అగును. అటువంటి దానము వలన కీర్తిరావచ్చును కానీ మోక్షము

రాదు. అందువలన భగవద్గీతలో 'దానము వలన మోక్షము రాదనీ' భగవంతుడు విశ్వరూప సందర్శన యోగమను అధ్యాయములో చెప్పాడు. దుర్మార్గుడు దానమిచ్చినప్పటికీ అది వానికి కీర్తినే తెచ్చి పెట్టును. ఒక మంత్రి ఒక బీదవానికి ఉచితముగా ఏది ఇచ్చినా అది దానమే అగును. ఎవరు ఇచ్చారు ఎవరు తీసుకొన్నారన్నది ముఖ్యము కాదు. కానీ దానము ఇచ్చినవానిని తీసుకొన్నవాడు పొగుడును. అలాగే జ్ఞానజిజ్ఞాసపరుడు ఒక బోధకుని వద్ద బోధను విన్నపుడు విన్నవాడు చెప్పినవానిని పొగుడును. కానీ ఇక్కడ విన్నవాడు, బోధించినవాడు చెప్పినది ప్రకృతిజ్ఞానమా! పరమాత్మ జ్ఞానమా! అని చూడడము లేదు. బోధించువాడు జ్ఞానమను పేరుతో ఏది చెప్పినా అది అంతయు దైవజ్ఞానమే అనుకొను స్థితిలో జిజ్ఞాసపరుడు కలడు. అటువంటపుడు ప్రకృతి జ్ఞానము బోధించిన వానికి కూడా కీర్తిప్రతిష్ఠలు వచ్చుచున్నవి. ఇంతవరకు గత కాలములో కీర్తిని సంపాదించుకొన్న వారిని గూర్చి చెప్పుకొన్నాము. బలిచక్రవర్తి దానము చేయుటలో గొప్పవాడని అతనిని నేడు కూడా పొగుడుకొనుచున్నాము. అలాగే కర్ణుడిని కూడా పొగుడుచున్నాము. బలిచక్రవర్తి, కర్ణుడు మొదలగు వారు ప్రపంచ సంబంధ దానము చేసి కీర్తిని సంపాదించుకొన్నారు. అలాగే గత కాలములో ఎందరో బోధకులు గురువులవలె ప్రవర్తించి జ్ఞానమును చెప్పి కీర్తి పొందియున్నారు.

ప్రస్తుత కాలములో ధనికుడు వస్తుదానము, బోధకుడు జ్ఞాన దానము చేయుచున్నారు. అంతేకాక ధనికుడు బోధకులకు ధనమిచ్చి వారిచేత జ్ఞానదానము చేయించి తాను జ్ఞానదానము చేసినట్లు తృప్తి పొందుచున్నాడు. అలాగే జ్ఞానము తెలిసిన బోధకుడు కూడా తాను సంపాదించుకొన్న ధనమును వస్తురూపముగా ప్రజలకిచ్చి తాను వస్తు దానము చేసిన తృప్తిని పొందుచున్నాడు. ఉదాహరణకు ఒక బాబా తన

చుట్టు ప్రక్కల గ్రామాలలోని ప్రజలకు ఒక పండుగ సందర్భములో క్రొత్త వస్త్రములు, మిఠాయి పొట్లములు, లడ్డు ఉండలు పంచాడనుకుందాము. **అది ఒక బోధకుడు చేసిన వస్తుదానమగును.** అలాగే ఒక ఊరిలోని ధనికుడు తనచుట్టు ప్రక్క గ్రామాలవారందరూ వచ్చి జ్ఞానమును వినునట్లు ఒక స్వామీజీని ఆహ్వానించి అతనిచేత జ్ఞానమును చెప్పించాడనుకొందాము. **అది ఒక ధనికుడు చేసిన జ్ఞానదానమగును.** ఈ విధముగా ధనికులు వస్తు దానము, జ్ఞాన దానము రెండూ చేయుచుండగా, కొందరు బోధకులు జ్ఞానదానము, వస్తుదానము చేయుచున్నారు. ఇదంతయు కీర్తికి సంబంధించినదే అగును కానీ తత్త్వజ్ఞానము (ఆత్మజ్ఞానము)నకు సంబంధించినది కాదు.

తత్త్వజ్ఞానమనగా ఏమిటి? అని ప్రశ్నవస్తే **ఆత్మను గురించి తెలుసుకోవడమే ఆత్మజ్ఞానము లేక తత్త్వజ్ఞానము అంటాము.** ఇంతవరకు అద్వైతములోగానీ, విశిష్టాద్వైతములోగానీ, ద్వైతములోగానీ ఆత్మను గురించిన ప్రస్తావనరాలేదు. అందువలన ఆదిశంకరాచార్యులకు గానీ, రామానుజాచార్యులకు గానీ, మధ్వాచార్యులకు గానీ ఆత్మజ్ఞానము తెలియదన్నాము. మా మాటలోని సత్యమును తెలియలేక మా మాటను కొందరు అసత్యముగా లెక్కించుకొనినప్పటికీ మేము చెప్పుమాట ముమ్మాటికీ సత్యము. **దాగి ఉండి ఇప్పుడిప్పుడే బయటికి వచ్చిన ఒక్క త్రైతసిద్ధాంతములో తప్ప ఆత్మజ్ఞానము మరి ఎక్కడలేదు. త్రైతసిద్ధాంత ఆదికర్త అయిన శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరుల నుండి చెప్పబడిన త్రైత సిద్ధాంతములో ఆత్మంటే ఏమిటో తెలియబడినది.** అద్వైతసిద్ధాంతి అయిన ఆదిశంకరాచార్యుడు పరమాత్మను గూర్చి చెప్పాడు. విశిష్టాద్వైత సిద్ధాంతి అయిన రామానుజాచార్యుడు ప్రకృతికంటే విశిష్టమైనది పరమాత్మ అని చెప్పాడు. ద్వైతసిద్ధాంతి అయిన మధ్వాచార్యుడు జీవాత్మను,

పరమాత్మను గురించి చెప్పాడు. కానీ **ఆత్మను గురించి ప్రబోధాచార్యుడు మాత్రము తన త్రైతసిద్ధాంతములో తెలియజేశాడు.** అందువలన ఆత్మ జ్ఞానము ఎవరికీ తెలియదనినాము.

ఇంతవరకు కీర్తిని గురించి, తత్త్వజ్ఞానమును గురించి తెలుసు కొన్నాము. ధనమున్న ధనికులు కీర్తిని సంపాదించుకొనినా ఫరవాలేదు. కానీ జ్ఞానధనమున్న బోధకుడు ప్రపంచకీర్తిని సంపాదించుకోవడము మంచిది కాదు. ధనికులు ప్రపంచసేవలో భాగమైన దానములు చేయ వచ్చును. కానీ బోధకులు దైవసేవలో భాగమైన తత్త్వజ్ఞానమునే బోధించవలెను. ప్రపంచములో ఉపయోగపడు ధన, వస్తు, వస్త్ర, వాహన, కనకములిచ్చినా అవి భూమిమీద కొంతకాలము ఆ జన్మలో మాత్రము ఉపయోగపడును. ఒక్క ఆత్మజ్ఞానము మాత్రము మరుజన్మకు కూడా వెంటవచ్చును, శాశ్వతముగా ఉపయోగపడును. అందువలన ఒక స్వామీజీ దైవజ్ఞానమునకు సంబంధించిన పుస్తకములను అజ్ఞాన ప్రజలకు పంచినా అది సమర్థనీయమైన పనియగును. అలాకాక ధనికునివలె అనేక గ్రామాలకు నీటి సౌకర్యము కల్గించినా, కొన్ని వేలమందికి నిత్యాన్నదానము చేయించినా, పండుగల సందర్భములో వస్త్రదానము, మిఠాయి దానము చేసినా అది అసమర్థనీయమైన పనియే అగును. ఇవన్నీ ధనికులుగానీ, ప్రభుత్వములు గానీ చేయవలసిన పనిగానీ స్వామీజీలు చేయవలసిన పనికాదు. మానవునిలో పాపభీతిని కల్గించి, పాపములను చేయకుండా చేసి తత్త్వ జ్ఞానమును తెలియునట్లు చేయడము. స్వామిజీలు, బాబాలు చేయవలసిన పని. చాకలి పని చాకలి, మంగలి పని మంగలి చేస్తే బాగుండును. అలాకాక చాకలి పని మంగలి, మంగలి పని చాకలి చేస్తే అది వృత్తికాదనీ ఎలాగ

అందుమో, అలాగే స్వామిజీలు దానములు ఇవ్వడము, ధనికులు జ్ఞానము బోధించడము గాడితప్పిన పనియగును.

విద్యగానీ, వైద్యముగానీ, కూడుగానీ, గుడ్డగానీ మానవునికి బాహ్య ప్రపంచములో అవసరమైనవన్నీ కర్మను బట్టి ముందే నిర్ణయించబడి యుండును. కేవలము ఒక్క దైవజ్ఞానము మాత్రము కర్మకు అతీతమై యుండును. కర్మకు అతీతమైన జ్ఞానమును అందివ్వడము బోధకుల (స్వామిజీల) పనిగా ఉండవలెను. విద్య, వైద్య, కూడు, గుడ్డ అన్నీ కర్మాధీనమై ఎవరికి ఎంత లభించవలెనో అంతే లభించునట్లు ముందే అమరికయుండును. ఏ సమయమునకు ఏది లభించవలెనో అది ఎవరి ద్వారానైనా లభించును. కానీ జ్ఞానము ఒక్క జ్ఞానుల ద్వారానే లభించును. అందువలన జ్ఞానులు ప్రపంచ సహాయములను చేయక పరమాత్మ జ్ఞానమును అందివ్వవలసియున్నది. ఒక సందర్భములో కొందరు మమ్ములను ఈ విషయమై ప్రశ్నిస్తూ మీరు సమాజసేవ ఏమి చేస్తున్నారని అడిగారు. అపుడు మేము **"జ్ఞానసేవ తప్ప మనుషుల సేవ ఏమి చేయము".** మనుషులకు సేవ చేయుటకు ప్రభుత్వములున్నవి, ధనికులున్నారు. ప్రభుత్వములు మేమున్నది మీకొరకే అంటున్నపుడు, ఎన్నో రంగములు ఏర్పరచి వాటి ద్వారా మనుషులను పరిపాలిస్తున్నపుడు ఏదైనా తక్కువైతే ప్రభుత్వములను అడుగవలెను. అట్లే మీరు స్వచ్ఛమైన జ్ఞానమును అందివ్వమని మమ్ములనడుగవలెను అని చెప్పాము. నేడు చాలామంది స్వామిజీలు ప్రపంచకీర్తిని సంపాదించుకొనుటకు, తాము సంపాదించుకొన్న ధనమును ఇతరుల అవసరములకు ఖర్చు చేయుచూ ఖ్యాతిని పొందుచున్నారు. మొదట ఏదో ఒక విధముగా తమ పలుకుబడితోనో, మహత్యముతోనో ధనికులవద్ద నుండి ధనమును సంపాదించి ఆ ధనమును

ఉపయోగించి వైద్యశాలలు, విద్యాలయములు నిత్యాన్నదానములు వగైరా వగైరా నెలకొల్పుచూ ఉచిత విద్య, ఉచిత వైద్యము, ఉచిత భోజనము అని ప్రచారము చేసుకొని కీర్తిని గడిస్తున్నారు.

ఈ విధముగా చాలామంది స్వామిజీలు ప్రపంచ సహాయములను అందరికీ తెలియునట్లు చేయడమేకాక, తాము స్వాములైనందుకు మేము జ్ఞానమును కూడా తెల్పుచున్నామని పెద్ద పెద్ద సభలను నిర్వహించి అక్కడ జ్ఞానబోధ అను పేరుపెట్టి బోధలు చెప్పుచుందురు. అక్కడి ప్రవచనములలో గతములో కీర్తి గడించిన వారిని గూర్చి చెప్పుకోవడము జరుగుచుండును. గతములోని వారి గొప్పతనమును గూర్చి చెప్పుకోవడమే కాక, వారి పేరు మీద పాటలను సృష్టించుకొని ఆ పాటలలో వారి గొప్పతనమును కీర్తించు చుందురు. ఇలా చాలామంది స్వాములు తమకు తెలిసిన తత్త్వబోధ (ఆత్మబోధ) చెప్పక తమకంటే ముందు పుట్టి చచ్చిపోయిన స్వాముల గురించి, వారి మహత్యముల గురించి, వారి జీవిత చరిత్రలు గురించి, వారు చెప్పిన జ్ఞానము గురించి కొంత మాటల రూపములో, కొంత పాటల రూపములో చెప్పుచుందురు. చివరివరకు వారి బోధలు విన్నప్పటికీ అందులో కీర్తన తప్ప ఆత్మజ్ఞానము ఏమాత్రముండదు. మరికొందరు స్వాములైతే ఏకంగా పాటకచ్చేరిలాగా అన్ని వాయిద్యములతో పాటలే పాడుచుందురు. వినే వారు తలలూపుతుంటే, ఆనందముగా వింటూవుంటే, చెప్పేవారు అదే జ్ఞానమన్నట్లు చెప్పుచుందురు. నీ నామమువింటే కర్మలు పోతాయి, నీ దర్శనము దొరికితే జన్మలు పోతాయి అని ఒక స్వామిజీ పాడితే, మరొకరు ఓ గాయీనాథా నిను మించిన దైవము లేదు, నీ స్పర్శతో మా రోగాలు పోతాయి, నీ చూపుతో మాకు లాభాలు వస్తాయి అని పాడుచుందురు. ఒకరు పురాణాల కథలను చెప్పితే, మరొకరు పుణ్యక్షేత్రాల కథలను

చెప్పుచున్నారు. ఒకరు భారత రామాయణ గాథలను నెమరువేస్తూ చెప్పుచుంటే, మరొకరు దేవతల మహాత్మ్యాలను గురించి చెప్పుచుందురు. ఇష్టదేవతలను గురించి కొందరు చెప్పితే, ఇష్టాలను తీర్చి కష్టాలను లేకుండా చేయు దేవతలను గూర్చి కొందరు చెప్పుచుందురు. ఈ విధముగా అనేక విధముల బోధలను నేటి స్వామిజీలు కొనసాగిస్తున్నారు. వాటినన్నిటినీ పరిశీలిస్తే ఆత్మను గురించిన జ్ఞానముగానీ, జీవాత్మను గురించిన జ్ఞానము గానీ, పరమాత్మను గురించిన జ్ఞానముగానీ ఏమాత్రముండదు. అటువంటపుడు స్వామిజీలు చెప్పు జ్ఞానము దైవజ్ఞానము కాదా? అంటే ఏమాత్రము కాదనియే చెప్పాలి. వారు చెప్పునదంతా ప్రకృతి జ్ఞానమనియే చెప్పాలి. ఇతరుల కీర్తిని గురించి చెప్పునది కావున వారు చెప్పునది ఇతరుల కీర్తియనీ, వారు పాడు పాటలన్ని కీర్తనలనీ తెలియుచున్నది. ఎక్కడైనా ఆత్మజ్ఞానమునకు సంబంధించిన భగవద్గీత ఏ స్వామిజీ అయినా చెప్పుచున్నాడంటే ఆ ఉపన్యాసములో కృష్ణుడు చెప్పిన జ్ఞానమే ఉన్నప్పటికీ ఆ స్వామిజీ మాటలలో జీవాత్మ ఉంటుంది, పరమాత్మ ఉంటుంది. కానీ మధ్యలోని ఆత్మమాత్రముండదు. ఆత్మయొక్క ప్రస్తావనే లేనపుడు అక్కడ చెప్పబడునది పరమాత్మ జ్ఞానముకావచ్చు, జీవాత్మ జ్ఞానముకావచ్చు కానీ ఆత్మజ్ఞానము మాత్రముకాదని స్పష్టముగా చెప్పవచ్చును. ఈ విధముగా భగవద్గీతోపన్యాసములలో కూడా ఆత్మను లేకుండా చేయుచున్నారు. భవిష్యత్తులో ఆత్మను మరచిపోతారేమోనని పూర్వము పెద్దలు ఊహించిన వారై అలా మరువకుండుటకు ఆత్మకు సంబంధించిన ఎన్నో వాక్యములను మన మధ్యలో ఉంచారు. అలా ఉంచిన వాక్యములు **ఆత్మహత్య అని, ఆత్మబోధ యని, ఆత్మబలమని, ఆత్మచైతన్యమని, ఆత్మగమనమని, ఆత్మసాక్షి, ఆత్మబంధువు, ఆత్మాభిమానము, ఆత్మశక్తి, ఆత్మవిశ్వాసము, ఆత్మవిమర్శ,**

**ఆత్మజ్ఞానమని, ఆత్మతేజమని** చెప్పడమేకాక భగవద్గీతలోని శ్లోకములలో **'ఆత్మ'** అను పదమునే ఉపయోగించారు. అయినప్పటికీ నేటి మానవుడు స్వామిజీగా మారినప్పటికీ ఆత్మను గురించి తెలుసుకోక అన్యులను కీర్తించడము, అన్యదేవతలను ఆరాధించడము చేయుచూ తాను స్వయముగా కీర్తిని సంపాదించుకొనుటకు ప్రపంచసంబంధ సహాయక కార్యములు చేయుచున్నాడు. అందువలన ప్రతి మనిషి మాన్యుడు కానీ, సామాణ్యుడు కానీ నేను ఇంకొరిని కీర్తించుచున్నానా? నేను కీర్తిని సంపాదించు కొనుచున్నానా? అని ప్రశ్నించుకొని యోచించి అలాకాకుండా నేను ఆత్మ జ్ఞానమును తెలుసుకొనుచున్నానా? ఇతరులకు ఆత్మజ్ఞామును తెలుపు చున్నానా? అని చూచుకోవలసియున్నది. అందువలన మనిషి తన జీవితములో పుణ్యమును సంపాదించు కీర్తిని వదలి మోక్షమును తెచ్చిపెట్టు ఆత్మజ్ఞానమును (తత్త్వజ్ఞానమును) తెలుసుకొనుటకు అవకాశమేర్పడును.

*****

# శరీరము అద్దె ఇల్లు

ఒక మనిషిని విభజించి చూచితే శరీరము మరియు జీవుడు అని చెప్పవచ్చును. జీవుడులేని శరీరమును **"శవము"** అంటాము. అలాగే శరీరములేని జీవున్ని **"దయ్యము"** అంటాము. ఒక దయ్యము, ఒక శవము రెండూ కలిసియున్నపుడు **"మనిషి"** అంటున్నాము. వివరముగా చెప్పుకొంటే ఒక జీవుడు ఒక శరీరములో నివసిస్తూ జీవితకాలమును గడుపుచున్నాడు. జీవునికి శరీరము గృహములాంటిది. శరీరమనే గృహములో జీవుడు కొంతకాలము నివశిస్తున్నాడు. జీవుడు శరీరములో నివశించిన మొత్తము

కాలమును జీవితకాలము అంటున్నాము. జీవితకాలమును పూర్వము **"జీతకాలము"** అనెడివారు. జీత అను రెండక్షరముల మధ్యలో "వి" అను అక్షరము కాలక్రమములో చేరి పోయినది. అందువలన 'జీత కాలము' అనునది 'జీవిత కాలము' అను పదముగా మారిపోయినది. మారిన పదమును వదలి చూస్తే శరీరములో జీవుడున్న కాలమును జీతకాలము అనడములో కొంత అర్థము ఇమిడియున్నది. ఒక పనికి ప్రతి ఫలితముగా ఇచ్చుదానిని జీతము అంటాము లేక బాడుగ (కిరాయి) అని కూడా అంటాము. జీవుడు తన స్వంతము కాని ఇతరుని ఇంటిలో నివశిస్తున్నాడు, కావున ఆ ఇంటి యజమానికి కిరాయి ఇవ్వవలసి వస్తున్నది. శరీరము జీవునికి స్వంత ఇల్లుకాదు అను విషయమును ప్రతి మనిషి జ్ఞప్తికి పెట్టుకోవలెను. శరీరము జీవునిది కాకపోతే మరి ఎవరిదను ప్రశ్న కూడా వెంటనే రాగలదు. దానికి జవాబేమనగా!.

కొన్ని నగరములలో కొందరు యజమానులు తమ స్వంత ఇంటిని పూర్తి తామేవాడుకోక, ఇంటిలో కొంతభాగమునో లేక ఒక గదినో ఇతరులకు అద్దెకు ఇచ్చుచున్నారు. ఉదాహరణకు ఒక ఇంటి యజమాని తన ఇంటిలోని ఒక గదిని మరియొకనికి ఇచ్చాడనుకొనుము. అప్పుడు బాడుగకున్నవానికి నీటితో సహా అన్ని సౌకర్యములు కలుగజేసి దానికి ప్రతి ఫలముగా కిరాయి (బాడుగ) వానినుండి తీసుకొనును. ఇది అందరికి తెలిసిన విషయమే. ఇక తెలియని ముఖ్యమైన విషయమేమనగా! విశాలమైన ఇంటిలో ఆ ఇంటి యజమానికి కిరాయి చెల్లిస్తూ, ఒక గదిలో కాపురమున్న కిరాయి దారునివలె జీవుడు శరీరమను ఇంటిలో నివశిస్తున్నాడు. శరీరమను ఇంటియంతటికి ఆత్మ అను యజమాని (అధిపతి) కాగా, శరీరమను ఇంటి యందు కొద్ది భాగములో జీవాత్మ నివశిస్తున్నాడు. జీవుడు తన ఇంటిలో

నివశించుటకు కావలసిన సౌకర్యములన్నీ ఆత్మయను యజమాని కలుగ జేయుచున్నాడు. దానికి ప్రతి ఫలితముగా జీవుడనబడు కిరాయిదారుడు ఆత్మయను శరీరగృహ యజమానికి ఆహారమనబడు అద్దె (బాడుగ) చెల్లించవలసియున్నది. జీవుడు చెల్లించిన ఆహారమను కిరాయిని ఆత్మ తన మనుగడకొరకు ఉపయోగించుకొనును. బయటి గృహ యజమానులు నెలకొకమారు డబ్బురూపములో కిరాయిని (బాడుగ) ఇప్పించుకొందురు. లోపల శరీరగృహ యజమాని పూటకొకమారు ఆహారరూపములో కిరాయి ఇప్పించుకొనుచున్నాడు. బయటి గృహ యజమాని నెలకొకమారు అడిగి తన కిరాయిని ఇప్పించుకుంటే, లోపలి యజమాని పూటకొకమారు ఆకలిని కలుగజేసి తన బాడుగను ఇప్పించుకొనును. ఆత్మయను యజమానికి ఆహారమను కిరాయి కట్టుటకు మనిషి ఎన్నో పనులు చేయవలసి వస్తున్నది, ఆ పనులు చేయుటకు ఎన్నో విద్యలు నేర్వవలసి వస్తున్నది. అందువలన **'కూటికొరకు కోటి విద్యలని'** పెద్దలన్నారు. కోటి విద్యలు కాకపోయినా కొన్ని విద్యలైన నేర్వవలసి వస్తున్నది. నేటి కాలములో మానవుని సగటు ఆయుష్షు 60 సంవత్సరములైతే కూటి కొరకు నేర్వవలసిన చదువులు దాదాపు 30 సంవత్సరములు పట్టుచున్నవి.

ఇప్పటి కాలములోని మనిషి వేము విజ్ఞానము కొరకు చదువుచున్నామనినా, చివరకు ఆ విజ్ఞానము కూడా మనిషి బ్రతికేదానికే, ఆహార సముపార్జనకేనని మరువకూడదు. ఎన్ని విద్యలు నేర్చినా, ఏ డిగ్రీలు (పట్టాలు) సాధించినా, ఆ విద్యలన్నీ బయటి చూపును కల్గించునవి గానే ఉన్నవి. నేనొకరి ఆధీనములో అద్దెకున్నానని కానీ, నాకొక యజమాని ఉన్నాడని గానీ, అతని ఇష్టాయిష్టము మీదనే నేను బ్రతుకుచున్నానని గానీ, బ్రతుకుట అంటే శరీరములో నివశించడమేనని గానీ ఏ విజ్ఞానమూ,

ఏ విద్యా మనిషికి తెలుపలేక పోయినది. శరీర యజమాని అయిన ఆత్మ యొక్క వివరమును తెలుపునదే బ్రహ్మవిద్య. బ్రహ్మ అనగా పెద్ద అని అర్థము. నీకు ఒక పెద్ద ఉన్నాడని, ఆ పెద్దయే నీ శరీరములోని ఆత్మయని తెలుపు విద్యయే బ్రహ్మవిద్య. ప్రపంచ జ్ఞానమును తెలుపు విద్యలు ఎన్నో విభాగములుగ డాక్టర్లనీ, ఇంజనీర్లనీ, లాయర్లనీ వగైరా వగైరా ఎన్నో కలవు. బయట ఏ సైన్సును చదివినా అది భౌతిక శరీరమునకు ఉపయోగపడునదే కాని, భౌతికశరీరమునకు అధిపతియైన ఆత్మను తెలుపునది కాదు.

ఇప్పుడొక కథను చెప్పుకొందాము! భూపతి అను పేరుగల వ్యక్తి ఒక పెద్ద ఇంటిలోని, ఒక గదిలో మాత్రము కిరాయికున్నాడు, ఆ ఇంటి యజమాని పేరు పతి. పతి ఇల్లు పెద్దదికావడం వల్ల పతి తన ఇంటిలో ముందర గదిని భూపతికి బాడుగకు ఇచ్చి తాను మాత్రము వెనుకనున్న మిగతా గదులలో ఉండెడివాడు. పతికి పనిమనుషులు రెండుడజన్ల మంది ఉండెడివారు. పతి అంతమందితో పని చేయించుకొనుచున్నప్పటికీ, అంత మందికి యజమానియైనప్పటికీ, తాను ఏమాత్రము గర్వపడెడివాడు కాదు, తాను గొప్పయని చెప్పుకొనెడివాడు కాదు. తన ఇంటిపనినంతటినీ తన మనుషులకు అప్పచెప్పి తాను అందరినీ గమనిస్తూయుండెడివాడు. బయట వ్యవహారమంతయు తన మనుషులే చూచుకొనెడివారు. ఇంటిముందు భాగములోనే ఉన్న భూపతి ఆ ఇంటికి వచ్చిపోయే వాళ్ళందరిని చూస్తూ ఉండెడివాడు. తాను ముందు గదిలోనే ఉన్నాడు కావున బయటినుండి వచ్చు అందరిని చూచెడివాడు, అన్ని విషయములను తెలుసుకొనెడివాడు. పతి యొక్క పని మనుషులు 24 మంది భూపతికి బాగా పరిచయముండుట వలన అన్ని విషయములు భూపతికి సులభముగా తెలిసెడివి. పతి

మనుషులందరు భూపతికి అనుకూలముగా ఉండుట వలన భూపతి వారందరినీ తన మనుషులుగా లెక్కించి తానే వారికి యజమానినను భావము కల్గియుండెడి వాడు. వివరముగా చెప్పుకొంటే 24 మందిని పనిలో పెట్టుకొన్నది పతియే అయినప్పటికీ 24 మందిలో కొంతమంది పతికి వ్యతిరేఖముగా ఉంటూ భూపతికి అనుకూలముగా ఉండిరి. తుస్సు తస్సు అను ఇద్దరు పని మనుషులు పతికి విరుద్ధముగా కనిపిస్తూయుండిరి. తుస్సు అనువాడు ప్రతి విషయమును భూపతికి చెప్పుచూ భూపతి మనిషిలాగ ప్రవర్తించుచుండెను. ఇక తస్సు అనువాడు పతికి పూర్తి వ్యతిరేఖమై తనకు యజమాని భూపతియేనని, భూపతే ఇక్కడి పనులకంత మరియు ఇక్కడి ఇంటికంత పెద్దఅని చెప్పెడివాడు. తుస్సు తస్సుల వలన తాను పరాయి వాని ఇంటిలో ఉన్నానను విచక్షణ కూడా లేనివాడై భూపతి తస్సు మాటలతో తాను ఉబ్బిపోయెడివాడు. ఇంటిలోని పనిమనుషులు అనేక రకాల పనులు చేసెడివారు. కొందరు చిన్న చిన్న పనులకు మాత్రమే పరిమితమైతే కొందరు ముఖ్యమైన పనులు చూచుకొనెడివారు. ఇంటిలో అతి ముఖ్యమైన పనులు చూచుకొనువారు నలుగురు మాత్రమే. ఆ నలుగురిలో ఇద్దరు తుస్సు, తస్సుకాగ మరి ఇద్దరు సద్ధి, గిద్ధి. ముఖ్యమైన ఆ నలుగురిలో తుస్సు, తస్సు ఇద్దరూ ఒక గుంపుగా సద్ధి, గిద్ధి ఇద్దరూ ఒక గుంపుగా ఉన్నారు. ముఖ్యమైన ఈ నలుగురు భూపతికి అనుకూలురు, పతికి వ్యతిరేఖులని చెప్పినప్పటికీ, నూటికి నూరుపాళ్లు తుస్సు తస్సు పతికి వ్యతిరేఖులుగ ఉన్నారు. ఇక మిగతా ఇద్దరైన సద్ధి, గిద్ధి కనిపించి కనిపించకుండ ఉంటారు. భూపతితో నా సలహా లేనిది ఏమీ జరుగదని సద్ధీ, సద్ధి చెప్పినా నేను ఒప్పుకోనిదే ఏమీ జరుగదని గిద్ధీ అనుచు తాము భూపతికోసము ఇంటిలో పని చేయుచున్నాము కానీ పతి కోసము కాదంటుంటారు.

భూపతి, పతి యొక్క ఇంటిలో కిరాయికుండి నెలనెలా కిరాయి కట్టుచున్నప్పటికీ నేను ఎవరికి కిరాయి కట్టలేదు. ఈ ఇల్లు నాదే అంటున్నాడు. అంతేకాదు ఇంటిలోని పని మనుషులంతా నావారే అంటున్నాడు. వీడు నా తుస్సు, వీడు నా గిద్ధి అని చెప్పుకొంటున్నాడు. ఈ విషయమంతా పతికి తెలుసు అయినప్పటికీ పతి భూపతిని ఏమీ అనలేదు. తన ఇంటిలో బాడుగకున్న ఒక బచ్చాగాడు తానే యజమానినని చెప్పుకొనినా పతి మౌనముగా ఉండడమునకు కారణము కొంత కలదు. అది ఏమనగా! ఇల్లు తనదే అయినా అది ఇంకొకరి దగ్గర కుదువకున్నది. ఇల్లు తన పేరుమీద ఉన్నట్లు గల దస్తావేజులన్నీ ఆ కుదువ పెట్టుకొన్నవాని దగ్గర కలవు. భూపతి ఏమనినా! వాని మాటలు చెల్లవు. వ్రాతమూలముగా ఉన్నది పతి పేరుతోనే. పతిదే ఇల్లు అనుటకు సాక్ష్యముగా పరపతి అను మూడవ వ్యక్తి దగ్గర ఇల్లు కుదువకున్నది. ఇల్లు పతిదే అయినా కుదువ యుండుటవలన, ఇంటి రికార్డంతయు పరపతి వద్దయుండుట వలన, ప్రస్తుతానికి యజమానికి పరపతియేనని, ఇల్లంతయు అతని ఆధీనములోని దేనని చెప్పవచ్చును. అందువలన భూపతి ఇల్లు నాదేనని అనుకొనినా పతికి ఏమీ బాధలేదు. పరపతి వద్ద బాకీ తీరేంతవరకు, కుదువ రద్దయేంత వరకు, పతికి భూపతికి ఇద్దరికీ యజమాని పరపతియేనని చెప్పవచ్చును. పతి బాకీ పరపతివద్ద తీరాలంటే భూపతి తానుకట్టు కిరాయిని నేరుగా పరపతికే కట్టవలసియుండును. పరపతి పేరు మీద కట్టితే దానిని తన బాకీలోనికి జమవేసుకొంటూపోయి చివరకు తీరిపోయిన రోజు తన బాకీని రద్దు చేసుకొని బాకీనుండి పతిని విడుదల పొందునట్లు చేయును. భూపతి బాకీ కట్టడమేమిటి? పతి బాకీనుండి విడుదల పొందడమేమిటి? అని ప్రశ్నించుకొంటే దానికి సమాధానము ఈ విధముగ కలదు. వాస్తవముగా

భూపతియే పరపతికి బాకీదారుడు. కానీ భూపతి చేత నేను నీ బాకీ కట్టిస్తానని మధ్యలో పతి అనువాడు పూచీపడినాడు. అందువలన భూపతి అనువాడు ఎంతపనికిమాలినవాడైనా ఓర్చుకొని తన ఇంటిలో ముందు గదిలోనే పెట్టుకొన్నాడు.

భూపతి అనువాడు పరపతి దగ్గర అప్పుచేసి, పతిని పూచిపెట్టి ఇల్లు కుదువ పెట్టించి, తాను అన్నీ మరచిపోయి, నేను ఎవరికీ బాకీలేనను భావముతో ఉండడమే కాక, తానున్న ఇల్లే నాదనుచున్నాడు. భూపతి ఏమనుకొనినా పతి, భూపతి ఇద్దరూ నావద్ద ఇరుక్కొన్నారులే అని పరపతి అనుకొనుచున్నాడు. భూపతిని బాకీతీర్చువరకు వదలి పెట్టనులేనని పతి అనుకొనుచున్నాడు. భూపతి తాను కట్టేది పరపతికి అనుకొంటే అది పరపతి బాకీలోనికి జమ అవుతుంది. అట్లుకాకుండా తానుకట్టేది పతికి అనుకుంటే పతి బాకీలోనికి జమ అవుతుంది. పతికి కట్టినా చివరకు దానిని పరపతికే చెందునట్లు పతి చేయును. ఏదో ఒక విధముగా ఇంటికి కిరాయి రూపములోనైనా కట్టిన దానిని బాకీ క్రింద జమవేసుకొనునట్లు ఏర్పాటు ఉన్నప్పటికీ భూపతి తాను ఎవరికీ కిరాయి కట్టడములేదనీ, ఇల్లు తనదేనని, ఆహారరూపములో కట్టునది తన పోషణ నిమిత్తమేనని, మరి ఎవరికొరకు కాదనీ, పతి, పరపతి అనువారెవరో తనకు తెలియదని అనుకోవడము వలన భూపతి బాకీ ఏమాత్రము తీరకుండా పోయినది.

భూపతి పరమ మూర్ఖుడని గ్రహించిన పరపతి బాకీ విషయములో కొంత రాయితీ కూడా ప్రకటించాడు. ఆ రాయితీ ఏమనగా! భూపతి కట్టునది ఏదైనా పతి పేరు మీద కట్టితే ఎంత కట్టివుంటే అంత బాకీ తీరును. అలాకాకుండా నేరుగా పరపతి పేరు మీద కట్టితే ఎంత కట్టివుంటే

అంతకు వేయింతలు ఎక్కువ కట్టినట్లు లెక్కించబడును. అలా ఎందుకనగా! పరపతి తన భార్య ద్వార భూపతికి బాకీ ఇచ్చాడు. పతి కూడా భూపతి బాకీ విషయములో పరపతి భార్యవద్దనే పూచీ పడినాడు. అందువలన భార్య అయిన సకృతీదేవి ఎంత జమ ఇస్తే అంతే జమవేసుకొంటున్నది. తన భార్య సకృతీదేవి ఖచ్చితమైన లెక్కాచారము కలది కావున ఈ బాకీ అంత సులభముగా తీరునది కాదని పరపతియే భూపతి ఎడల మంచి చేయదలచి సకృతీదేవికి కూడా అధిపతియైన పరపతి తన ఇష్టమొచ్చినట్లు రాయితీ ప్రకటించాడు. నేరుగా తనకు కట్టే బాకీ విషయములో ఎంత ఇస్తే అంత జమ అను నియమములు ఉండవన్నాడు. నాకు నచ్చితే నీ బాకీనంతటినీ ఒకేరోజు జమ వేసుకుంటానన్నాడు. ఈ పద్ధతి ప్రకారమైతే భూపతి బాకీ తొందరగా తీరిపోవును బాకీనుండి బయటపడును. అయినా ఇంత రాయితీని పరపతి ప్రకటించినప్పటికీ పతి ఎవరు? పరపతి ఎవరు? నేను భూపతిని, నేను ఎవరి ఆధీనములోలేను, నేను స్వతంత్రున్ని, నా ఇష్టమొచ్చినట్లు చేసుకోగలను అని అనుకొనుచున్నాడు. అందువలన భూపతి యొక్క బాకీలో సాధారణ జమకాని, రాయితీ జమకాని పడడము లేదు. ఏమాత్రము లెక్కా, జమాలేని భూపతి స్థిరస్థాయిగా భూమి మీద బాడుగ ఇంట్లోనే నివశిస్తూనే ఉన్నాడు. బాకీ ఉండి బాకీ మరచిపోవడము అన్యాయము కాదా? తన కొరకు పూచీపడిన వానిని ఏమాత్రము లెక్క చేయకుండా ఎవడోవాడనడము మరీ అన్యాయము కాదా? సాధారణముగా అయితే బాకీ తొందరగా తీరదని రూపాయికి వేయిరూపాయల జమ అని ప్రకటించిన వానిని మరచి ప్రవర్తించడము మరీ పెద్ద అన్యాయము కాదా! వడ్డీలేకుండా జమ చేసుకుంటానని చెప్పిన పతి పట్లగానీ, వేయింతలు జమ చేసుకుంటానని చెప్పిన పరపతి పట్లగానీ, ఏమాత్రము వినయ

విధేయతను కనపరచని భూపతిని ఏమనాలో మీరే చెప్పండి. నీచుడు, నికృష్టుడు, దుష్టుడు, దుర్మార్గుడు అని ఏమనినా తక్కువే అని అనిపిస్తుంది కదా!

ఈ కథలోని భూపతిని ఎవరూ ఒప్పుకోరనుకుంటాను. ఎంతో ఓర్పుకల్గిన పతినిగానీ బాకీ తీరుటకు రాయితీ పేరుతో ఎంతో అవకాశము కల్పించిన పరపతినిగానీ ప్రశంసింపక తప్పదు. ఇపుడు ఇంత కథ మనము చెప్పుకోవలసిన అవసరమేమొచ్చినదని కొందరనుకోవచ్చును. దానికి జవాబేమనగా! ఈ కథను తప్పనిసరిగా అందరూ తెలుసుకోవలసిన అవసరమున్నది. ఎందుకనగా! ఇది కల్పితగాథ కాదు యదార్థగాథ. ఇందులోని భూపతి పాత్రధారుడు ఎవరో కాదు. ప్రత్యక్షముగ నీవే. బాడుగ ఇల్లు నీవున్న శరీరమే. పతి నీ శరీరమునకు అధిపతియైన ఆత్మయే. పరపతి ఎవరోకాదు ఆత్మకంటే పరముగావున్న పరమాత్మే. పతికి పనిమనుషులుగనున్న 24 మంది 24 శరీర భాగములేనని జ్ఞప్తి చేసుకోవలెను. పతికి వ్యతిరేఖముగా భూపతికి అనుకూలముగనున్న ముఖ్యమైన నలుగురులో తుస్సు మనస్సుకాగ, తస్సు అహమని తెలియవలెను. అంతేకాక సద్ధి అనగా మనకున్న బుద్ధియేననీ, గిద్ధి అనగా మనలోని చిత్తమని అర్థము చేసుకోవలెను. భూపతి కట్టు కిరాయి మనము లోపలికి అందించు ఆహారమని తెలియవలెను. భూపతి యొక్క బాకీ అనునది జీవాత్మ యొక్క కర్మయని, కర్మను లేకుండా చేసుకోవడమే పరమాత్మ బాకీ తీర్చినట్లని అర్థము చేసుకోవలెను. పతి, పరపతి యొక్క విషయమును భూపతి అనువాడు తెలియకుండా పోవడము ఆత్మ, పరమాత్మల యొక్క జ్ఞానమును జీవాత్మ గ్రహించకుండ పోయినట్లని తెలియవలెను. పతి భూపతికి పూచీగా ఉండడము అంటే ఆత్మ జీవాత్మ యెడల తోడుగా ఉన్నదనీ,

జీవుని పనులను స్వయముగా తానే చేయుచున్నదని అర్థము చేసుకోవలెను. పతికి జమకట్టడమంటే ఆత్మను బ్రహ్మ,కర్మయోగముల ద్వార ఆరాధించడ మని పరపతికి జమకట్టడమంటే పరమాత్మను భక్తియోగము ద్వారా ఆరాధించడమనీ తెలియవలెను. భక్తియోగము ద్వారా కర్మ తొందరగా లేకుండాపోయి కర్మనుండి విముక్తి పొందవచ్చును, కావున పరపతికి జమచేస్తే వేయింతలు రాయితీకలదని చెప్పాము. సకృతీదేవి అనగా ప్రకృతీశక్తి అని తెలియవలెను. నియమములు అనగా ధర్మములనీ, ధర్మములను అతిక్రమించి మోక్షమిచ్చు స్థోమత ఒక్క పరమాత్మకే కలదనీ, అందువలన పరపతి తన ఇష్టమొచ్చిన రాయితీ ప్రకటించాడని చెప్పాము. పరమాత్మ ప్రకృతి ద్వారానే జగత్తును నడుపుచున్నాడు కావున పరపతి తన భార్య ద్వార బాకీ ఇప్పించాడు అని చెప్పాము. ఇంత పెద్దకథ మన శరీరములోనే జరుగుచున్నదని, ఈ కథలోని యదార్థమును తెలిసినవాడు తన కర్మ బాకీని తొందరగా తీర్చుకొని మోక్షము పొందగలడని తెల్పు చున్నాము.

| | కల్పితము | | యదార్థము |
|---|---|---|---|
| 1. | భూపతి | ః | జీవాత్మ |
| 2. | పతి | ః | ఆత్మ |
| 3. | పరపతి | ః | పరమాత్మ |
| 4. | ఇల్లు | ః | శరీరము |
| 5. | బాడుగ (కిరాయి) | ః | ఆహారము |

| | | | |
|---|---|---|---|
| 6. | పని మనుషులు | ః | శరీర భాగములు |
| 7. | తుస్సు | ః | మనస్సు |
| 8. | తస్సు | ః | అహము |
| 9. | సద్ధి | ః | బుద్ధి |
| 10. | గిద్ధి | ః | చిత్తము |
| 11. | బాకీ | ః | కర్మ |
| 12. | పూచీగ ఉండడము | ః | తోడుగ ఉండడము |
| 13. | పతిని మరువడము | ః | ఆత్మజ్ఞానము తెలియకుండడము |
| 14. | పతికి జమకట్టడము | ః | బ్రహ్మ, కర్మయోగములనాచరించడము |
| 15. | బాకీ పూర్తిగారద్దవడము | ః | మోక్షము పొందడము |
| 16. | సకృతీదేవి | ః | ప్రకృతిశక్తి |
| 17. | నియమములు | ః | ధర్మములు |
| 18. | బాకీరాయితీ | ః | కర్మను రద్దుచేయడము |

*****

# ఆఖరీ మరణము

ఒక మనిషి బ్రతుకుచున్నాడు అంటే ఆ మనిషి శరీరము పెద్ద యంత్రాంగములాగ పనిచేయుచున్నదని అర్థము. శరీరమను యంత్రములో కనుపించునవి కొన్ని, కనిపించనివి కొన్ని యంత్ర భాగములు గలవు. కనుపించునవి పది (10) భాగములు కాగా, కనిపించక ఉండునవి పదునాలుగు (14) భాగములు గలవు. శరీరయంత్రము బయటి ఇనుప ముక్కల యంత్రములాంటిది కాదు. ఇనుప ముక్కల యంత్రములో అన్ని భాగములున్నా, అందులో ఇందనమైన నూనె ఉన్నా, దానిని ఆడించుటకు ఒక మనిషి కావాలి. వానినే జంత్రగాడు అని తెలుగులో, డ్రైవర్ అని ఇంగ్లీషులో అంటాము. కనిపించు కొన్ని భాగములతో కూడుకొన్న మాంసపు ముక్కల శరీరయంత్రములో ఇందనముగా రక్తమున్నా, శరీరయంత్రమును ఆడించుటకు ఒకడు కావాలి. బయటి యంత్రమును ఆడించువాడు మనిషి అయితే మనిషి యొక్క శరీరయంత్రమును ఆడించువాడు మిస్టర్ × (యక్స్) అనుకొందాము. **బయటి యంత్రమును ఆడించు మనిషిని జంత్రగాడు అంటున్నాము. ఇక్కడ శరీర యంత్రమును ఆడించువానిని మంత్రగాడు అంటున్నాము.** ఇనుప వస్తువులచే నిర్మితమైన యంత్రము యొక్క డ్రైవర్‌ను జంత్రగాడు అని అంటే, మాంసపు అవయవములచే నిర్మితమైన శరీర యంత్రము యొక్క డ్రైవర్‌ను మంత్రగాడు అని అనాలి. పూర్వము ఈ విధముగా జంత్రగాడు, మంత్రగాడు అను పేర్లు పుట్టినవి. ఇంకా వివరముగా చెప్పుకొంటే బయట కనిపించే యంత్ర భాగములను నడుపు కనిపించే వానిని జంత్రగాడు అనీ, లోపల కనిపించని శరీర యంత్ర భాగములను నడుపు కనిపించని వానిని మంత్రగాడు అని అనుచున్నాము.

కనిపించకుండా పని చేయుదానిని మంత్రము అంటాము, దానిని పని చేయుంచువానిని మాంత్రికుడు అంటాము. శరీర యంత్రములో కనిపించని భాగములు పదునాలుగున్నాయి అన్నాము. అందులో ఒక్కొక్కటి ఒక్కొక్క పని తనము కల్గియున్నది. వాటిలో ఇపుడు మనము చెప్పుకొనుటకు సందర్భానుసారము అవసరమొచ్చినది, **మనస్సు అను భాగము. మననము చేయునది, లేక మననము కల్గినది కావున దానిని మనస్సు అంటున్నాము.** శరీరములో అన్ని జ్ఞాపకాలకు ముఖ్యకారణమైనది మనస్సు. మనిషి యొక్క జీవితములో చిట్టచివరిగా నశించి పోవునది కూడా మనస్సు అని చెప్ప వచ్చును. శరీరము లోపల కనిపించని భాగములు అన్నీ పని చేయలేని స్థితికి వచ్చి, నశించి పోయిన తర్వాత అన్నిటికంటే చివరిలో నాశనము చెందునది మనస్సు. మనస్సు నాశనమైన తర్వాత జీవుడు కూడా శరీరమును వదలి పోవును. దానినే మరణము అంటాము. ఇక్కడ గమనించవలసిన విషయమేమంటే మరణములో నాశనము చెందునవి లోపల కనిపించని యంత్రభాగములైన పదునాలుగు (14) భాగములని తెలియవలెను. జీవుడు మాత్రము నాశనము చెందలేదని జ్ఞప్తికుంచుకోవలెను. మరణములో బయటి పది (10) భాగములతో, లోపల పదునాలుగు (14) భాగములతో జీవునికి సంబంధము తెగిపోవుచున్నది. మనిషి బ్రతికియున్నపుడు, శరీరములో అన్ని భాగములు పని చేయుచున్నపుడు, శరీరమును నడుపు డ్రైవర్ (మంత్రగాడు) ఒకడు గలడు అన్నాము కదా! **ఆ డ్రైవర్ జీవుడుకాదని బాగా జ్ఞప్తికుంచుకోవలెను. శరీరమను వాహనములో జీవుడు ప్రయాణికుడు మాత్రమే డ్రైవర్ మాత్రము కాదు.**

జీవుడు (జీవాత్మ) అను ప్రయాణికుడు ప్రయాణము చేయు నిమిత్తము శరీరమను వాహనము నిర్మాణము చేయబడినది. వాహనము

నడిచినంతవరకు జీవుడు దానిలో ప్రయాణించుచుండును. వాహనము నడువలేని స్థితికి వచ్చినపుడు దానిని నడుపు డ్రైవర్ ఈ బండి పనికిరాదు, వేరే క్రొత్తవాహనము నెక్కెదమని, జీవున్ని పిలుచుకొని పోయి వేరే క్రొత్త బండి ఎక్కును. బండి పనికిరానపుడు ప్రయాణికుడొకడే దిగక ఆ బండిని నడుపు డ్రైవర్ కూడా దిగును. అలా ప్రయాణికుడు, డ్రైవర్ ఇద్దరూ పనికిరాని బండి దిగి వేరొక క్రొత్త బండి ఎక్కి ప్రయాణము సాగించుచుందురు. బండి ఏదైనా ప్రయాణకుడు ఒకడే, డ్రైవర్ ఒకడే ఉండును. ఒక ప్రయాణికుడు ప్రయాణించుటకు ఒక్క సీటు మాత్రమున్న బండిని నడుపుటకు, ప్రయాణికుని వెంట శాశ్వితముగా ఒకే డ్రైవర్ ఉండును. ఎన్ని వాహనములు చెడిపోయినా, ఎన్ని వాహనములు మారినా ప్రయాణికుడు ఒకడే, డ్రైవర్ ఒకడే, దారి ఒకటేనని మరువకూడదు. **ఒక వాహనము చెడిపోయి నడువలేని స్థితికి వచ్చినపుడు, వేరొక క్రొత్త వాహనమును అందించు వాహనము తయారు చేయువాడు మరొకడు గలడు. వాడే వాహనముల అధిపతి.** ఎంతమంది ప్రయాణికులకైనా క్రొత్త వాహనములను అందించు స్థోమత వాహనాలను తయారు చేయు వానికుండును. వాహనములను తయారు చేయువాడు ఒక ప్రయాణికుడు కూర్చుండునట్లు ఒక సీటును, ఒక డ్రైవరు నడుపునట్లు ఒక డ్రైవర్‌సీటును, వాహనములో ఉంచడమే కాక, మొదటి వాహనములో ఎన్ని భాగములు ఉన్నవో, అన్ని భాగముల నమూనాతోనే బండిని తయారు చేసియుండును.

ఒక బండిలో ప్రయాణము ఆగిపోతే దానిలోని డ్రైవర్, ప్రయాణికుడు ఇద్దరూ దిగి వెంటనే క్రొత్తబండి ఎక్కి పోగలరు. శరీరమను బండిలో జీవుడు తన సామానుతో (లగేజితో) ప్రయాణము చేయుచుండును. బండిని నడుపు మంత్రగాడు (డ్రైవర్) మిస్టర్ × అనుకొన్నాము. డ్రైవర్

ఎవరైనది చివరిలో చెప్పుకొందాము. కానీ ఎన్ని క్రొత్త వాహనములనైనా ఎందరికైనా ఇచ్చువాడు ఒకడు గలడు. **ఆ వాహనముల యజమానిని పరమాత్మ లేక దేవుడు అంటాము. ఇపుడు నీ శరీరము ఒక వాహనము కాగా, దానిని ఇచ్చినవాడు దేవుడు. నీ శరీర వాహనములో జీవిత ప్రయాణమును సాగించువానివి నీవేనని తెలుసుకో.** కానీ ఎన్నో కోట్ల సంవత్సరముల నుండి నీకు పర్మనెంట్ డ్రైవర్‌గాయుండి, నీ శరీర వాహనములో నీతోపాటు నీముందే కూర్చొని, దానిని నడుపుచున్న వానిని నీవు ఎపుడూ చూడలేదు. వాడు ఎవడో కూడా చాలామందికి తెలియదు. వానిని ఇపుడు కూడ మిస్టర్ × గానే చెప్పుకొందాము. జీవుడు ప్రయాణించు శరీరమను బండిలో జీవుని వెంట ఒక మూట ఉండునని చెప్పుకొన్నాము కదా! ప్రయాణికుడైన జీవుడు ఎపుడు పాతబండి దిగి క్రొత్తబండి ఎక్కినా, అపుడు తన మూటను జాగ్రత్తగా తీసుకొని పోవుచుండును. ఏ బండి ఎక్కినా తన ప్రక్కనే ఆ మూటను ప్రయాణించు జీవుడుంచుకోవడము జరుగుచుండును. ఆ మూటలో ఏమి సామగ్రియుందని గమనిస్తే అందులో అనేక రకములైన పచ్చికాయలు, పక్వానికి వచ్చి మాగిన పండ్లు కలవని తెలియుచున్నది. ఎడతెరపి లేని ప్రయాణములో జీవుడు ఆ ఫలములను ఆహారముగా తీసుకొనుచుండును. ఆ విధముగా సంచిలోని ఫలములను తింటూ ఉంటే అవి అయిపోయి సంచి ఖాళీ అవుతుంది కదా! కానీ జీవుడు ఆ ఫలమును తింటూ అవి అయిపోకుండా దారిలో ప్రక్కనే ఉన్న చెట్లకు కాచి వేలాడుచున్న ఫలములను పోతూ పోతూనే కొసుకొని తన సంచిలో వేసుకొనుచుండును. ఈ విధముగా దారి ప్రక్కన అనేక చెట్లకు కాచిన అనేక జాతి ఫలములను తెంపుకొనుచూ, తన సంచి ఖాళీ కానట్లు, తను ఎంత దూరము ప్రయాణము చేసినా ఫలములు అయి పోకుండునట్లు

చేసుకొనుచుండును. ఈ విధముగా దారిలో జీవుడు ప్రయాణిస్తూ, కొన్ని పక్వానికి వచ్చిన ఫలములను తింటూ ఖర్చు చేస్తూ, కొన్ని కాయలను అందిన చెట్లనుండి పెరికి జమ చేసుకొనుచుండును. ఒక దినము తన ప్రయాణములో నాలుగు పండ్లను తింటే, ఆ దినము తొమ్మిది లేక పది కాయలను జమ చేసుకొనుచుండును. ఒక్కొక్క దినము పది పండ్లను తిని ఖర్చు చేస్తే, ఆ దినము మూడు లేక నాలుగు పండ్లను జమ చేసుకొనును. ఈ విధముగా ఎచ్చుతగ్గులుగా ఖర్చు, ఎచ్చుతగ్గులుగా జమ ఉండును. అట్లు సేకరించిన పండ్లు జమయే ఎక్కువై కొన్ని సంచులు మిగులుగా చాలామందికి గలవు. ఇదంతయు జీవుని ప్రయాణమేనని ముందే చెప్పుకొన్నాము కదా! ఈ మూటల సంగతేమిటని కొందరడుగవచ్చును. ఈ మూటలు మనకందరికీ ఉన్న మూటలే. అవియే కర్మ మూటలు. వాటిలో అనేకరకమైన పండ్లు అనబడు పాపపుణ్యములు గలవు. మనము నిత్యము పాపపుణ్యములను కర్మ నిల్వలనుండి అనుభవిస్తూ అయిపో గొట్టుచూ, తిరిగి క్రొత్త పాపపుణ్యములను కర్మసంచిలోనికి జమ చేయుచున్నాము.

ఒక ప్రయాణమన్న తర్వాత గమ్యమనునది ఉండి తీరాలి కదా! అట్లు గమ్యము లేకుండా ఎడతెరిపిలేని ప్రయాణము శరీర వాహనములు మార్చుచూ మనము చేయుచున్న మాట నిజము. ఇక్కడ ఎడతెరిపి లేని ప్రయాణమేమిటి? గమ్యముండాలి కదా! అని కొందరడుగవచ్చును. దానికి జవాబు ఏమనగా! గమ్యమనునది ఉన్నది. **ఆ గమ్యము పేరు మోక్షము.** అయితే గమ్యమును చేరాలంటే ఒక నియమము గలదు. ఆ నియమ మేమంటే ప్రయాణికుని వద్దనున్న సంచి ఎపుడు ఖాళీ అయితే అపుడు వాడు ఎచట గలడో అదియే వాని గమ్యమగును. ఈ నియమము ప్రకారము ప్రయాణమును మొదలు పెట్టిన జీవుడు, తన నియమమును తానే

మరిచిపోయి ప్రయాణిస్తూ, తన సంచిని ఖాళీ చేసుకోకుండా, కర్మ ఫలములను నింపుకొనుటకు ప్రయత్నము చేస్తూనేయున్నాడు. అట్లు ఖర్చయ్యే ఫలములకంటే జమ అయ్యే ఫలములే ఎక్కువగా ఉన్నందువలన కొన్ని సంచులు మిగులుపడిపోయిన వారు కూడా చాలామంది కలరు. ఈ విషయమునంతటిని ఏదో ఒక కథలాగ చూడక **ప్రయాణికునివి నీవేనని అనుకో, వాహనము నీ శరీరమే అనుకో, మూటలు నీ కర్మమూటలే అనుకో. ఆ మూటలోనివి నీవు సంపాదించుకొన్న పాపపుణ్యములని తెలుసుకో.** నీవు ఎన్ని అనుభవించినా అనుభవించవలసిన ఎన్నో కర్మ ఫలములు ఇంకా నీవద్ద మిగిలి ఉన్నాయనుకో. ఇపుడు నీవు మోక్షగమ్యము ఎందుకు చేరలేక పోతున్నావో అర్థమై ఉంటుందనుకుంటాను.

ప్రయాణమునంతటినీ మనిషికి వర్తింపజేసుకొని చూస్తే జీవుడు కొన్ని కోట్ల సంవత్సరములనుండి జీవితమును శరీరముతో కొనసాగిస్తూనే వస్తున్నాడు. మరణములో ఎవడూ లేకుండా పోవడము లేదు. మరణ మనునది జీవుని నాశనము కాదు. మరణములో శరీరము మాత్రము నశించుచున్నది. మరణము వలన జీవునికి పాతశరీరము పోయి క్రొత్త శరీరము వస్తున్నది. అందువలన జీవుడు చావడము లేదు, పుట్టడము లేదు. మరణమును పొందుచున్నది శరీరము మాత్రమే. అలాగే పుట్టుచున్నది కూడా శరీరమే. జీవుడు పాతవస్త్రమును వదలి క్రొత్తవస్త్రమును ధరించినట్లు, పాతశరీరమును వదలి క్రొత్తశరీరమును ధరించుచున్నాడు. శరీరవాహనము పాతది నిలిచిపోతే చచ్చుట అనియు, క్రొత్త శరీర వాహనము వస్తే పుట్టుట అనియు పేరు గలదు. చచ్చినపుడుగానీ పుట్టినపుడు గానీ, శరీరములో ప్రయాణించు జీవునిలోగానీ దానిని నడుపు డ్రైవర్‌లో గానీ ఎటువంటి మార్పు ఉండదు. మరణములో జ్ఞాపకాల పుట్ట అయిన

మనస్సు నశించిపోవడము వలన పోయిన శరీరములోనున్న జ్ఞాపకాలన్నీ ఆ శరీరముతోనే పోవుచున్నవి. అందువలన పాత శరీరము లోని సమాచారమును తెలుపునది ఏదీ లేనిదానివలన వెనుకటి జన్మ విషయము జీవునకు ఏమాత్రము తెలియకుండా పోవుచున్నది. క్రొత్త శరీరములోని క్రొత్త మనస్సు తెలుపు విషయములు మాత్రమే తెలియు చుండును. పోయిన పాత శరీరములో తాను ఏమి చేసినది జీవునకు తెలియదు. శరీరబండిని నడుపు డ్రైవర్‌కు మనకున్నట్లు భాగాలుండవు. వాడు భాగములు లేని ఏకస్వరూపుడు కావున వానికి అన్నీ జ్ఞాపకము ఉంటాయి, అన్నీ తెలుసు. అయితే వాడు జీవునికి ఒకటి కూడా చెప్పడు. వాని పని బండిని తోలే పని మాత్రమే. వాడు మిస్టర్ × గానే జీవునికి తెలియకుండా బండిని మాత్రము నడుపుచుండును. **(గమనిక :-** వెనుకటి జన్మల వివరము తెలియక పోవడము వలన, వాటిని ప్రత్యక్ష ప్రమాణముగా, శాస్త్రబద్ధముగా ఎవరూ చెప్పకపోవడము వలన, భూమి మీద మానవుడు పూర్తి అజ్ఞానములో మునిగి పోయి జీవునికి జన్మలే లేవని చెప్పుకొను ప్రమాదమున్నది. ఇప్పటికే క్రొత్తగా పుట్టిన మతములన్నీ జన్మలు లేవనియే చెప్పుచున్నవి. మరియు హిందూమతములోని హేతువాదులు, నాస్తికవాదులు కూడ పునర్జన్మనునది అవాస్తవమని అంటున్నారు. కావున పూర్తిగా జన్మలు లేవను పరిస్థితి భూమి మీద ఏర్పడకుండుటకు, మన శరీరములో డ్రైవర్‌గానున్న వాడే కొన్ని వందల సంవత్సరములకు ఒకమారు బహు అరుదుగా ఎవరికో ఒకరికి వెనుకటి జన్మ జ్ఞాపకమును కలుగజేయును. మనిషి పుట్టిన తర్వాత చిన్నవయస్సులో మూడు నుంచి ఐదారు సంవత్సరములలోనే వెనుకటి కొన్ని విషయాలను జీవునికి చెప్పును. అపుడు ఆ పిల్లవాడుగానీ, పిల్లగానీ తనకు లోపలే తెలిసిన విషయములను బయటికి

చెప్పుచుందురు. అట్లు చెప్పిన సంఘటనలు ఎన్నో జరిగాయి. ఆ వెనుకటి జ్ఞాపకము దాదాపు ఒక సంవత్సరము అంతకంటే తక్కువ కాలముండి తర్వాత లేకుండా పోవును. అది వాస్తవముగా జ్ఞాపకముకాదు. శరీరము లను నడుపుచున్న మిస్టర్ యక్స్ అనువాడు చెప్పుచున్నంత వరకే చెప్పుచుందురు. అతను ఎపుడు చెప్పకుండా మానుకొంటే అపుడు పిల్లవాడు ఏమీ చెప్పలేడు. ఈ తతంగము తెలియని హేతువాదులు అలా చెప్పే పిల్లలకు ఏదో రోగముందనీ, దానివలన అలా చెప్పుచుందురనీ అదంతయు వాస్తవముకాదనీ అనుచుందురు. దీనిని గురించి పూర్తిగా మేము వ్రాసిన **"పునర్జన్మ రహస్యము"** అను గ్రంథములో వివరించినాము.)

జీవుడు ఎన్ని శరీములు మారినా వెనుకటి ఏ ఒక్క శరీరములోని జ్ఞాపకము కూడ జీవునికుండదు. కావున ఇపుడు ఉన్న జన్మలో మాత్రమే నేను పుట్టాననుకొనుచుండును. వెనుకటి సమాచారము ఏమీ తెలియదు దానివలన ఇంతకు ముందు తాను ఎప్పుడూ భూమిమీద పుట్టలేదను భావముతో ఉండును. **వాస్తవానికి తాను ఇంతకు ముందు ఎన్నో శరీరములను ధరించానని తెలియని మనిషి, ఇక తర్వాత కూడా ఎన్నో శరీరములను ధరించవలెనని తెలియని మనిషి, ప్రస్తుతమున్న జన్మను మాత్రమే తెలిసిన మనిషి, ఇప్పుడు పుట్టినది తప్ప ముందు వెనుకనున్న జన్మల వివరము తెలియక, ఇప్పుడు మాత్రమే తనను దేవుడు పుట్టించాడని అనుకొనుచుండును.** లేక తానే ఇపుడు పుట్టానని తనను ఏ దేవుడు పుట్టించలేదని అనుకొనుచుండును. ఈ భావము హిందూమతములోగాక ఇతర మతములలో ఉన్నదనుకుంటాము. హిందూమతములో భగవద్గీత బోధవలన మనిషికి ఎన్నో జన్మలు గడచినవనీ, తర్వాత మోక్షము పొందు వరకు ఎన్నో జన్మలు కల్గునని తెలియుచున్నది. ఇతర మతములలో

మనిషి చనిపోయిన తర్వాత దేవుడు తిరిగి అదే శరీరముతోనే లేపి, మనిషి చేసుకొన్న పాపపుణ్యములకు తీర్పు తీర్చి శిక్షవేయునని చెప్పియున్నదని చెప్పుకోగ విన్నాము. ఆ మాట వాస్తవమే అట్లు ఒకమారే దేవుడు చేయు చున్నాడా? అని యోచిస్తే ఒక్క మారేనని సూచనలేమి లేనట్లు తెలియు చున్నది. ఇదే విషయమును హిందూమత పురాణములలో కూడా చెప్పు కొన్నారు. కానీ అది శాస్త్రబద్ధత కాదని గీతలో చెప్పినది మాత్రమే శాస్త్రబద్ధతని మేము చెప్పుచున్నాము.

భగవద్గీత జ్ఞానము తెలిసినవారు కొందరు తమకు ఎన్నో జన్మలు గడచిపోయినవని విశ్వసించినవారై, తర్వాత రాబోవు జన్మలనుండి బయట పడాలని తలచినవారై, ఇప్పటినుండి మోక్షమునకై ప్రయత్నము చేయువారు గలరు. అటువంటి ఉద్దేశము కల్గిన వారికి సరియైన జ్ఞానమార్గము దొరకక, వారికి తమవద్దనున్న కర్మసంచి విషయము తెలియక, వారి ప్రయత్నము వారు చేయుచునే ఉన్నారు. మనవద్ద సంచి ఉన్నంతవరకు, అది ఖాళీ కానంత వరకు, శరీరవాహన మంత్రగాడు (డ్రైవర్) మనలను ఒక బండి దిగుతూనే మరియొక బండిని బలవంతముగా ఎక్కించుచుండును. కర్మ ఎపుడు లేకుండా పోతుందో అపుడు మోక్షము లభిస్తుంది. ఎందుకనగా! కర్మ లగేజి మనవద్దయున్నంత వరకు మన డ్రైవర్ మనలను వదలిపోడు. డ్రైవర్ పోయినపుడు వాహనమును నీవు ఎక్కవలసిన పనిలేదు. డ్రైవర్ (మంత్రగాడు) ఉన్నంతవరకు అతను నిన్ను బండిలోనే కూర్చొనబెట్టును. జీవుని వద్ద కర్మసంచి ఖాళీ అయిపోతే. నీవు జీవున్ని వదలి పెట్టమని జీవున్ని వాహనమును ఎక్కించవద్దని డ్రైవర్‌కు దేవునివద్ద నుండి శాసనము చేయబడినది. అందువలన ఎచట కర్మ కలిగిన జీవుడుండునో, అచట

జీవునికి వాహనముండును మరియు దానిని నడుపు మంత్రగాడు ఉండును ప్రతి జీవునికి ఒక శరీరము, ఒక డ్రైవర్ ఉండుట సర్వసాధారణము.

భూమి మీద కొందరు మోక్షము కొరకు ప్రయత్నము చేయుచున్నారు. దానికొరకు వారు అనేక మార్గములను అవలంభించుచున్నారు. ఎవరు ఎన్ని మార్గములను అవలంభించినా కర్మ విషయము తెలియనిదీ, శరీరమును నడుపు వాని విషయము తెలియనిదీ మోక్షము దొరకదు. కర్మ సంచియున్నంతవరకు డ్రైవరు వదలడని తెలియనివారు, శరీరము లోపలి ధ్యాసను వదలి, బయటి భక్తిలో పడిపోయి, అనేక భక్తి మార్గములను ఆచరించుచున్నారు. మోక్షము కొరకు యజ్ఞములు చేయువారు, దానములు చేయువారు, వేదపఠనములు చేయువారు, తపస్సులు చేయువారు కలరు. కొందరు చేయించువారూ కలరు. ఈ నాల్గు రకముల భక్తిమార్గములను ఆచరించు ఎవరికైనా మోక్షము ఎప్పటికీ లభించదని భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగమందు 48, 53 శ్లోకములలో వివరముగా గలదు. భగవద్గీతలో భగవంతుడు చెప్పిన వివరము తెలియక చాలామంది పొరబడిపోయి, అసలైన దైవమార్గములో ప్రయాణించ లేకపోవుచున్నారు. భగవద్గీతలో భగవంతుడు చెప్పినట్లు శరీరాంతర్గతములో చూచుకోక, శరీరమును నడుపుచు నీ ప్రక్కనేనున్న శరీరవాహక మంత్రగానిని తెలియకున్నంత వరకు ఎవనికీ మోక్షము లభించదు. కర్మ సిద్ధాంతమును తెలియనివారు, శరీరములో ఉండి కర్మ ప్రకారము శరీరమును నడుపువానిని తెలియనివారు, భూమిమీద ఎంత పెద్ద స్వామీజీలైనా, ఎంత పెద్ద పీఠాధిపతులైనా బండి ఎక్కవలసిందే ప్రయాణము చేయవలసిందే. దేవుని లెక్కలో సామాన్యుడైనా స్వామీజీలైనా అందరూ సమానమే. **జ్ఞానపథము ప్రకారము నడుచు సామాణ్యుడైన మోక్షము పొందగలడు. జ్ఞానపథము**

**ప్రకారము నడువని స్వామిజీయైన మోక్షము పొందలేదు.** యంత్రమును నడుపు జంత్రగాడు ఉన్నట్లు, శరీర యంత్రమును నడుపు మంత్రగాడు ఉన్నాడని గ్రహించి, కర్మ ఉన్నంతవరకు మంత్రగాడు మనలను వదలడని తెలిసి, శరీరములోనే ఉన్న కర్మనూ, శరీరములోనే ఉన్న మంత్రగాడైన మిస్టర్ × ను తెలిసీ, ఖాళీ అయిన కర్మసంచిని మిస్టర్ × కు ఇచ్చిన రోజు నీకు మోక్షము లభించగలదు. అపుడు చనిపోయిన వానికి ఆ మరణము ఆఖరీ మరణము కాగలదు. అంతవరకు లోపలి వివరమూ విషయమూ తెలియనిదే, కర్మసంచిని మంత్రగానికి ఇవ్వనిదే నీకు ఎన్నిమార్లు మరణము వచ్చినా అది ఆఖరీ మరణము కాదు.

ఆఖరీ మరణమంటే ఏమిటో ఇపుడు తెలిసింది. కొంతమంది స్వామిజీలు చనిపోయినపుడు మా గురువుగారు మోక్షము పొందాడని ఆ స్వామిజీ శిష్యులు అనుకోవడము జరుగుచున్నది. అపుడు చనిపోయిన ఆ స్వామిజీ ఆఖరీమరణము పొందాడని మనమనుకోవచ్చును. అలా అనుకోవడములో నిజము ఉండవచ్చును లేక అబద్ధము ఉండవచ్చును. ఆఖరీ మరణము పొందని వానిని కూడా అతను మోక్షము పొందాడని పొరపాటుగా మనము అనుకోవచ్చును. నిజముగా ఆఖరీమరణము పొంది మోక్షము పోయిన వానిని పొరపాటుగా అతను మోక్షమును పొందలేదని కూడా అనుకోవచ్చును. ఇలాంటి గందరగోళము జరిగి, మరణించిన వారిలో ఎవరు మోక్షము పొందారో, ఎవరు పొందలేదో కూడా మనుషులకు తెలియకుండా పోవునని ఊహించిన భగవంతుడు, తన భగవద్గీతలో ఆఖరీ మరణమును గురించి అక్షర పరబ్రహ్మయోగమున చివరిలో 23వ శ్లోకము నుండి 28 శ్లోకము వరకు చెప్పాడు.

**మొదట 23వ శ్లోకములో ఏమి చెప్పాడని చూడగా ఇలా ఉంది.**

**అధ్యాయము 8, శ్లోకము : 23**

యత్రకాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగిన ః।
ప్రయాతా యాన్తి తం కాలమ్ వక్ష్యామి భరతర్షభ ॥

యోగులైన వారు ఎపుడు చనిపోతే తిరిగి పుట్టుదురో, ఎపుడు చనిపోతే తిరిగి పుట్టరో ఆ కాలమును గురించి చెప్పెదను వినుము.

ఇపుడిది శాస్త్రబద్ధమైన విషయముగా అందరూ గ్రహించాలి. భగవంతుడు చెప్పబోవు కాలమును తెలుసుకొన్న తర్వాత అపోహలకు ఏమాత్రము తావుండదు. ఎటువంటి వారి మరణమునైనా భగవంతుడు చెప్పిన సమయముతో పోల్చి చూచి అది ఆఖరీ మరణమా కాదా, అని తేల్చి చెప్పుకోవచ్చును. పై శ్లోకములో **"యోగినః"** అని ఈ కాలము యోగులకు మాత్రమే వర్తించునని చెప్పాడు. కావున యోగులైన వారిలో పూర్తి కర్మ అయిపోయిన వారెవరు? కర్మ అయిపోక ఇంకా మిగిలిన వారెవరని కూడా గ్రహించవచ్చును. యజ్ఞయాగాదులు చేయువారు, వేద పఠనము చేయువారు, దానములు చేయువారు, తపస్సులు చేయువారు యోగులు కాదని, వారు జన్మకు తప్ప మోక్షముకు పోరని, అటువంటి వారిని చూడవలసిన పనే లేదని, గీతలోని విశ్వరూపసందర్శన యోగము నందు గల 48,53 శ్లోకముల ప్రకారము చెప్పవచ్చును. యజ్ఞ, వేద, దాన, తపములు చేయు నాల్గు రకముల వారిని వదలి యోగులైన వారిలో కూడా కర్మ అయిపోక, డ్రైవర్ విడిపోక ఎవడు తిరిగి పుట్టునో, వానిది ఆఖరీ మరణము కాదనీ, ఎవని శరీరమును నడుపు డ్రైవర్ వానిని వదలి

పెట్టి పోవునో, ఎవని కర్మ పూర్తి అయిపోవునో అటువంటి యోగి పొందిన మరణము ఆఖరీ మరణమగునని తెలియాలి. ఆఖరీ మరణమును యోగులైన వారు కూడా ఏ సమయములో పొందుదురో గీతయందు అక్షర పరబ్రహ్మ యోగములో 24వ శ్లోకమునుండి భగవంతుడే చెప్పాడు. కావున నేను ఆ సమయమును గురించి చెప్పనవసరము లేదు. భగవద్గీత చదివితే మన డ్రైవర్ అయిన **'మిస్టర్ ×'** కూడా తెలియబడునని తెల్పుచున్నాము. మేము భగవద్గీతను చాలామార్లు చదివాము, మీరు చెప్పినట్లు ఆఖరీ మరణము గురించి, శరీరమును నడుపువానిని గురించి ఏమీలేదే అని కొందరడుగ వచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! **ఆధ్యాత్మిక రంగములో విప్లవాత్మక రచనతో కూడుకొన్న "ప్రథమ దైవ గ్రంథము త్రైతసిద్ధాంత భగవద్గీత"ను చదవండి, అన్నీ అర్థము కాగలవు.**

# సమాప్తం

*****

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**



**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

